# న్యూఢిల్లీ లేఖ

డా. జయ్ దుబాషి



కేవలం ఢిల్లీ నగర జనాభాకు రెండింతలు మాత్రమే జనాభాగల్గిన అతి చిన్న దేశమైన ఆఫ్ఘనిస్థాన్ అంత్యంత గొప్ప సామ్రాజ్యమైన సోవియట్ సేనలను తన దేశం నుంచి ఉపసంహరించుకునేట్లు చేసింది. ఈ విషయాన్ని గురించి పట్టించుకోవడానికి మనకున్న కష్టాల్లో మనకు తీరికలేదు. రష్యావారు మొత్తం లక్షా 20 వేల సైనికదళాలని ఆఫ్ఘన్‌కి పంపింది. మనం శ్రీలంకకు పంపిన సైన్యానికి యిది రెండింతలు ఎక్కువ. వీరిలో ఎనభైవేల మంది మాత్రమే తమ స్థావరాలకు తిరిగివస్తున్నారు. ఆఫ్ఘన్‌లు చాలా ధైర్యంగా పోరాడారు. కానీ పది లక్షల మందికి పైగా సిపాయిలు, ముజాహిదీన్‌లు, పౌరులు ఈ పోరాటంలో హతులయ్యారు. ఇంచుమించు ముప్పయి లక్షలమంది పాకిస్తాన్, ఇరాన్‌లలో కాందిశీకులుగా తలదాచుకోవల్సి వచ్చింది. అంటే జనాభాలో నాలుగవ వంతు ఏదో ఒకవిధంగా దెబ్బతిన్నారు. ఈ చర్యలో మొత్తం దేశం అల్లకల్లోలమైంది.

ఆఫ్ఘన్ జనాభాకు ఎభైరెట్లు జనాభాగల భారతీయుల లెక్కలో దీనిగురించి ఆలోచించండి. మన పరంగా యోచిస్తే అయిదు కోట్లమంది హతమయివుండేవారు, పదిహేను కోట్ల మంది చుట్టుపక్కల దేశాలకు కాందిశీకులుగా వెళ్ళవలసి వచ్చేది. రష్యన్‌లు ఆఫ్ఘనిస్థాన్‌పై దండెత్తడానికి బదులు మనదేశంపై దండెత్తివుంటే ఏమిజరిగివుండేదో ఆలోచిస్తే నాకు ఆశ్చర్యంగా వుంటుంది. మనలో కొందరు అలా దండెత్తివచ్చే శత్రువులకు అండగా నిలబడేవారు. అయితే ఎందరు? పది లక్షలా? ఇరవై లక్షలా? ముప్పయి లక్షలా? నెను తప్పుగా ఆలోచించవచ్చు. కానీ నాకొక భావన ఏర్పడింది. 99.9 శాతం జనాభా విరోధులతో కుమ్ముక్కయ్యేవారు. రాజీవ్‌గాంధీ అండ్ కంపెనీ నాయకత్వంలోని కాంగ్రెసువారు ఆ దుర్మార్గులకి మొట్ట మొదట దండలు వేసేవారు. తరువాత నిస్సందేహంగా కమ్యూనిస్టులు, పత్రికలు, ఇతరత్రా పనిచేసే, వారికి వంతపాడేవాళ్ళు. అత్యవసర పరిస్థితిలో ఆఫ్ఘనిస్థాన్‌లో ఎలా అయితే చేసారో అలా చేసేవారు.

సహనం మంచిదేకానీ దానికీ ఒక హద్దువున్నది. మనం దేనినైనా సహించేటట్టువున్నాం. రోడ్లలో

## ఆఫ్ఘన్ల ఘన విజయం!

మురికిని, ప్రభుత్వంలో అవినీతిని, స్త్రీలపట్ల, పసిపిల్లలపట్ల అత్యాచారాల్ని, పేదరికం, అధిక సంపదపట్ల మనం సహనం వహిస్తాం. ఇవి అన్నీ వ్యక్తిగతంగా మనల్ని దెబ్బతీయనంతకాలం, మన జరుగుబాటు బాగున్నంతకాలం మనం సహనం వహిస్తాం. మనుగడకోసం ఏదైనా సరే పణంగా పెట్టడానికి మనం సిద్ధంగా వున్నాం. దేశ మనుగడేకాదు, సమాజ మనుగడేకాదు, స్వచ్ఛమైన భౌతిక మనుగడ. రెండు శతాబ్దాలు మనం బ్రిటిష్ పాలకులను నెత్తినెక్కించుకుని మోశాం. మనలో ఎందరో తెరగబడ్డారు. తొలి శతాబ్దంలో బ్రిటిష్ పాలనను మనం అంతగా పట్టించుకోలేదు. శత్రువులు గొలుసులు గలగలలాడించేసరికి మరో దారికోసం చూశాం. తరువాత వందేళ్ళలో నిరసనలు ప్రారంభమయ్యాయి. అయితే నిరసనలో పాల్గొన్న ప్రజలు ఎప్పుడూ ఆఫ్ఘన్ తిరుగుబాటుతో పోల్చుకుంటే చాలా తక్కువ. నిరంకుశాధికారం అలాగేవుంది. సుభాష్‌చంద్రబోసు, హెచ్. వి. కామత్‌ల మాదిరిగానే ఐ. సి. ఎస్. ఉద్యోగాలు వదులుకొని స్వాతంత్ర్య పోరాటంలో దిగిన ఒక్క వ్యక్తి వున్నాడని నేననుకోను. ఎల్. కె. ఝూలు, బి. కె. నెహ్రూలు, పలువురు మినన్‌లు అత్యవసర పరిస్థితిలో ఏవిధంగా చేశారో అలాగేచేశారు. వ్యాపారస్తులు డబ్బు సంపాదించడంలో పడ్డారు. వారిలో కొందరు మాత్రమే మినహాయించబడ్డారు బొంబాయిలో వాల్‌చంద్ హిరాచంద్, కలకత్తాలో ఘనశ్యామ్‌దాస్ బిర్లాలు మినహా మిగిలినవారంతా వ్యాపారం సాగించారు. మహాత్మాగాంధీ సహాయ నిరాకరణోద్యమం మంచి వూపుగా వున్న సమయంలో సహితం వాస్తవంగా, భౌతికంగా అందులో పాల్గొన్న భారతీయుల సంఖ్య ఎప్పుడూ పేలవంగానే వుంది. 35 కోట్ల జనాభాలో బహుశా 10 లక్షలమందికి మించలేదు.

ఈ రోజుకీ మనల్ని ఏదీ కదిలించలేకపోతోంది. ప్రతి నెలా పంజాబులో వందలమంది సామూహికంగా హత్యగావింపబడుతున్నారు. వార్తాపత్రికలలో ఏవో కొన్ని పతాక శీర్షికలు తప్పించి అక్కడ భయానకం జరిగిందని, వారు అక్కా చెల్లెళ్ళు, అన్నదమ్ములన్న సూచనలు లేమీలేవు. వింధ్యకి దక్షిణం వేపు వెళ్ళండి. ఎక్కువ మంది భారతీయులు హతమార్చబడుతున్న శ్రీలంక యుద్ధంలాగే ఎవ్వరూ పంజాబు గురించి మాట్లాడరు. కానీ వింధ్యకి ఉత్తరాన కొంత సందడి వుంది. నాకు తెలిసినంతవరకూ మనకే సంబంధం లేని శ్రీలంకలో భారతీయ సైనికులని తమ స్వజనాన్నే చంపమని కోరినప్పుడు అక్కడ మన సైనిక జోక్యం గురించి ఏ ఒక్క రాజకీయపార్టీ నిరశించలేదు.

భారత రాజకీయపార్టీలు తీర్మానాలు ఆమోదించడంలో చాలా ఉత్సాహంగా వుంటాయి.



కానీ అంతకుమించి అవి చేసింది ఏమీలేదు. పార్లమెంటు కూడా నిశ్శబ్దంగానే వుంది.

బోఫోర్స్ సంగతి తీసుకోండి. అది యించుమించు చల్లారిపోయింది. మనం ఏం చేశాం? రాజీవ్‌గాంధీని పదవినుండి వైదొలగమని అడిగాం. అంతకుమించి ఏమి చేయలేకపోయాం. ఇక్కడ ఈ దుష్టులను బయటపెట్టడానికి వుపయోగించేందుకు సిద్ధం చేయబడిన ఆయుధం వుంది. మన వార పత్రికలు కొన్ని ఈపనిచేశాయి. అరుణ్‌శౌరి, తదితరులను నేను అభినందిస్తున్నాను. కానీ వేరే కొన్ని పత్రికలు వున్నాయి. వాటిలో ప్రముఖమైన టైమ్స్ ఆఫ్ ఇండియా ప్రతిపక్షాలను తమాషాగా తీసుకుంది. తమ గల్లాపెట్టెలని నోట్ల కట్టలతో నింపుకున్న ఈ వార్తా పత్రికలు రష్యనులను రెండు చేతులా ఆహ్వానిస్తాయి. 1975లో శ్రీమతి ఇందిరాగాంధీ దేశాధినేతగా అధికారం స్వీకరించినప్పుడు ఏవిధంగా చేశారో అదే విధంగా సోవియట్ నియంతని ఎందుకు ఆహ్వానిస్తున్నాయో తెలుపుతూ ఈ వార్తా పత్రికల సంపాదకులు పెద్దపెద్ద వ్యాసాలు రాస్తారు. ప్రతిరోజు మొదటి పేజీలో గోర్బచేవ్ బొమ్మ వుంటుంది. సోవియట్ రాయబార కార్యాలయంలో ఆ పత్రికా సంపాదకులు కాక్‌టెయిల్ పార్టీలకు హాజరవుతూ వుంటారు. అహింస, సహాయ నిరాకరణోద్యమాలకు, పొత్తుకు, సక్రమమైన




విబంధోద్యమానికి మధ్యగల చక్కని తేడా గురించి వారికి చక్కగా వివరిస్తారు.

దేనితోనైనా రాజీపడిపోవడానికి మన భారతీయులు అంత సిద్ధంగా వుంటా రెందుకని? మనం ఒంటరిగా వున్నామా? ఒంటరితనం దేనికి? ధనాన్ని ఆర్జించడానికా, ఫైవ్‌స్టార్ రెస్టారెంట్‌లకు వెళ్ళి ఖరీదయిన భోజనం చేయడానికా, లక్షద్వీపాలలో శలవులు గడపడానికా, స్విస్ బ్యాంక్‌లో డబ్బును దాచడానికా, తమ ఇళ్ళల్లో నేలపై ఇటాలియన్ చలువరాతితో అలంకరించ డానికా, చేత తుపాకులతో అంగరక్షకులు సంరక్షిస్తుండగా రాజీపథ్ గుండా పరుగెత్త డానికా? ప్రధానమంత్రిని పదవీచ్యుతుని చేయ డానికి 30 నుంచి 40 కోట్లుదాకా తనకు యివ్వజూపినట్టు ఒక మాజీ రాష్ట్రపతి అన్నారు. ఆ అన్న వ్యక్తికి విలువలేదుగనుక మనం దానిని ఒక పెద్ద జోక్‌గా తీసుకున్నాం. అసలు అటువంటి వ్యక్తి రాష్ట్రపతిగా ఎందుకువచ్చారు? అలాగే రాజీవ్‌గాంధీ ప్రధానమంత్రి ఎలా అయారు! అని మనం ఆశ్చర్యపోవటం లేదు. మనల్ని 21వ శతాబ్దంలోకి తీసికెళ్ళడానికి భారతదేశం వంటి ఒక పెద్ద దేశం నెహ్రూలు, గాంధీల కన్నా ఉత్తములని కనుగొని వుండవచ్చు. మన ఇష్టానుసారంగా వదిలినంత కాలం మనల్ని ఏ విషయం బాధించదు. ఆ పనే బ్రిటిషువారు చేసి, రెండు వందల సంవత్సరాలు పరిపాలించారు. అదేపని రష్యనులు చేస్తే ఐ. సి. ఎస్. ఆఫీసర్లు బ్రిటిషువారి బూట్లు నాకినట్లు ఐ. ఏ. ఎస్. ఆఫీసర్లు వాళ్ళ బూట్లు నాకుతారు. రష్యనులూ రెండు వందల యేళ్ళు యిక్కడ వుంటారు.

నేను ఆఫ్ఘన్‌లకు, ముజాహిదీన్‌లకు గౌరవాభివందనం చేస్తున్నాను. అక్కడ హతమయిన 10 లక్షల మందికి, 30 లక్షల మంది కాందిశీకులకు అభివందనం చేస్తున్నాను. ప్రపంచంలోకెల్లా అతి పేదదేశాలలో ఒకటైన ఒక చిన్నదేశం అతి పెద్ద కమ్యూనిస్టుదేశం తలవంచుకునేలా చేసింది. దాని ఘనవిజయం నాకు అత్యంతానందాన్ని కల్గిస్తున్నది. □

తూనికరాళ్ళు వేయకుండ ఆ బేగ్ వేసి తూస్తారేమిటండి?

ఇది నాగార్జునసిమెంట్ బేగ్ సార్! తూనికరాళ్ళ కంటే కూడా కరక్టుగా తూస్తుంది!!

చౌక ధరల దుకాణము
నెం. 293.

MAM109

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు (1938-1972)
17 6 88, 24 6 88
శ్రీ విభవ నామ సం నిజ జ్యేష్ఠ శు తదియ
శు దశమి
సంపుటము 80 · సంచికలు 43; 44
ముఖ్య సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ
కార్యవాహక (యాక్టింగ్) సంపాదకుడు
మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు 3 00 |
| పోస్ట్‌లో 6 నెలల చందా | రు 87 10 |
| పోస్ట్‌లో 12 నెలల చందా | రు 174 20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక






## భవిష్యవాణి

ప్రసిద్ధ సినీ కళాకారుడు, చిత్ర దర్శకుడు నిర్మాత దాదా సాహెబ్ ఫాల్కే అవార్డు గ్రహీత – అయిన శ్రీ రాజ్‌కపూర్ ఇటీవల మరణించడం– మన భారత సినీ పరిశ్రమకే తీరని లోటు!

జీవితంలో ఆయన పొందిన బంగారు భవిష్యత్తును గురించి మీ పత్రిక ముప్ఫయ్ ఎనిమిది ఏళ్ళకు ముందుగానే భవిష్యవాణిగా చెప్పినది

అందుకు ప్రత్యక్ష నిదర్శనం – 06-9-1950 నాటి మీ ఆంధ్ర సచిత్ర వారపత్రికలో అందులో ప్రచురితమైన రాజ్‌కపూర్ నిర్మిత 'బర్సాత్ చిత్ర సమీక్ష

ఎస్ శ్రీప్రియ, శ్రీకాకుళం

## సీరియల్స్

రాకా కథ చదవాలని
పవిత్ర పాపి పేజీలు త్రిప్పాను
బాకుతో నా గుండెల్లో పొడిచినట్లు
కేక వేశాను నేను
బిట్ బిట్ టెరిబుల్
వర్డ్ వర్డ్ వండర్
పేజీ పేజీ మాటల మేజిక్
చల్లా నీ సీరియల్
చల్లని కూల్ డ్రింక్

– డాక్టర్ వేసారపు మాధవయ్య, పుత్తూరు

★ ★ ★

థ్రిల్లర్స్ రైటర్ చల్లా సుబ్రహ్మణ్యం గారి పవిత్ర పాపి సీరియల్ మంచి సస్పెన్స్‌తో సాగుతుంది ముఖ్యంగా రాకా పాత్ర చిత్రణ అత్యద్భుతం ముందు, ముందు మరిన్ని అనుకోని మలుపులు తిరుగుతూ మా అభిమానాన్ని చూరగొంటుందని ఆశిస్తున్నాం

– శ్రీ పాద ప్రియాంక, శ్రీనివాస్, బొబ్బిలి

★ ★ ★

ఆమల ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఎంతో ఆకర్షణీయంగా వుంది చల్లా సుబ్రహ్మణ్యం గారి పవిత్ర పాపి నవల చాలా సూపర్బ్

– చిత్రాడ విజయ్‌కుమార్, కె ఆనందరావు, సోంపేట

★ ★ ★

పవిత్ర పాపి" మమ్మల్నందర్నీ ఎంతో ఆకట్టుకొంది ఈ సీరియల్‌ను రచించిన చల్లా సుబ్రహ్మణ్యం గారికి మా హృదయపూర్వక అభినందనలు – టి కోమలి, తాడిపత్రి

★ ★ ★

ఇటీవల ప్రారంభమైన పవిత్ర పాపి చల్లా సుబ్రహ్మణ్యం గారి సీరియల్ చాలా బావుంది సినిమా చూస్తున్నంత అనుభూతిని కల్గించేలా వ్రాశారు రచయిత రచయిత గారికి కృతజ్ఞతలు

– చామర్తి సరోజ, విజయవాడ

★ ★ ★

అమల ముఖచిత్రం ఆంధ్రసచిత్ర వారపత్రికకే ఆకర్షనీయంగా వుంది వినాయకరావు పెళ్ళి సీరియల్ ఉల్లాసానిచ్చే హాస్యంతో లాస్యం చేస్తున్నది ఆలోచిస్తే ఈ లోకంలో అసాధ్యం అయినదంటూ ఏదీ వుండదు అని శాస్త్రి అనడం మాకు మరింత ఉత్సాహంగా వుంది ఏమి చేస్తాడో అని ఆసక్తికరంగా వుంది. పవిత్రపాపి చాలా థ్రిల్లింగ్‌గా వుంటున్నది హరికిషన్ గారి సీరియల్ ఇన్‌ట్రస్టింగా వున్నది

– కాజ హనిత, ఏలూరు


( 81 వ పేజీ చూడండి)




సీరియల్

# వినాయక రావు పెళ్లి





## మల్లాది వెంకట కృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

బస్సు దిగి మధ్యాహ్నం రెండూ ఇరవైకి వినాయకరావు షణ్ముగరావు ఇంటికి చేరుకున్నాడు. అతని కోసం బస్ స్టేండు దగ్గర ఎద్దుల బండి సిద్ధంగా వుంది.

"రండి బాబు, బండెక్కండి" చెప్పాడు రాములు ఆదరంగా.

"ఎవరి కోసం వచ్చావు?" అడిగాడు వినాయకరావు బండెక్కి కూర్చుని.

"తమరి కోసమే బాబూ" చెప్పాడు రాములు.

"ఇదేమిటి? నేనొస్తున్నట్టు ముందుగా ఎలా తెలుసు? టెలిగ్రాం కూడా పంపలేదు నేను" అడిగాడు వినాయకరావు ఆశ్చర్యంగా.

"తమరు పంపకపోయినా అయ్యగారు టెలిగ్రాం పంపారుగా. అది రాత్రికి అంది ఈ బండికే వస్తారని అంతా తమరి కోసం ఎదురు చూస్తున్నారు."

**జరిగిన కథ –12 :** శాస్త్రి సలహా మేరకు తండ్రి డాంబికేశ్వరరావుకి సుబ్బులక్ష్మి ప్రియుడు రాసినట్టు ఒక ఉత్తరం రాసేస్తాడు వినాయకరావు. అది చాలక సుబ్బులక్ష్మి తన ప్రియుడికి పంపించుకున్న ఫోటో అంటూ సుబ్బులక్ష్మి ఫోటో తండ్రికి పంపిస్తాడు. ఆ విషయం సుబ్బులక్ష్మి తల్లితండ్రులకు చెపుతారు డాంబికేశ్వరరావు, చాముండేశ్వరి. సుబ్బులక్ష్మి తండ్రి కూతురిపై చెయ్యి చేసుకుంటాడు. చివరకు వినాయకరావు నాటకం అని తెలుసుకుంటారు. ఆదిలక్ష్మి తమ ప్రేమ వ్యవహారం తల్లికి చెపుతుంది. సుబ్బులక్ష్మికి సీరియస్‌గా ఉందని వచ్చిన టెలిగ్రాం చూచుకొని ఊరెళతాడు వినాయకరావు. బాత్ రూంలోకి దూరి నిప్పి తార్థాన్ని తప్పించుకుంటుంది ఆదిలక్ష్మి.

"అంతా కులాసానేగా?" అడిగాడు ఓరగా చూస్తూ.

బదులుగా గుంభనగా నవ్వాడు కాని ఆ ప్రశ్నకి సమాధానం చెప్పలేదు రాములు.

"అంతా కులాసానేనా అని అడిగాను" రెట్టించాడు వినాయకరావు.

"అంతా కులాసానే బాబూ" చెప్పాడు రాములు.

"సుబ్బులెలా వుంది?"

"బానే వుందండి."

ఆ తర్వాత ఎవరూ మాట్లాడలేదు. వినాయకరావు రాముల్ని ఇంకేం అడగదలచుకోలేదు, అతనికి వివరాలు తెలుసో, తెలీదోనని. బండి ఇంటి ముందాగాక చెప్పాడు రాములు వినాయకరావు సూట్‌కేస్ అందుకుని.

"ఇవాళ మీ పెళ్ళవుతుంది బాబు."

"మా నాన్నగారిక్కడే వున్నారా?" అడిగాడు వినాయకరావు.

"అంతా ఇక్కడే వున్నారు."

తనాడిన అబద్ధానికి తలా కాస్త అక్షింతలు వేస్తారని పెళ్ళికి అర్థంగా భావించాడు వినాయకరావు. నిజంగా తనకి పెళ్ళి జరుగుతుందనుకోలేదు. అంధరి తిట్లని కాసేపు మౌనంగా భరించి తనకి సుబ్బుల్ని చేసుకోవాలని లేదని గట్టిగా చెప్పదలచుకున్నాడు. ఆ నిర్ణయంతో ఇంట్లోకి అడుగు పెట్టాడు వినాయకరావు.

షణ్ముగరావు లోపలకి వచ్చిన వినాయకరావుని పలకరించలేదు. అతన్ని చూసి కూడా పేపర్‌ని చదవసాగాడు.

"కులాసానా మామయ్యా?" అడిగాడు వినాయకరావు.

షణ్ముగరావు బదులు పలకలేదు. రాములు చెప్పడంతో కామేశ్వరి, చాముండేశ్వరి బయటకి వచ్చారు.

"ఏం నాయనా? మేం ఇలా బ్రతకాలని లేదా నీకు?" నిష్ఠూరంగా అడిగింది

కామేశ్వరి.

"ఏమైందత్తయ్యా? ఆ టెలిగ్రాం ఏమిటి?" అడిగాడు వినాయకరావు ఏం తెలీనట్లుగా.

"ఏరా? మా దగ్గర పెరిగినంత కాలం నలుగురిలో బుద్ధిమంతుడనిపించుకున్నావు. పట్నం వెళ్ళాక పెడ బుద్ధులు పడుతున్నాయే?" మందలించింది చాముండేశ్వరి.

"అసలు సంగతేమిటో ఎవరు చెప్పకపోతే నాకెలా తెలుస్తుంది? సుబ్బులు ఆత్మహత్యా ప్రయత్నం ఎందుకు చేసింది. నాకెందుకు టెలిగ్రాం ఇచ్చి పిలిపించారు?"

షణ్ముగరావు కామేశ్వరితో చెప్పాడు కోపంగా.

"ఆ ఫోటో చూపించి సంగతేమిటో తేల్చవే."

"ఫోటో ఏమిటమ్మ?" అమాయకంగా అడిగాడు వినాయకరావు.

"నా దగ్గర్రా నీ నటనలు? నీవు నాన్నగారికి ఓ ఫోటో పంపుతూ, దాన్ని నీకు ఈశ్వరరావు అనే అతను పంపాడని రాసావు గదా. అది అబద్ధం కాదా?"

"అబద్ధమా అంటే... అసలింతకీ సంగతి ఏమిటి?"

"బంగారు సీత లాంటి మా అమ్మాయి మీద అంతటి అభాండం వేయడానికి నీకు మనసెలా వచ్చిందయ్యా? సుబ్బులు పెళ్ళి కాకుండానే ఈశ్వరరావుని ప్రేమించి అతనికి మనసు, తనువు కూడా ఇచ్చిందని మీ నాన్నకి రాస్తావా? ఇదేం బుద్ధయ్యా నీకు?" అడిగింది కామేశ్వరి గట్టిగా.

"ఈశ్వరరావు గురించి నాకేం తెలుసు? మీ అమ్మాయి నాకు ఓ సారి వుత్తరంలో రాస్తేనే తెలిసింది. సుబ్బుల్ని అడగండి చెప్తుంది"

"ఈశ్వరరావు వయసెంతో తెలుసా? అరవై ఆరు" చెప్పింది కామేశ్వరి.

"అయితే నాకేం? కొందరు ఆడవాళ్ళు ముసలాళ్ళంటేనే ఇష్టపడతారట" సమర్థించుకున్నాడు వినాయకరావు.

"ఆయన భార్య నిక్షేపంగా బ్రతికుంది."

"కొందరికి భార్య బతికున్న మొగాళ్ళనే చేసుకోవాలని వుంటుందిట."

"ఆట్టే వాగక. వెధవ వాగుడు నువ్వూను. సుబ్బులు పెళ్ళాం బతికున్న ముసలాణ్ణి చేసుకుంటుందట్రా? ఏదో నిన్ను ఆట పట్టించడానికి రాస్తే దాన్ని నువు నిజం అనుకుని ఇలాంటి ఆకాశరామన్న లేఖలు రాయిస్తావా?" కోప్పడింది చాముండేశ్వరి.



# నాటి పెళ్ళిముచ్చట్లు

## వాచీతో పాటు మూషికాలు!

ఈ సంఘటన సుమారుగా రెండు సంవత్సరాల క్రిందట జరిగింది. అది జూన్ ఒకటవతేది. 1986 సంవత్సరము. రాత్రి 9–47 నిమషాలకి మా ఫ్రెండ్ మ్యారేజ్. ఆ పెళ్ళి రోజున మేమే అన్ని ఏర్పాట్లు చేసాం. పెళ్ళి మచిలీపట్నంలోని "టీచర్స్ గిల్డు హామ్"లో. పెళ్ళి ఘనంగా మొదలయింది. మేళాలు..... మంగళ వాయిద్యాలు.... ఘనంగా మ్రోగుతున్నాయి. వరుడు తాళికట్టాడు. వీడియో తీస్తున్నారు. ఇప్పటి వరకూ స్టోరీ బాగానే వుంది కానీ, ఇక్కడే మొదలవుతుంది అసలు స్టోరీ. పెళ్ళి పూర్తయింది. పురోహితుడు కట్నకానుకలు చదివించాల్సిన వాళ్ళు రావల్సిందిగా ఆర్డర్ జారీ చేసారు. అందరూ వారి వారి గిఫ్ట్లు ఇస్తున్నారు. అప్పుడు మేము కూడా ఒక పెద్ద అట్ట పెట్టె తీసుకెళ్ళి ఇచ్చి ప్రక్కన కామ్‌గా నుంచున్నాము. పురోహితుడు "దానిలో ఏముంది?" అని అడిగాడు, కాని ఎవ్వరూ మాట్లాడలేదు. అంతలో



ఎవరో విప్పతీసి చూడమన్నారు. ఆయన అట్టపెట్టికి వున్న రబ్బర్ బ్యాండ్ తీసారు. అంతే...... కళ్యాణ మంటపమంతా అల్లకల్లోల మయిపోయింది..... ఎవరికి వాళ్ళు పరిగెత్తుతున్నారు. ఇంతకీ అట్ట పెట్టిలో ఏముందంటే, ఒక వాచీ, 10 ఎలుకలు. ఆ పురోహితుడు రబ్బరు బ్యాండ్ తీయగానే ఎప్పుడు బయట కొద్దామా అని చూస్తున్న ఎలుకలు కాస్తా బయటికొచ్చి అల్లకల్లోలం చేసేసాయి. ఆ పెళ్ళి వీడియో క్యాసెట్‌లో ఈ సీన్ చూసినప్పుడెల్లా నవ్వాగదు సుమా!

—ఓ శివరామ్‌ప్రసాద్, మచిలీపట్నం

★ ★ ★

## వాయించండి

మా పెళ్ళి రోజు మాట తలుచుకుంటే ఇప్పటికి నవ్వు ఆగదు. పెళ్ళి మండపములో నేను, నా శ్రీమతి ఎదురెదురుగా కూర్చుని వున్నాము. పెళ్ళి మండపమునకు దగ్గరగా నా శ్రీమతి అమ్మగారు, వాళ్ళ చిన్నక్కగారు మరియు వారివైపు బంధువులు వున్నారు. పురోహితుడు మంగళ సూత్ర ధారణకి ముందు పూజా కార్యక్రమాన్ని నిర్వర్తిస్తూ భజంత్రీలను వుద్దేశించి వాయించండి అన్నారు. భజంత్రీలకు ఆ మాట వినిపించ లేదు. ఇంతలో నా శ్రీమతి అమ్మగారు కంగారుగా వాయించండి వాయించండి అన్నారు. ఆమె ప్రక్కనే వున్న నా శ్రీమతి చిన్నక్కగారు ఎవర్నమ్మా వాయించేది? అంది హాస్యధోరణిలో. అంతే. నాకు నా శ్రీమతితో పాటు చుట్టు ప్రక్కల వాళ్ళందరికి నవ్వాగలేదు. ఇప్పటికి ఆ



## వినాయకరావు పెళ్ళి

"లక్ష్మివరు నాయనా? నీవు ప్రేమిస్తున్నానని రాసావట?" అడిగింది కామేశ్వరి.

"వాళ్ళింటి వాళ్ళమ్మాయి అయి వుంటుంది. నే చూసాలే" చెప్పాడు షణ్ముగరావు పేపర్ మడిచి వేస్తూ.

"కరెక్ట్ మామయ్యా" చెప్పాడు వినాయకరావు.

"నీ మొహానికి ప్రేమ కూడానట్రా?" అడిగింది చాముండేశ్వరి.

"ఆ అమ్మాయి అద్భుతంగా పాటలు పాడుతుందమ్మా. నీకు తెలుసుగా నాకు పాటలంటే ఎంతిష్టమో."

"ఓ సారి నువు లోపలకి పద."

షణ్ముగరావు వినాయకరావుని లోపలకి తీసుకెళ్ళాడు. మధ్య గదిలోని పెళ్ళి పందిరిని చూసి ఆశ్చర్యపోయాడు.

"ఎవరి పెళ్ళి?" అడిగాడు.

"నీదే" చెప్పాడు అరటి గెలతో లోపలకి వచ్చిన వినాయకరావు తండ్రి డాంబికేశ్వరరావు.

తండ్రి వంక నమ్మలేనట్టుగా చూసాడు.

"పురోహితుడు సరిగ్గా ఏడున్నరకి వస్తానన్నాడు. లిస్ట్ రాసిచ్చాడు. అవన్నీ ఆలోగా తీసుకురావాలి. అంతా తలో పని చేస్తే గాని తెమలదు" చెప్పాడు డాంబికేశ్వరరావు.

"నా పెళ్ళా నాన్నగారు? ఎవరితో?" అడిగాడు వినాయకరావు.

"మొదటి నించే అనుకుంటున్న సుబ్బులుతో."

"కాని....."

"ఈశ్వరరావు లేదు గీశ్వరరావు లేదు. అదేం మనసులో పెట్టుకోక. ప్రేమ, దోమ మన వంశంలో నే జాంతానై. నా మాటకి ఎదురు చెప్పక తాళి కట్టి వెళ్ళు" చెప్పాడు డాంబికేశ్వరరావు.

"నీ పెళ్ళానికి ఈ పట్టు చీర కొన్నారా. ఇది బావుందా? లేక ఇది తీసుకోమంటావా?" చాముండేశ్వరి రెండు పట్టు చీరలతో వచ్చింది.

"అల్లుడూ. నీకు రేమండ్ సూట్ కోసం మనిషిని పట్నానికి పంపాం. రాత్రిలోగా వస్తాడు" చెప్పింది కామేశ్వరి.

"నాకీ పెళ్ళి వద్దు" బలహీనంగా చెప్పారు వినాయకరావు.

"పిచ్చి పిచ్చి వేషాలేస్తే గూబ వాయగొడతాను. అద్దాల్లోనే కాదు నా కొడుకు గడ్డాల్లో కూడా నా కొడుకే" చెప్పాడు డాంబికేశ్వరరావు.

"ఎందుకు వద్దురా?" అడిగింది చాముండేశ్వరి.

"నాకు సుబ్బులంటే ఇష్టంలేదు. పరమ డోకు".



విషయం తలుచుకుంటే మాకు నవ్వాగదు.

–ఇమ్మానేని వెంకటేశ్వరరావు,
ఆక్షుల అల్లూరు.(ప్రకాశం)

★ ★ ★

## గిచ్చి మరీ తీసుకున్నారు

పెళ్ళి అంటేనే స్త్రీ పురుషుల జీవితంలో ఓ మధురమైన ఘట్టం. ముచ్చటించుకుంటే ఎప్పుడూ ముచ్చటగా ఉండే ఓ ముచ్చట. మా పెళ్ళినాటి ఓ సంఘటన నన్ను ఇప్పటికీ



మురిపాలలో ముంచుతుంటుంది. బిందెలో ఉంగరం తంతులో అతి నెమ్మదస్తులుగా కనిపించే మా వారు అతి గడసరిగా నన్ను గిచ్చి మరీ ఉంగరాన్ని తీసారు మూడుసార్లు. గర్వం ఉట్టిపడింది అప్పుడు ఆయన మొహంలో: ఆయన స్నేహితులు "శహభాష్ సుబ్బారావు" అని కేరింతలు కొట్టారు. నా ఫ్రెండ్స్ "ఏమిటి లీలా స్త్రీలు ఇక్కడా మగవాడి చేయికిందే అన్నట్లు చేసావు" అన్నారు బాధగా. మరి "గిచ్చి మరీ తీసుకుంటే ఏమి చేయను" అని అతి సిగ్గుపడిపోతూ చెప్పాను. గొల్లున నవ్వారు నా స్నేహితులు. ఇప్పటికీ తన పంతాన్నే నెగ్గించుకుంటూనే వుంటారు మా వారు.

–కాజ. లీలాకుమారి, ఏలూరు.

## ఫోటో గ్రాఫర్ నిద్ర

మా వివాహం 1964 సం. మేనెలలో అయినది. సరిగ్గా మాది అర్ధరాత్రి ముహూర్తం. అప్పటికే పెండ్లికొచ్చిన బంధువులు అందరు సుష్టుగా భోంచేసి, లగ్నం టైముకి లేద్దామని తలో పక్కన నడుం వాల్చారు. మా నాన్నగారు పెళ్ళిలో ఫోటోలు తీయుటకు ఫోటో గ్రాఫర్ని పిలిపించారు.



అతను కూడ వచ్చి అందరిలాగనే ముహూర్తం టైముకి లేవలేక పోతానా అని, ఎవరూ లేని చోటు చూసుకుని, కెమెరా బ్యాగు తలక్రింద పెట్టుకుని, పడుకున్నాడట. తీరా పెండ్లివేళ్టికి, నాన్నగారు కంగారుపడుతూ, పెండ్లి విడిది అంతా వెదికినా, అతను కనిపించలేదు. నాకు ఒకటే కంగారు అయ్యో! ఫోటోలు లేకుండా పెళ్ళి అయిపోతోంది. జీవితాంతం గుర్తుంచుకోవల్సినవి అని ఎంతో బాధ కలిగింది. తీరా పెళ్ళి అంతా అయిన తర్వాత, అతను ఆవలిస్తూ వచ్చి, "సార్ ఫోటోలు తీయమంటారా" అని అడిగాడు. నాన్నగార్కి చాలా కోపం వచ్చింది. చివరికి పెండ్లి అంతా అయిపోయింది కాబట్టి, ఆ బట్టలతో, పూలదండలతో, ఒక్క ఫోటో తీశాడు. ఆ ఫోటో ఒక్కటే మా అపురూపమైన పెండ్లి ఫోటో. అది ఒక్కటే మా జీవితంలో తీయని గుర్తు. దాన్ని పెండ్లి రోజున చూసుకుని ఆనందిస్తూ ఉంటాము. కుప్పా రాజరాజేశ్వరి,

మదరాసు □

"అందంగానే వుంటుందిగా".

"మీ కళ్ళకి నా కళ్ళకి లక్ష్మి అందంగా వుండేది".

"ఖాళీగా కూర్చునే కంటే మావిడాకులతో పురి కొస తీసుకుని తోరణాలు కట్టరాదు నీ పెళ్ళిగా" చెప్పాడు షణ్ముగరావు.

"నాకు వద్దు నేను చేసుకోను" చెప్పాడు వినాయకరావు తీవ్రంగా.

"ముందు స్నానం చేసిరా నాయనా. అన్నం తిందువుగాని" చెప్పింది కామేశ్వరి

"నాకేం వద్దు" అరిచాడు వినాయకరావు.

కామేశ్వరి అతని కోపానికి కొంగు అడ్డు పెట్టుకొని నవ్వింది..

సాయంత్రం ఏడు దాకా వినాయకరావు ఆ బాధ భరించాల్సిన అవసరం లేకపోయింది అయిదుదాకా వినాయకరావుని ఎవరూ పట్టించుకోక ఎవరి పన్లలో వాళ్ళు హడావిడిగా తిరుగుతుండిపోయారు.

అయిదున్నరకి సుబ్బలక్ష్మితో చెప్పింది చాముండేశ్వరి.

బావకు కాఫీ, టిఫిన్ తీసుకెళ్ళి ఇవ్వమని.

"ఊహు"

"మన బావ కదే వెళ్ళు" చెప్పింది కామేశ్వరి.

"నేనంటే పరమ ద్రోహి కదా వెళ్ళను గాక వెళ్ళను'.

"తప్పమ్మా అయినవాళ్ళతో విరోధం మంచిదికాదు". చెప్పాడు షణ్ముగరావు

వుప్మా, కాఫీ గ్లాసుతో వినాయకరావు పడుకొన్న గదిలోకి వెళ్ళింది సుబ్బలక్ష్మి.

"ఇంద" చెప్పింది కళ్ళు మూసుకున్న అతనితో.

కళ్ళు తెరచి ఆమె వంక చూసాడు.

"కాస్త టిఫిన్ మింగి, ఆ తర్వాత కాస్త తాగు" చెప్పింది సుబ్బ లక్ష్మి, కోపంగా.

"నేనా రోజే చెప్పాను. నీతో పెళ్ళి నాకిష్టం లేదని. నన్ను చేసుకున్నా నీవు సుఖపడలేవు. నిన్ను సుఖపెట్టలేను" చెప్పాడు వినాయకరావు లేచి కూర్చుని.

"నాకు, ఈశ్వరరావుకు శారీరక సంబంధం వుందని ఎందుకు ఆకాశరామన్న వుత్తరం రాశావు? నేను నీకంత చీప్‌గా కనిపిస్తున్నానా?" అడిగింది సుబ్బలక్ష్మి అదే స్వరంతో.

"పెళ్ళి తప్పించుకోవడానికి . అది ఇలా బయటపడుతుందనుకోలేదు. అంత మాత్రానికే ఆత్మహత్యా ప్రయత్నం చేస్తావా?" అడిగాడు చిరాగ్గా.

"నేనేం చేయలేదు. ఉత్తినే అలా టెలిగ్రాం ఇచ్చారు నిన్ను పిలిపించడానికి".



## వినాయకరావు పెళ్ళి

"పెద్దవాళ్ళ అబద్ధం అన్నమాట"

"ఉన్నమాటే అన్నమాట"

"ప్లీజ్ సుబ్బులు నీకో దణ్ణం పెడతాను దయచేసి నాకీ పెళ్ళి వద్దు పెటాకులు వద్దు నీకు ఇష్టం లేదని చెప్పు"

సుబ్బలక్ష్మి అతని వంక జాలిగా చూసి చెప్పింది-

"ఇంత జరిగాక నేను నిన్నే చేసుకుంటాననుకుంటున్నావా?"

"మరి?"

"ఇది మీ నాన్నగారు మా నాన్నగారి కోపం పోగొట్టడానికి వేసిన ప్లేన్ నామీద నింద మోపినందుకు నాన్నకి వెర్రి కోపం వచ్చింది ఇంక మీరెవరూ ఆ గడప తొక్కద్దన్నారు ఇంత ఏడిపించిన నిన్నూ ఏడిపించాలని మీ నాన్నగారీ ఉత్తుత్తి ఏర్పాట్లు చేస్తున్నట్లు నటిస్తున్నారు"

"ఒట్టు?"

"నా మీదే ఒట్టు పెళ్ళి పందిరికి అలంకరణ లేదు ఇంట్లోకి ఒక్క సామాను రావడంలేదు అంతా వుట్టి హడావిడే ఇష్టం లేని వాడికి నన్నిచ్చి చేయడానికి మా నాన్న, అమ్మా బీద వాళ్ళనుకున్నావా? బోలెడు కట్నం ఇచ్చి ఇంతకు మించి సంబంధం తెస్తారుట."

"అమ్మయ్య ఇప్పుడు నా మనస్సు ప్రశాంతంగా వుంది" చెప్పాడు వినాయకరావు చిరునవ్వుతో

సుబ్బలక్ష్మి చెప్పింది అక్షరాలా నిజం అయింది

పెద్ద వాళ్ళు నలుగురు వినాయకరావుని చివాట్లేసారు సుబ్బలక్ష్మితో పెళ్ళి ఇష్టంలేక పోతే ఆ సంగతి నలుగురు పెద్దవాళ్ళని కూర్చోపెట్టి ప్లెయిన్‌గా చెప్పాలి కాని ఇలా సినిమా కథలు చెప్పకూడదన్నారు జీవితంలో దొంక తిరుగుడు ధోరణి మంచిది కాదన్నారు అన్నిటినీ వినాయకరావు మౌనంగా, తాపీగా విన్నాడు

"నీ తో మాట్లాడాలి దొడ్లోకి వెళదాంరా" పిల్చాడు డాంబికేశ్వరరావు

తండ్రీకొడుకులిద్దరు బయటకి వెళ్ళారు డాంబికేశ్వరరావు రోలు మీద కూర్చుంటే, వినాయకరావు వంగిన జామచెట్టు కొమ్మ మీద కూర్చున్నాడు

ఇద్దరి మధ్య కాసేపు మౌనం తర్వాత అడిగాడు డాంబికేశ్వరరావు గొంతు సవరించుకొని-

"రిలయెన్స్ కప్ మనదేశానికి వస్తుందనుకొంటున్నావా?"

"మన దేశానికి రాదు అసలు 'ఏ' గ్రూప్‌కీ రాదనుకొంటున్నాను నాన్నగారు వెస్ట్ ఇండీస్ కొట్టేయవచ్చు"




"లక్ష్మి ఎవరు?"

"మోహింటాయన కూతురు"

"అంపైర్ డిక్‌బర్డ్‌మీద నీ అభిప్రాయం ఏమిటి?" అడిగాయన

"బాగా లావుగా వుంటాడని మార్ష్, బూన్‌లు మంచి బ్యాట్స్‌మన్‌లు కదా నాన్నగారూ"

"ఆస్ట్రేలియా బ్యాట్స్‌మన్ అంటే నాకు ప్రత్యేక మోజు ఆ అమ్మాయి కూడా నిన్ను ప్రేమిస్తోందా?"

"ప్రేమిస్తోంది"

"ఒకే ఒక్క రన్‌లో లాహోర్‌లో బ్రిలియంట్‌గా ఆడిన వెస్ట్ ఇండీస్ ఓడటం, పాకిస్తాన్ గెలిస్తే నీకేమనిపించింది?"

"మీకు నాన్నగారు?"

"అన్నం మానేయాలనిపించింది"

"నాక్కూడా కాని తిన్నాను"

"నేనూ తిన్నాను ఆ అమ్మాయి తలితండ్రులకి ఈ వ్యవహారం తెలుసా?"

"ఇంకాలేదు"

"గవాస్కర్ అంతర్జాతీయ క్రికెటర్‌గా ఈ మేచ్‌లతో రిటైర్ అవుతున్నాడు కదా"

"అవును"

"ఇండియాకి అలాంటి ఆటగాడు మళ్ళీ దొరకడం కష్టం"

"బహు కష్టం ఆ అమ్మాయి కులం మన కులమే ఆ విషయంలో మీరు ఖంగారుపడక్కర్లేదు"

"నేను ఎక్కువగా భయపడేది రిలయన్స్ కప్ పాకిస్తాన్‌కి వెళ్తుందేమోనని దాన్ని జాగ్రత్తగా పంపమని జోక్ చేసాడు కూడా మన కులం అమ్మాయి అయితే చాలు నీకెవర్ని చేసుకోవాలని వుంటే వాళ్ళనే చేసుకో కాని ఒక్క ఆంక్ష"

"ఏమిటి నాన్నగారు?"

"కెప్టెన్ కదా కపిల్‌దేవ్ సెంచరీ చేస్తే బావుణ్ను?"

"నే వెళ్ళి కపిల్‌దేవ్‌ని అడుగుతాను నీవు సెంచరీ చేస్తే కాని మా నాన్న నాకు లక్ష్మితో పెళ్ళి చేయరని"

"అహ హ అది కాదు ఆంక్ష వాళ్ళ నాన్న, అమ్మ వప్పుకొని మీ ఇద్దరి పెళ్ళిని శాస్త్రీయ పద్ధతుల్లో జరిపించాలి నీ కాళ్ళు కడిగి కన్యాదానం చేయాలి అంతేకాని రిజిస్టర్ మేరేజో, గుళ్ళో పెళ్ళో వీల్లేదు నాకున్నది నీ ఒక్కడివే కొడుకువి పెళ్ళి ఎవరు ఆక్షేపించకుండా అందంగా హుందాగా జరగాలి"

"అలాగే నాన్నగారూ"

"ఎవరు వేలెత్తి చూపేలా వుండకూడదు"

"మీకు మాట ఇస్తున్నాను నాపెళ్ళి ఎవరూ వేలెత్తి చూపేలా వుండదు"

"నీ పెళ్ళి గురించి కాదు నేను చెప్తే రిలయెన్స్ కప్ మనకి రావడం గురించి ఏ ఆస్ట్రేలియానో కొట్టేస్తే ప్రపంచం మొత్తం మన టీమ్‌ని వేలెత్తి చూపిస్తుంది"

"అవును నాన్నగారు"

"ఖర్చుకు వెరవకూడదు"

"క్రికెట్ మేచ్ అంటేనే అమిత ఖర్చు నాన్నగారు అందులో రిలయెన్స్ అంబాని నిర్వహించేది కదా"

నేను చెప్తే రిలయెన్స్ మేచ్ గురించి కాదు నీ పెళ్ళి' గురించి చెప్పాడు డాంబికేశ్వరరావు

అయన రోలు మించి, వినాయకరావు జామచెట్టు కొమ్మ మించి దిగి ఇంట్లోకి నడిచారు

"అన్నీ మాట్లాడారా?" అడిగింది చాముండేశ్వరి భర్తని

మొత్తం మాట్లేడేసాను" చెప్పాడు డాంబికేశ్వరరావు

ఆ రాత్రి బస్సులో హైద్రాబాద్ బయల్దేరాడు వినాయకరావు

"దయచేసి నా పిచ్చి పథకాన్ని మీ బుర్రల్లో వుంచేసుకోకండి మామయ్యా మన కుటుంబాల మధ్య ఎప్పటిలా రాకపోకలు, ప్రేమలు, అప్యాయతలు వుండాలి. 'షణ్ముగరావు చేతులు పట్టుకుని చెప్పాడు వినాయకరావు

"సరే లేరా నా కళ్ళ ముందు పుట్టి పెరిగిన వాడివి నీ పెళ్ళికి వస్తాంలే నీవు సుబ్బులు పెళ్ళికి రా" చెప్పాడు షణ్ముగరావు హుందాగా

* * * * * * * * *

"మొత్తానికి మనవాడు చేసిన వెధవ పనికి మీ అన్నయ్యని శాంత పరచడానికి రెండు వందల దాకా ఖర్చయింది" చెప్పాడు డాంబికేశ్వరరావు చాముండేశ్వరితో తమ వూరి రైలెక్కాక

"సుబ్బులికో మంచి సంబంధం చూసామంటే మా వదినక్కూడా మిగిలిన సగం కోపం తగ్గుతుంది" చెప్పిందావిడ

* * * * *

"ఈసారి హైద్రాబాద్ వెళ్ళినప్పుడు ఈ వెధవ సలహా చెప్పిన ఆ శాస్త్రిగాణ్ణి కూడా నిలువునా దులిపేయాలి" చెప్పాడు షణ్ముగరావు వాళ్ళ రైలు కదిలాక తన భార్యతో ఎద్దులబండిలో ఇంటికి వెళుతూ

"ఏదయినా కలెక్టర్ సంబంధం చూడండి, మీ చెల్లెలి మొహం మాడిపోయేట్టు" చెప్పింది కామేశ్వరి అక్కసుగా

"డాక్టరయినా చాలు దాని మొహం మాడడానికి" చెప్పాడు షణ్ముగరావు

"ఆయుర్వేదం డాక్టరో, పశువుల డాక్టరో వద్దు నాన్నారు ఇంగ్లీష్ డాక్టర్నే చూడండి" చెప్పింది సుబ్బలక్ష్మి చెరుగ్గడ నములుతూ

"నా తల్లికి ఎంతో మంచి సంబంధాన్ని దేముడు రాసి పెడితే, ఇంత దాకా మనం కళ్ళు తెరవలేకపోయాం" చెప్పింది కామేశ్వరి

ఎద్దులబండి నడిపే రాములు ఆ మాటలకి నవ్వుకున్నాడు

* * * * *

"మీ సుబ్బులు దేనికి ఆత్మహత్యా ప్రయత్నం చేసింది?" అడిగాడు శాస్త్రి తలుపు తెరిచి, తెల్లవారుఝామునే వచ్చిన వినాయకరావును చూసి

"నీ పిండాకూడు ప్లేను, నువ్వు ఇక మీదట మందు కొట్టి ఆలోచించక" విరుచుకు పడ్డాడు వినాయకరావు

"బ్రతికే వుందా, పోయిందా?" అడిగాడు శాస్త్రి సానుభూతిగా

వినాయకరావు అక్కడ జరిగిందంతా పూస గుచ్చినట్లుగా చెప్పాడు పూర్తిగా విన్నాక శాస్త్రి తల పంకించాడు

"వెరీ గుడ్ నా పథకంలోని ఒకటి రెండు చెడులని వదిలేస్తే, మొత్తానికి నీకు మంచే జరిగిందన్న మాట సుబ్బులు బాధ వదిలినందుకు కంగ్రాచ్యులేషన్స్ " చెప్పాడు

"ఇక్కడ పరిస్థితి ఏమిటి? కామేశ్వరరావుతో నిశ్చితార్థం జరగలేదు కదా?"

"నే బ్రతికుండగానే? మన పథకం అద్భుతంగా ఫలించింది ముహూర్తం టైంకి వంటి నిండా జిడ్డు నూనెతో బాత్‌రూంలో వుంది ఆదిలక్ష్మి ఆ జిడ్డు వదలడానికి ముప్పావు గంట పట్టింది ఈలోగా యమ ఘడియలొచ్చేసాయి తండ్రి కొడుకులిద్దరు కారెక్కి చక్కాపోయారు, మొహాలు వేలాడేసుకుని "

"వెరీ గుడ్ ఏమయిందోనని భయపడి చస్తున్నాను" చెప్పాడు వినాయకరావు విప్పారిన మొఖంతో.

"వాళ్ళు కరీంనగర్ దగ్గర ఏదో గ్రామంలో ఇరవై తొమ్మిది రోజులపాటు ఏకబిగిన మాట్ చేస్తారుట అంత దాకా మళ్ళీ భయం లేదు"

"ఈలోగా శాశ్వతంగా కాముణ్ని వీళ్ళకి దూరం చేయాలి ఇదే నువ్వు ఆలోచించాల్సిన ఆఖరి పథకం"

"ఐ విల్ ట్రై మై లెవెల్ బెస్ట్"

"మా నాన్నగారు ఓ కండిషన్ పెట్టారు ఆదిలక్ష్మి తండ్రి కూడా మా పెళ్ళికి వప్పుకుని నా కాళ్ళు కడిగి కన్యాదానం చేయాలిట".

"అదెలాగూ తప్పదు ఇష్టం లేని పెద్దల్లుడికే అలస్యంగా పిల్లలు పుట్టాకయినా'చేసాడు నీ విషయంలో ఈసారి ఆ తప్పు చేయడు ఎంత నీటి కరువున్నా చచ్చినట్లు నీ కాళ్ళు ఎంత బురదగా వున్నా సరే శుభ్రంగా కడిగి తీరుతాడు "

"అదే ధైర్యంతో మా నాన్నగారికి నేను సరేనని మాటిచ్చాను "

"మంచి పని చేసావ్ "

"నువ్వికా కాముడి పని పట్టే పథకం మీదుండాలి"

"ఏక్ అకేలా దో సుఖి అన్నారు నిన్ను సుఖపడేలా చేసే బాధ్యత నాది రాత్రికో ఎర్ర తేలుతో సెలబ్రేట్ చేసుకుందాం"

"ఎర్రదెందుకు? నల్ల దాంతో" చెప్పాడు వినాయకరావు

"గురువు దగ్గర ఖర్చుకి వెనకాడక శిష్యా, నా వల్ల భవిష్యత్‌లో నీకెన్నో పనులు జరుగుతాయ్" చెప్పాడు శాస్త్రి

వాళ్ళ భాషలో నల్ల తేలంటే రమ్, ఎర్ర తేలంటే విస్కీ, తెల్ల తేలంటే జిన్, పచ్చ తేలంటే బ్రాంది

వినాయకరావు చేతి గడియారం వంక చూసుకుని చెప్పాడు

"బస్సులో రెండు రాత్రుళ్ళు వరసగా ప్రయాణం సరిగ్గా నిద్ర లేదు నన్ను



సరిగ్గా తొమ్మిదిన్నరకి లేపు" తలుపేసి, లైటార్పి మళ్ళీ ఇద్దరు నిద్రకి వుపక్రమించారు

* * * * *

ఆదిలక్ష్మి చేత వినాయకరావుకి కనకమహాలక్ష్మి ఆరోజు వుదయం జంతికలు పంపించింది అక్కడ పెట్టిన గిన్నెని తెరిచి అందులోంచి చిన్న కాగితం తీసి చదివి చెప్పాడు శాస్త్రి ఆ అమ్మాయి వెళ్ళిపోగానే

"సాయంత్రం సరిగ్గా ఆరింటికి చిక్కడపల్లి వెంకటేశ్వరస్వామి గుళ్లో కూర్చో లక్ష్మి వస్తుంది " అయినా గుళ్ళలో ఏవిటోయ్ లవర్స్ కలవడం? జూ, ఇందిరా పార్క్, టేంక్‌బండ్, పబ్లిక్ గార్డెన్స్‌లాంటి వెన్నో ప్రభుత్వం ఎందుకు కట్టించిందనుకుంటున్నావు?"

"ఆ జంతికలు, ఆ చీటీ రెండూ నీక్కాదు మా మధ్య ఎన్నో రహస్యాలుంటాయి అన్నీ తెలుసుకోవడమేనా" వినాయకరావు గిన్నెని, చీటీని లాక్కుని చెప్పాడు

* * * * *

వినాయకరావు సాయంత్రం చిక్కడపల్లిలో ఆటో దిగాడు ఓ కన్నడం వాళ్ళ హొటల్‌లో టిఫిన్, కాఫీ లాగించి గుడికెళ్లాడు సరిగ్గా ఆరింటికి ఆటో లోంచి

# వినాయకరావు పెళ్ళి

దిగారు వాళ్ళిద్దరు వినాయకరావు ఎదురు చూడలేదు ఆదిలక్ష్మి తన తల్లి కనక మహాలక్ష్మిని కూడా వెంట పెట్టుకుని వస్తుందని

ఆవిడ చూసి తబ్బిబ్బయి, అసలు తను లక్ష్మికోసం రానట్టే ధ్వజస్తంభం చుట్టూ కళ్ళు మూసుకుని ప్రదక్షిణాలు చేయసాగాడు అతన్ని చూసి కనకమహాలక్ష్మి, చిన్నగా నవ్వింది

"ఏమండీ రావుగారు, మిమ్మల్నే" పిలిచింది, ఆదిలక్ష్మి

అతను కళ్ళు తెరిచి, ఆశ్చర్యం నటించి అడిగాడు

"మీరూ గుడికొచ్చారన్న మాట నేను ప్రతి సోమవారం సాయంత్రం ఇక్కడికి విధిగా వస్తుంటాను"

కనకమహాలక్ష్మి మరోసారి నవ్వి చెప్పింది

"ఆ చీటీ రాయమంది నేనే బాబు అమ్మాయి అంతా చెప్పింది నీతో మూడు విషయాలు ముచ్చటిద్దామని వచ్చాను"

"ఓహో అలాగా, నమస్కారమండి రండి అలా కూర్చుందాం"

" ముందర దైవ దర్శనం తర్వాతే సంభాషణం" చెప్పిందావిడ వాళ్ళతో పాటు వినాయకరావు కూడా మళ్ళీ మూడుసార్లు గుడి చుట్టూ ప్రదక్షిణాలు చేసి, మరోసారి దైవదర్శనం చేసుకున్నాక గట్టు మీద కూర్చున్నారు

కనకమహాలక్ష్మి అతని కులం, గోత్రం అడిగి అవి తమకి సరిపోతాయని తెలుసుకున్నాక తృప్తి పడింది

"మొదటినించీ మా వారికి నీమీద సదభిప్రాయం లేదు ఆ మాటకొస్తే కొంత కాలం దాకా నాక్కూడా తర్వాత చెప్పింది మా ఆది శాస్త్రిగారి ఆలోచనలే అవన్నీ అని"

"అవునండి" చెప్పాడు వినాయకరావు

"పోతే పెళ్ళికి ముఖ్యం పెద్దవాళ్ళ ఆశీర్వచనం మీ వాళ్ళకి మా అమ్మాయి గురించి చెప్పి వప్పించాల్సిన బాధ్యత నీ మీద వుంది వాళ్ళు కూడా పెళ్ళికి వచ్చి సవ్యంగా వివాహం జరిపిస్తేనే మావారిచేత వప్పించగలను లేకపోతే చాలా కష్టం"

"మొన్న స్వరాజ్యలక్ష్మి పెళ్ళిలో నాకు మామగారి మనస్తత్వం బాగా అర్థం అయిందండి ఆ విషయంలో మీరు నిశ్చింతగా వుండండి నేను వూరు వెళ్ళింది మా నాన్నగారికి మీ అమ్మాయి గురించి చెప్పడానికే చెప్పేసాను "

"వాళ్ళేమన్నారు?" ఆత్రంగా అడిగిందావిడ

"వప్పుకున్నారు. కాకపోతే మీరన్నట్టే మీరు కూడా వప్పుకుంటేనే ఈ పెళ్ళికి తాము కూడా వస్తామన్నారు మీ స్వరాజ్యం లాగా కాకుండా చూసుకోవాల్సిన బాధ్యత మీ మీద వుంది"

వెంటనే కనకమహాలక్ష్మి మొహంలో సంతోషం ప్రవేశించింది.

"అమ్మయ్య చల్లటి కబురు చెప్పావయ్యా, మీ నాన్నగారి పేరు? మీదే వూరు?"

"ఆయన పేరు డాంబికేశ్వరరావు నర్సాపురం మాది అక్కడ మాకున్న పొలాలు, తోటలు చూసుకుంటున్నారాయన నాకు అక్క చెల్లెళ్ళు, అన్నదమ్ములు లేరు ఒక్కణ్ణే బి ఏ నర్సాపురంలో అయాక సంవత్సరం క్రితం ఇక్కడ ఎల్ ఐ సి లో వుద్యోగం వచ్చింది జీతం నెలకి రెండువేల పై చిలుకే వస్తుంది మాది చాలా సాంప్రదాయమైన కుటుంబం ."

తన కుటుంబ వివరాలు, స్థితి గతులు వినాయకరావు ఆవిడకి తెలియ చేసాడు ఆవిడ అన్నిటికీ సంతృప్తి కనబరిచింది.

"ఇది పూర్తిగా ప్రేమ వివాహం కాదు పెద్దలు నిర్ణయించిందీ కాదు అన్నీ కనుక్కోవాలి కాబట్టి అడుగుతున్నాను మీ వాళ్ళు కట్నం గురించి ఏం అనుకుంటున్నారు?"

"ఆ విషయం నాకు తెలీదండి"

"మొహమాట పడకయ్యా వాళ్ళనుకున్నది చెప్పు"

"నిజంగా తెలీదు "

"అయితే వుత్తరం రాసి కనుక్కో మేం తూగగలమో లేదో" చెప్పిందావిడ

"అలాగేనండి అయినా అది పెద్ద సమస్యకాదు "

"కాకుండా వుండటానికే కనుక్కోవడం మంచిది"

"రేపే రాస్తాను "

"మొన్న నిశ్చితార్థం కోసం వచ్చారు చూసావూ, వాళ్ళు శనిగ్రహాల్లా దాపురించారు ఆ బాధని ఏదో విధంగా తప్పించాల్సిన బాధ్యత ముఖ్యంగా నీ మీద వుంది నాయనా అది చెప్పడానికే వచ్చింది"

"నేనూ అదే ఆలోచిస్తున్నానండి"

"నాకు మొదటి నించి కామేశ్వరరావు మీద కాని, ముఖ్యంగా నాదకర్ణి మీద కాని సదభిప్రాయం లేదు. మా ఆయన చెప్తే వినిపించుకోరు "

"ప్రస్తుతం అదే ఆలోచిస్తున్నామండి"

"నాదకర్ణి భార్య సుమతి ఆయనకి స్వంత చెల్లెలు ఆవిడ పోయి పదేళ్ళు దాటుతోంది ఇంట్లో ఆడ రక్షత లేకపోవడంతో తండ్రి యేదారి, కొడుకు గోదారి అయింది మనిషికి కేరక్టర్ ముఖ్యం నాయనా"

"నిజం చెప్పారు "

"ఏదో విధంగా ఈ సంబంధం తప్పి, మీది కుదిరితే వెయ్యిన్నూట పదహార్లు ఇస్తానని ఇప్పుడే వెంకన్నకి మొక్కుకున్నా నాయనా" చెప్పింది కనకమహాలక్ష్మి

"నేను నూటపదహారు కొబ్బరి కాయలనుకున్నానండి" చెప్పాడు వినాయకరావు

పావు గంట తర్వాత తల్లీ కూతుళ్ళిద్దరు వెళ్ళిపోయారు

ఆదిలక్ష్మితో వంటరిగా మాట్లాడే అవకాశం పోయినందుకు కొద్దిగా బాధ పడ్డారు వినాయకరావు

ఎనిమిది దాకా అటు, ఇటు తిరిగి హోటల్‌లో 'భోజనం' చేసి ఇంటిదారి పట్టాడు

* * * * *

మూడు రోజుల తర్వాత సుబ్బలక్ష్మినించి వినాయకరావుకి ఓ వుత్తరం వచ్చింది అందులో రెండే రెండు వాక్యాలున్నాయి

"నిన్ను పిచ్చిగా ప్రేమించిన కారణంగా, నా మీద అంత చెడ్డ అపవాదు వేసావు కదూ? నా మనసెంత బాధ పడిందంటే, నిన్నూ ఓ రోజు ఎలాంటి దెబ్బ తీస్తానో చూడు "

ఆ వుత్తరాన్ని నలిపి డస్ట్‌బిన్‌లో పడేసి అంతటితో ఆ సంగతి మర్చిపోయాడు వినాయకరావు

(ఇంకా వుంది)



# ప్రశ్నావళి

కె. రామలక్ష్మి

### పి. వి. ఎ. ఆర్. హైదరాబాదు

★ పత్రికల ద్వారా లాయర్లు యాక్టర్లు డాక్టర్లు సమాధానాలు యిస్తున్నారు ప్రజల కోసమా? పబ్లిసిటీ కోసమా?

● యాక్టర్లు ఖచ్చితంగా పబ్లిసిటీ కోసమే లాయర్లు, డాక్టర్లు పరితల అనుమానాలను నివృత్తి చేస్తున్నారు- అందరికీ పనికి వచ్చే విషయాలు అందులో వుంటున్నాయి స్వంత వైద్యం చేసుకోకుండా ఇవి సూచనలుగా తీసుకుని మనం డాక్టర్లని, లాయర్లని సంప్రదించడానికి ఉపయోగిస్తున్నాయని- అనుకుంటున్నాను నేను

★ ఐదు రూపాయలకి ఓటు వేసి ఐదేళ్ళ బానిసత్వం కొని తెచ్చుకుంటున్న ఓటరుపై మీ అభిప్రాయం?

● అది మన తప్పే వారికి ఓటు విలువ- ఇంకోలా చెప్పడానికి ఎవరు ప్రయత్నిస్తున్నారు? అలా ప్రయత్నించిన చోట- ఊళ్ళకి ఊళ్ళు ఓటు చేయని సందర్భాలు- మీరు వినలేదా?

### ఎం. ఎస్. ఎన్. అన్నవరం.

★ ఆడవారిపై అత్యాచారాలకు అంతం ఎప్పుడంటారు?

ఆడది కూడా సాటి మనిషే ననే దృక్పథం మగవారికి రానంతవరకు – ఆ అంతం రాదు ఇక వీరి దృక్పధమూ మారే – సూచనలు కన్పడడంలేదు

★ విమర్శ అనేది ఏవిధంగా వుండాలి అంటారు?

విమర్శ చదివేవారిని సాహిత్యంవైపు మళ్ళించేదిగా వుండాలి దారి చూపేదిగా వుండాలి

### జి. వి. ఎన్. సికింద్రాబాదు

★ జీవితంలో కష్టపడేవాడికి సుఖం వుండదు ఇదేం శాపం?

కష్టఫలమే – విశ్రాంతి కొందరికి ఎంత కష్టపడ్డా – సరిపోదు అంచేత సుఖంగా వుండడం అనేది గగనకుసుమంగా బావిస్తారు

★ నమ్మకద్రోహానికి కారణం ఏమిటి?

సింపుల్ అందర్నీ నమ్మాలి ఎవరినీ నమ్మకూడదు అన్న సత్యం మరిచిపోడమే

### సి. హెచ్ ఎం. ఎల్ పెనుగొండ.

★ ఒక పత్రికను నడుపుతున్నామంటే ప్రజలకు లాభం వుండాలి దానివల్ల యువతరం నష్టపోయేదిగా వుండకూడదు నేటి పత్రికలు యువతరాన్ని రెచ్చకొట్టేవిగా వుంటున్నాయి ఏమంటారు?

ఒకరి లాభంలో ఇంకొకరికి నష్టం కాస్తేనా తప్పదు లాభమే ప్రదాన మనుకునేవాళ్ళు – ఎదుటివారి నష్టాన్ని గురించి ఆలోచించాలనడం హాస్యాస్పదం

### పి. ఆర్. గుంటూరు.

★ అత్తకి కోడలంటే కోపం ఎందుకు?

ఇన్నాళ్ళు పెంచి పెద్దచేసిన కొడుకుని ముక్కూ ముఖం తెలియని ఓ యువతి చేతుల్లో పెట్టేస్తుంటే బాదేకద!

### డి వి. ఆర్ అనకాపల్లి.

★ ప్రేమ గుడ్డిదంటారా మీరు?

ఈ రోజుల్లో కాదనిపిస్తోంది – సలక్షణ ఉద్యోగవతిని ప్రేమించి కట్నం బేరాలకి తల్లితండ్రులని పంపిస్తున్నారని – వింటూంటే!

★ వరకట్న కబందహస్తాలలో చిక్కుకుంటున్న స్త్రీకి విముక్తి ఉందంటారా?

ఉంది తన నలా దబ్బిచ్చేనా ఒదులుకోవడానికి సిద్ధపడే తల్లితండ్రలని కాదనగలిగిననాడు ఆ ధైర్యం – చదువు వల్ల, స్వంతకాళ్ళపై నిలబడే శక్తివల్ల వస్తుంది అంచేత పెళ్ళికి తలవంచేముందే ఆడపిల్లలు – చదువుకోవాలి ఏ ఉద్యోగమో, వృత్తి విద్యో నేర్చుకోవాలి సంపాదించుకోగల మన్న ధైర్యం వచ్చాక – పెళ్ళికి సిద్ధపడాలి

### సి ఏ. డి. విశాఖపట్నం

★ ముందుకుపోడానికి మార్గం ఏమిటి కె రా గారూ!

ముందుకుపోడానికి మార్గం – 'వెనకపడి వుండడం'కాదు 'ముందుకి సాగడంలో – వెనకబడిపోకుండా' వుండడం

★ నమ్మకం ఏర్పడడానికి దారి?

నిన్న' 'నిన్న'కు మించిన దింకొకటి వుంటుందా నమ్మకం పెరగడానికి, తరగడానికి

### టి జె. ఆర్. విజయవాడ

★ ఎన్ టి ఆర్ పాలనపై మీ అబిప్రాయం తెలుపకలరా?

అబిప్రాయానికేంగాని పేపర్లు బోర్‌కొట్టకుండా – యింత మేత' బాగుంటుంది



# చర్మవ్యాధులకు




## అతి గాఢంగా పనిచేసే
## అమృతాంజన్ డెర్మల్ ఆయింట్‌మెంట్

చర్మవ్యాధులకు ఉపయోగపడే సాధారణ అయింట్‌మెంట్లు ఎక్కువగా చర్మం లోపలకు ప్రవేశించలేవు. కాని అమోఘమైన చర్మరోగ నివారణ ఔషధాలు విశిష్టంగా చేరిఉండడంచేత అమృతాంజన్ డెర్మల్ అయింట్‌మెంటు మాత్రము లోపలకు ప్రవేశిస్తుంది. సాధారణ చర్మవ్యాధులను అతి శీఘ్రంగా నిర్మూలించి చర్మాన్ని పూర్వస్థితికి తెచ్చి సహజంగాను ఆరోగ్యవంతంగాను ఉంచుతుంది అమృతాంజన్-డెర్మల్ అయింట్‌మెంట్ తామర, గజ్జి, దురద ఇతర చర్మ రోగాలకు ఆదర్శమైన నివారిణి నేడే కొనండి!

అమృతాంజన్ లిమిటెడ్ 42-45, లజ్ చర్చ్ రోడ్డు, మద్రాసు 600 004

**Amrutanjan Limited**



757-TG

# రాజ్‌కపూర్ జీవితంలో వెలుగు నీడలు



రాజ్‌కపూర్ ఒక వ్యక్తి కాదు, భారతీయ చలన చిత్ర చరిత్రలో ఒక అధ్యాయం. ఆయన గొప్ప నటుడు, నిర్మాత, దర్శకుడు, "ఆర్కే స్టూడియో" అధినేత. "ఆగ్, బరసాత్, ఆవారా, బూట్‌పాలిష్, జాగ్ తే రహో, జిస్ దేశ్ మే గంగా బహతీ హై" లాంటి కళాత్మక చిత్రాలే కాకుండా "బాబీ, ప్రేమ్ రోగ్, రామ్ తేరీ గంగా మైలీ" లాంటి వ్యాపార చిత్రాలు నిర్మించిన రాజ్‌కపూర్, తన 40 సం.ల అమూల్య సేవలకు దాదా సాహెబ్ ఫాల్కే అవార్డు 2 మే 1988న రాష్ట్రపతి శ్రీ ఆర్. వెంకటరామన్ నుంచి అందుకున్నారు. ఆ

లాభాలు రాకపోయినప్పటికీ నష్టం మాత్రం రాలేదు. నష్టమే వచ్చి వున్నట్టయితే యిప్పుడు వెలుగుతున్న ఆర్కే సంస్థ అప్పుడే ఆరిపోయేది. దర్శకులలో అప్పటికి చిన్నవాడైన రాజ్‌కపూర్ సినిమా విజయం కోసం సినీ చరిత్రలో మొదటిసారిగా మల్టీ స్టార్స్‌ను రంగంలోకి దింపాడు.

ఆ తర్వాత నిర్మించిన "బరసాత్" (వర్షం) కనకవర్షం కురిపించింది. రామానంద్ సాగర్ రచయితగా వెలుగులోకి వచ్చారు. శంకర్ జైకిషన్ సంగీత దర్శకులుగా ఖ్యాతిని ఆర్జించారు.

పుట్టుకతో నే ఎవరూ "ఆవారా"గా వుండరు. పరిస్థితుల ప్రభావం వల్ల ఎవరైనా అవుతారు అనే నిజం రాజ్‌కపూర్ తన "ఆవారా" (పోకిరి) సినిమాలో చూపించారు. ఈ చిత్రం మన దేశంలో నే కాకుండా రష్యాలో కూడా సంచలనం కలిగించింది. అప్పట్నుంచి రాజ్‌కపూర్ సినిమాలు రష్యాలో ప్రదర్శనకు నోచుకున్నాయి. అంటు వ్యాధులకు సంబంధించిన "ఆహ్", అనాథ బాలుర దయనీయ స్థితిని చూపించిన "బూట్ పాలిష్", ఓ ఉత్సాహవంతుడైన బాలునికి సంబంధించిన "అబ్ దిల్లీ దూర్ నహీ హై" ఈ మూడు సినిమాల్లో "బూట్ పాలిష్" విజయవంతం అయింది. ఎదుటి వారిని దోషులుగా వేలు ఎత్తి చూపే వారిలో కూడా దోష



మాస్కో చలన చిత్రోత్సవంలో లిడియా సెమినార్నోవాతో రాజ్‌కపూర్

తరువాత నాలుగు వారాలు మృత్యువుతో హోరాహోరీగా పోరాడిన శ్రీ రాజ్‌కపూర్ తమ 64వ ఏట జూన్ 2వ తేదీ రాత్రి అంతిమ శ్వాస విడిచారు.

1947లో రెండు సంఘటనలు జరిగాయి. ఒకటి మన దేశానికి స్వాతంత్ర్యం రావడం, రెండవది రాజ్‌కపూర్ సినీ దర్శక రంగంలో కాలు పెట్టేందుకు "ఆర్కే ఫిల్మ్స్" అనే సంస్థను స్థాపించడం. "ఆర్కే" సంస్థలో నిర్మించబడ్డ తొలి చిత్రం "ఆగ్" (నిప్పు). ఇది అనేక మందికి వెలుగు నిచ్చింది. అనేక మంది ఈర్ష్యకు గురి అయ్యింది. సినిమా వల్ల పెద

దాదాసాహెబ్‌ఫాల్కే అవార్డుని రాష్ట్ర పతి శ్రీ వెంకట్రామన్ వద్ద నుంచి అందుకుంటున్న రాజ్‌కపూర్





# ఇతరులకోసం జీవించాలన్నది ఆయన కోరిక

## –శ్రీమతి కృష్ణా రాజ్‌కపూర్

మా పెళ్ళి 12 మే. 1946లో అయినప్పుడు రాజాసాహెబ్‌కు 21 సం.లు, నాకు 16. అప్పుడు ఆయన "నీల్ కమల్"లో మధుబాలా ప్రక్కన హీరోగా నటిస్తూ రాత్రింబవళ్ళు యిల్లు పట్టక తిరుగుతున్నారు. మొదట్లో నాకు ఎంతో విసుగు అనిపించేది. కానీ తర్వాత క్రమంగా ఎడ్జెస్ట్ అయ్యాను. నాకు ఒంటరితనం అలవాటు అయింది. "మీరు ఈ ఒంటరితనాన్ని ఎలా భరిస్తున్నారు" అని యితరులు అడిగినప్పుడు "భరించడం కాదు, అడ్జెస్ట్ అవుతున్నాను" అని సమాధానం చెప్పేదాన్ని.

తన పనిలో యితరుల జోక్యం ఆయన ఎంత మాత్రం సహించరు. చిన్న పనిగానీ, పెద్ద పని గానీ స్వయంగా చేసేవారు. ఈ గుణం ఆయన తన తండ్రి పృథ్వీరాజ్ కపూర్ వద్ద నేర్చుకున్నారు. ఇదే గుణం తన పిల్లలకూ నేర్పారు. రాత్రిళ్ళు చాలా ఆలస్యంగా ఆయన నిద్ర పోతారు. మధ్యాహ్నం రెండు నుంచి రాత్రి రెండు గంటల వరకు ఆయన పని వేళలు. తరచు డబ్బూ (రణధీర్ కపూర్) అంటూ వుండే వాడు

"నాన్నగారు అంబులెన్స్ లాంటివారు. కుటుంబ సభ్యులయినా, స్టూడియో స్టాఫ్ అయినా ఆపదలో వుంటే అంబులెన్స్‌లా సిద్ధంగా ఉంటారు. కానీ ప్రేమ, మమకారం వున్నట్టు కనబడరు". అప్పుడు నేను వాడికి నచ్చచెప్పేదాన్ని– "ఆయన మమకారాన్ని ప్రదర్శించరు. అందుకే నువ్వు అలా అంటున్నావు. ఇతరుల కోసం నిద్ర కూడా మానుకుని కలత చెందుతారు".

ఇతరులను యింటికి విందుకు పిలిస్తే ప్రతి చిన్న విషయం పట్టించుకుంటారు. నవ్వుతూ కడుపు నిండా తినిపిస్తారు. ఆయనది చంటిపిల్లవాని స్వభావం– అదే కోపం, అదే అలక. మనస్సులో ఏది తోచితే అది అనటం. కానీ తన బాధను మాత్రం కడుపులో దాచుకుంటారు.

'మేరా నామ్ జోకర్' ఫ్లాప్ అయినప్పుడు తన సర్వస్వం నష్టపోయినట్టు బాధపడ్డారు. ఆ మధ్యాహ్నం తాగడానికి కూర్చున్నారు. ఆయన అసలు పగలు తాగరు. ఎంతోసేపు అడిగితేగానీ చెప్పలేదు– 'కృష్ణా! నేను నీకు చెప్పాలనుకోలేదు. నేను చాలా నష్టపోయాను. నేను ఎంతో అభిరుచితో ఈ సినిమా తయారు చేశాను. నా సర్వస్వం దీనికి ధారపోశాను. కానీ యిలా అయింది". నేను ఎంతో రోదించాను. సినిమా ఫ్లాప్ అయినందుకు కాదు. ఆ చిత్రం ద్వారా జీవించాలనుకున్న [illegible] చెరిగిపోయినందుకు.

(1) మొదటి మైలురాయి: 'జిస్‌దేశ్‌మే గంగా బహతీ హై'లో పద్మినీతో

(2) 'జాగ్‌తేరహో'లో పాత్రలో జీవించారు



లుంటారని "జాగ్ తే రహో" చిత్రంలో ప్రతిపాదించారు రాజ్‌కపూర్. ఈ కథను చిన్న బడ్జెట్‌తో సినిమాగా తీయచ్చు. కానీ రాజ్‌కపూర్ చిన్న పాత్రలకు కూడా పెద్ద నటీనటులని ఎంపిక చేశారు. ఓ విశాల మైన బిల్డింగ్ సెట్‌ను స్టూడియోలో నిర్మించారు. ఖర్చు పెట్టినంతగా లాభాలు రాలేదు. కానీ కార్‌లో వీ వేరీలో గ్రాండ్ ఫ్రి (అత్యుత్తమ అవార్డు) లభించింది. ఇంత గొప్ప సత్కారం ఏ యితర చిత్రానికి యింతవరకు లభించలేదు. ప్రపంచంలోని 3 అత్యుత్తమ చిత్రాల సరసన "జాగ్ తే రహో"ని చేర్చారు. ఆ మూడు చిత్రాలు– ఇటలీకి సంబంధించిన "బయిస్కిల్ థీవ్స్", ఫ్రాన్స్ మరియు జర్మనీ సహకారంతో నిర్మించబడ్డ "వేజెస్ ఆఫ్ ఫియర్" జపాన్ సినిమా "రోష్‌మన్". ఇంత మంచి సినిమాకి మన దేశంలో ఏ బహుమతి లభించలేదు. దాంతో రాజ్‌కపూర్ ఎంతో దిగులు చెంది నవ్వుతూ అన్నాడు– "నేను యిలాంటి చిత్రాలు నిర్మిస్తే దేవిడ్‌లా గుంతయి పోతాను."

ఉత్తమ కళాత్మక చిత్రాలు నిర్మిద్దామని స్థాపింపబడ్డ ఆర్కే సంస్థ అప్పట్నుంచి వ్యాపారాత్మక సినిమాల వైపు దృష్టి మరలించింది. కానీ



మే 2న బహుమతి ప్రధాన ఉత్సవంలో శ్వాస అందనప్పుడు ముఖానికి మాస్క్ తగిలించి ఆక్సిజన్ ఇస్తున్న దృశ్యం.

## రాజ్‌కపూర్ జీవితంలో వెలుగు నీడలు

సందేశాత్మకంగా వుండటం ఈ సంస్థ మొదటి లక్ష్యం. వినోబా భావే ప్రేరణతో బందిపోటు దొంగలు లొంగిపోవటం అనే సంఘటనను కథా వస్తువుగా తీసుకుని రాజ్‌కపూర్ "జిస్ దేశ్‌మే గంగా బహతీహై" నిర్మించాడు. కానీ డైరక్టరుగా తన పేరుకు బదులు కెమెరా మెన్ రాధూ కర్మకార్ పేరు పెట్టాడు. ఆర్కే సంస్థ మొదటి రంగుల సినిమా "సంగమ్" అమెరికాలో ప్రత్యేక శిక్షణ పొందిన రాధూ కెమెరా గొప్పతనానికి మచ్చుతునక. రణధీర్‌ను డైరెక్టరుగా చేసేందుకు రెండు అవకాశాలు యిచ్చాడు. "కల్ ఆజ్ ఔర్ కల్" "ధరమ్– కరమ్" ఈ రెండూ యిటు కీర్తిని ఆర్జించి పెట్టలేదు అటు సొమ్ము సంపాదించ లేదు. "శ్రీ చార్ సౌబీస్" "మేరా నామ్ జోకర్" ఈ రెండూ అంతగా విజయం సాధించ లేదు. "సత్యం శివం సుందరం"లో జీనత్ అమన్ వక్షోజ సౌందర్యాన్ని ఎంత ప్రదర్శించినా టికెట్లు పెద్దగా అమ్ముడు పోలేదు. కానీ డింపుల్ కపాడియా "బాబీ" మాత్రం బాగా సొమ్ము చేసి పెట్టింది.

"జాగ్ తే రహో" లాంటి చిత్రాలు నిర్మించిన రాజ్‌కపూర్ "బాబీ" లాంటి సినిమా నిర్మించకపోతే పరిస్థితి ఎలా వుండేదో ఊహించ లేము. "రామ్ తేరీ గంగా మైలీ"లో మందాకిని నగ్న ప్రదర్శన లేకుండా వుంటే సినిమా 10 వారాలు కూడా ఆడేది కాదు. విచిత్రం ఏమిటంటే, నిజంగా గొప్ప సినిమాలు నిర్మించి నప్పుడు లభించని బహుమతి అలాంటివి తీయడం మానేసిన తర్వాత రాజ్‌కపూర్‌కి లభించింది. బహుశ "జాగ్ తే రహో" (మేల్కొని ఉండు) సమయంలో నిద్రపోయిన వారు యిప్పుడు మేల్కొన్నారేమో!

–క్రాంతి

రాజ్‌కపూర్ మరణవార్త విన్న వెంటనే శోకతప్త అయిన శ్రీమతి కృష్ణారాజ్‌కపూర్, ఆమెని ఓదారుస్తున్న కుటుంబ సభ్యులు



# "నాన్నగారికి మంచి తిండి అంటే మహా యిష్టం"

– రీమాకపూర్

'పండగలంటే నాన్నగారికి మహా యిష్టం', అంటూంది కుమార్తె రీమాకపూర్. ఆర్కే స్టూడియోలో హోళీ పండుగ ప్రపంచ ప్రసిద్ధికెక్కింది. దీపావళీ, వినాయకచవితి, క్రిస్‌మస్ అంతే ఉత్సాహంగా జరుపుతారు.

ఇష్టమైన పదార్థాలుంటే డాక్టర్ల మాట కూడా పక్కన పెట్టి తినేస్తారు. పిల్లవాడిలా తింటూ అంటారు– "అబ్బే తింటం లేదు. రుచి



కుమార్తెలు రీమా, రితు

చూస్తున్నాను. అంతే!" ఆయనకు ఏదైనా తినాలనిపిస్తే నేరుగా అది చేయమని చెప్పరు. మమ్మల్ని అడుగుతారు– "నువ్వు ఈ డిష్ తిన్నావు. అరేరే! ఎంత బావుంటుందో!" వెంటనే వంటవాడికి ఆ డిష్ చేయమని చెబుతారు. ఎప్పుడు డిష్ తయారవుతుందాని ఎదురు చూస్తూ కూర్చుంటారు. నోట్లో వేసుకోగానే చెప్పేస్తారు ఏం తక్కువైందో! ఎలా చేస్తే బాగా వుంటుందో కూడా చెబుతారు.

పండగలకు, పార్టీలకు ఆయనే మెనూ తయారు చేస్తారు. వంటవాడికి డైరెక్షన్స్ స్వయంగా యిస్తారు. డిష్ సరిగా లేకపోతే వడ్డించనివ్వరు. ఆయనకు అన్ని విషయాలు తెలుసు. సైన్స్ దగ్గరనుంచి చరిత్ర వరకు అన్నీ తెలుసు. నిజంగా ఆయన 'ఎన్‌సైక్లోపీడియా' (విజ్ఞాన సర్వస్వం) అని మా నమ్మకం.

ప్రవేశ పెడుతున్నారు

# రీఫిల్ ప్యాక్‌లో సెరిలాక్ వీట్




# ఆదా చేయండి రు.1.50 ప్రతి ప్యాక్ పైన

ఇప్పుడు సెరిలాక్ వీట్ రీఫిల్ ప్యాక్‌లలో లభిస్తోంది మీ పాపాయికి సెరిలాక్ లాభాలన్నింటిని అందించండి ప్రతి ప్యాక్ పైన రు 1 50 ఆదాచేయండి

4 నెలల నుంచి మీ పాపాయికి పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి దీనిని సెరిలాక్ లాభంతో ప్రారంభించండి'

ప్రతిసారి తినిపించే సెరిలాక్ మోతాదులో పోషక పదార్థాలన్నీ ఉన్నాయి పాపాయిలకు సెరిలాక్ రుచి భలే ఇష్టం దానిలో పాలు పంచదార ఉన్నాయి దానిని ముందుగా కాచిన నీటిలో కలిపితే చాలు ఇప్పుడు సెరిలాక్ లాభాలు అన్నీ కూడా తక్కువ ధరకే లభిస్తున్నాయి

తయారు చేయడంలో పరిశుభ్రతను పాటించేందుకు మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకు ప్యాక్‌పైన ఉన్న సూచనలను జాగ్రత్తగా పాటించండి

**ఉచితం!**
సెరిలాక్ బేబీ కేర్ బుక్
ఈ చిరునామాకు వ్రాయండి
సెరిలాక్ పోస్ట్‌బాక్స్ నం 3
న్యూ ఢిల్లీ 110 008

## మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం

R K SWAMY/FSL/5072 TEL

# వ్యక్తిగతం

## రాజ్‌కపూర్‌కి అపూర్వ సత్కారం

భారత చలన చిత్ర పరిశ్రమకి శ్రీ రాజ్‌కపూర్ చేసిన విశిష్ట సేవలకి గుర్తింపుగా ఆయనకి ఈ ఏడాది అత్యంత ప్రతిష్ఠాత్మకమైన దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు లభించింది. తీవ్ర అనారోగ్యంతో,



ఆస్త్మాతో బాధపడుతున్నా అవార్డుని స్వయంగా అందుకోడానికి ఎంతో ఉత్సాహంతో శ్రీ రాజ్‌కపూర్ న్యూఢిల్లీలోని సిరి ఫోర్ట్ స్టేడియంలో అత్యంత వైభవంగా ఏర్పాటు చేయబడిన అవార్డు ప్రధానోత్సవానికి హాజరైనారు. కానీ రాష్ట్రపతి నుంచి అవార్డు స్వీకరించడానికి ఆయన వేదికపైకి వెళ్ళలేని పరిస్థితి ఏర్పడింది. అప్పుడు సంప్రదాయాలని పక్కకి నెట్టి స్వయంగా రాష్ట్రపతి శ్రీ వెంకటరామన్ వేదిక దిగి 'బి' వరుసలో ఉన్న రాజ్‌కపూర్ దగ్గరకి వచ్చి ఫాల్కే అవార్డుని ఆయనకి అందజేయటం అన్నది అపూర్వమైన విషయం. తీవ్ర అస్వస్థతతో. ఊపిరి అందక బాధపడుతున్న ఆ సమయంలో కూడా ఎంతో మర్యాదగా లేచి నిలబడి శ్రీ రాజ్‌కపూర్ రాష్ట్రపతి నుంచి అవార్డుని అందుకున్నారు. ఆ తర్వాత కొద్దిసేపటికే ఆయనని అఖిలభారత వైద్య శాస్త్రాల సంస్థలో చేర్చి నిపుణులు చికిత్సని ప్రారంభించటం జరిగింది. ప్రతి రోజూ ఆయన ఆరోగ్య పరిస్థితిని వివరిస్తూ దేశంలోని ప్రముఖ దిన పత్రికలన్నీ మొదటి పేజీలలో వార్తలు ప్రచురించాయి. అందరినీ శోకసాగరంలో ముంచి శ్రీ రాజ్‌కపూర్ జూన్ 2వ తేదీ రాత్రి అస్తమించారు. భారత చలన చిత్ర రంగానికి శ్రీ రాజ్‌కపూర్ మృతి తీరని లోటు...

## ఇంజక్షన్ వల్ల ఫణిక్కర్ మృతి

అఖిల భారత కాంగ్రెసు (ఐ) సంఘం ప్రధాన కార్యదర్శి, పార్లమెంట్ సభ్యుడు శ్రీ వాసుదేవ ఫణిక్కర్ స్ట్రెప్టోమైసిన్ ఇంజక్షన్‌ని ఒక డాక్టరు సరిగా పరీక్షించకుండా ఇవ్వటంవల్ల మే 2న న్యూఢిల్లీలో మృతి చెందారు. ఆ ఇంజక్షన్ రియాక్షన్ వల్ల ఆయన చనిపోయినట్లు న్యూఢిల్లీలోని లోక్‌నాయక్ జయప్రకాష్ ఆస్పత్రి వారు తెలియ చేసారు. ఆ వైద్యుణ్ణి



అరెస్టు చేసారు. శ్రీ వాసుదేవ ఫణిక్కర్ 1943లో కేరళ రాష్ట్రంలోని అలిప్పిలో జన్మించారు. ఇంగ్లీషు, మలయాళ భాషలలో ఆయన ప్రముఖ రచయిత కూడా. ఆయన మృతికి దారి తీసిన కారణాలని విచారించేందుకు ప్రభుత్వం ఆరుగురు ప్రముఖ వైద్యులతో ఒక సంఘాన్ని నియమించింది....

## రాజారావుకు అంతర్జాతీయ అవార్డు



సాహిత్య అకాడెమీ అవార్డు పద్మభూషణ్ బిరుదులందుకున్న ప్రముఖ కన్నడ నవలా రచయిత శ్రీ రాజారావు (79)కు అమెరికాకు చెందిన అత్యంత ప్రతిష్టాకరమైన 25 వేల డాలర్ల న్యూస్టడ్ అంతర్జాతీయ బహుమతి లభించింది. ఓక్లహామా విశ్వవిద్యాలయం, అది వెలువరించే అంతర్జాతీయ సాహిత్య పత్రిక "వరల్డ్ లిటరేచర్ టుడే" ఈ బహుమతిని ఇచ్చింది. అసాధారణ రచనలకుగాను ప్రతి రెండేళ్ళకొకసారి ఈ బహుమతి ఇస్తారు.

1960 నుంచి అమెరికాలో నివసిస్తున్న శ్రీ రాజారావు ఆస్టిన్‌లోని టెక్సాస్ విశ్వవిద్యాలయంలో ఫిలాసఫీ ప్రొఫెసర్‌గా పనిచేసి ఇటీవల పదవీ విరమణ చేసారు.

1960లో ప్రచురించబడిన ఈయన నవల "దిసర్పెంట్ అండ్ ది రోప్" ఈయనకు అంతర్జాతీయ ఖ్యాతి నార్జించి పెట్టింది. "ది కేట్ అండ్ షేక్స్పియర్", "కాంతాపురా", "ది చెస్‌మాస్టర్ అండ్ హిజ్ మూవ్స్" వీరి ఇతర రచనలు.

శ్రీ రాజారావు 1977లో ఒక భారతీయ రచయితతో మాట్లాడుతూ "కేవలం యాదృచ్ఛికంగా, పరిస్థితుల ప్రభావం వల్ల నేను విదేశంలో నివసిస్తున్నాను, కానీ నా మాతృదేశం ఇదే. అందుకనే ప్రతి సంవత్సరం నేను భారతదేశం వస్తూ ఉంటాను" అని అన్నారట....

## జనతాపార్టీలో చేరిన మేనకాగాంధీ!

రాష్ట్రీయ సంజయ్ విచార్‌మంచ్ అధ్యక్షురాలు మేనకాగాంధీ తమ అనుచరులతో సహా జనతా పార్టీలో చేరిపోయారు. అసలు తమకి ఈ ఆలోచన గత రెండేళ్ళుగా ఉన్నదని కానీ అంతా ఒకే సారి కలిసి కట్టుగా రావాలన్న ఉద్దేశ్యంతో తాము ఇంతకాలం ఈ విలీనాన్ని వాయిదా వేస్తూ వచ్చామని అన్నారామె. లోక్‌దళ్ (అ) కూడా జనతా పార్టీలో చేరటానికీ, తమ విలీనానికీ ఎంతో తేడా ఉన్నదని ఆమె అన్నారు. తాము స్వచ్ఛందంగా, బేషరతుగా జనతా పార్టీలో కార్యకర్తలుగా చేరామని, కానీ అవతలి వారు మాత్రం ఎన్నో షరతులు పెట్టిన తర్వాతే విలీనం అయినారని ఆమె అన్నారు. ప్రస్తుతం జనతా పార్టీ ఎదుర్కొంటున్న సంక్షోభానికి కారణం



మనస్సుక్ కష్టం కలిగించే ఆ షరతులేనని ఆమె అభిప్రాయం. లోక్‌దళ్ (బ)వారు కాంగ్రెసుతో తప్పజనతాతో కలవరని ఆమె అన్నారు. ఒక వేళ జనతా పార్టీ చీలిపోయినా మేనక మాత్రం చంద్రశేఖర్– అజిత్‌సింగ్ వర్గం వైపే ఉంటారనుకోవచ్చు. ఉత్తరప్రదేశ్‌లో పట్టు ఉండే కదా ఢిల్లీ అధికార పీఠానికి మార్గం సుగమంగా ఉంటేది. వారికి అదిఉంది...... □

# తను ఇచ్చే సలహా డాక్టరూ పాటిస్తారు!

డాక్టర్ వృత్తి చాలా కష్టమైనది. తరచు అర్జంటు కేసులు వస్తాయి. రోగులని చూస్తూ అనేక గంటలసేపు పనిచేయవలసి వస్తుంది. రాత్రనక, పగలనక రోగులు వస్తూనే వుంటారు. కాదనకుండ వాళ్ళని చూడాలి. చెప్పలేనంత అలసటవస్తుంది.

అందుకే నేను హార్లిక్స్ మీదే ఆధారపడతాను. హార్లిక్స్‌లో కీలకమైన సహజ పోషకాలు అంటే మాంసకృత్తులు, విటమిన్లు, ఖనిజాలు మరియు పిండిపదార్థాలు సమృద్ధంగా వున్నాయి. ఆ కారణంగ ఇది అదర్శవంతమైన ఆరోగ్య పానీయంగా రూపొందింది.

అందుకే నేను రోజుకి రెండుసార్లు హార్లిక్స్ త్రాగమని సిఫార్సు చేస్తాను. నిజానికి ఇది చాలా రుచికరమైన, ఉత్సాహాన్నిచ్చే పానీయం. రోజంతా పనిచేయడం వల్ల ఉండే అలసటంతా పోగొట్టి ఉత్సాహాన్నిస్తుంది.

నాకు బాగా తెలుసు!

నేను కూడా త్రాగుతాను!



ప్రపంచ మంతటా డాక్టర్లు నమ్మినది.

ప్రపంచమంతటా డాక్టర్లు హార్లిక్స్‌ని జీవశక్తిని. మంచి ఆరోగ్యాన్ని అందించే కీలకమైన సహజ పోషకాలు మాంసకృత్తులు, విటమినులు, ఖనిజాలు మరియు పిండిపదార్థాలు సమృద్ధంగా కలిగి ఉత్సాహాన్నిచ్చే ఆరోగ్య పానీయంగా నమ్ముతారు.

కుటుంబానికంతటికీ పోషకశక్తిని సమకూర్చేదిగా రుజువుకావడంవల్ల డాక్టర్లు హార్లిక్స్‌ని సిఫార్సు చేయడంలో ఏమాత్రం ఆశ్చర్యం లేదు.




మంచి పుష్టికరమైనది

HTA 5815 TEL

సీరియల్

చల్లా సుబ్రహ్మణ్యం

(గత సంచిక తరువాయి)

ఆ స్పర్శ ఆమెకు షాక్ కొట్టినట్లయింది!!
నరాలు జివ్వుమన్నాయి!!

నరాలు తెగ్గొట్టుకుని రక్తం ప్రవహిస్తున్నట్లుగా వుంది!!

అతను ఏమిటన్నట్లు వెనక్కి తిరిగి చూసాడు

చటుక్కున అతని చెయ్యి వదిలేసిందామె

అతని కళ్ళలోకి చూసింది అదోలా తన మనసులోని ప్రకంపనలన్నీ కళ్ళలోకి తెచ్చుకొని చూపులతో అతనికి అందిస్తున్నట్లు చూసింది!

అది గ్రహించాడో లేదో తెలీదుగాని, రాకా కనుబొమలు ముడిపడ్డాయ్

"మిస్ దేదీప్యా! టీనేజర్స్‌కుండే సహజమయిన పోబియా క్రేజ్ తో ఆలోచిస్తున్నావ్! నేనిలాంటి వాటికి అతీతంగా బతుకుతున్నాను నిజానికి మీకీ క్రేజ్ పనికిరాదని చెప్పడానికే యింత దూరం పిలిచాను సున్నితమయిన మీ

జరిగిన కథ– 6·రాకా తాను బ్యాంక్ దోపిడి చేయబోతున్నట్లు పోలీస్ కమీషనర్‌కి వార్నింగ్ ఇస్తాడు ఆ సంగతి పోలీస్ కమీషనర్ తన తల్లికి చెప్తుండగా వింటుంది దేదీప్య దేదీప్యను దుండగుల బారి నుండి రక్షిస్తాడు రాకా ఆ రోజే రాకా బ్యాంక్ దోపిడి చేస్తాడని పోలీస్ డిపార్ట్‌మెంట్ అంతా అప్రమత్తంగా ఉంది అన్నట్లుగానే రాకా బ్యాంక్ దోపిడీ చేస్తాడు బ్యాంక్ విషయంలో తను ఇచ్చిన సలహాకు థాంక్స్ చెప్పను వచ్చిన రాకా చేతిని అప్రయత్నంగా పట్టుకుంది దేదీప్య

మనసును కష్టపెట్టలేక చెప్పలేదు! కానీ యిప్పుడు చెప్పక తప్పలేదు నువ్వు నా స్నేహితురాలివి! నా అవసరం నీకెప్పుడు కావల్సి వచ్చినా నేను వస్తాను! నువ్వు అందరి అమ్మాయిల్లాగా పెళ్ళి చేసుకుని సుఖంగా వుండాలన్నదే నా ఆకాంక్ష! అంతే!" వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు రాకా! అజంతా శిల్పంలా నిలబడి చూస్తుండిపోయింది దేదీప్య

★ ★ ★ ★ ★ ★

సాయంత్రం ఏడున్నర–

బులియన్ మార్కెట్‌లో జనం పల్చబడ్డారు

సోనాలాల్ ముకుంద్‌లాల్ డైమండ్స్ అండ్ జ్యూయలరీ మార్ట్‌లో కూడా కస్టమర్లు ఎవరూ లేరు షట్టర్ దించెయ్యడానికి సిద్ధంగా వున్నాడు వాచ్‌మన్

అంతలో ఆ షాపు ముందు ఓ డాట్సన్ కారొచ్చి ఆగింది అందులోంచి సూట్ వేసుకున్న ఓ వ్యక్తితో పాటు నీలి మేలి ముసుగులో ఓ స్త్రీ కూడా దిగింది

ఆ వ్యక్తి మెలి తిప్పిన మీసాలతో, ఖరీదైన వజ్రపు ఉంగరాల్తో హుందాగా వున్నాడు రీవిగా వాకింగ్ స్టిక్ ఊపుతూ మేలి ముసుగు స్త్రీతో పాటు షాపులోకి అడుగుపెట్టాడు

వాచ్‌మన్ వంగి సలాం చేసి–

"ఆయియే సాబ్!" అన్నాడు వాళ్ళు లోపలికి ప్రవేశించగానే యిద్దరు గుమాస్తాలు "బోలియే సాబ్" అంటూ దగ్గరకొచ్చారు

"నేను మీ సేర్‌తో మాట్లాడాలి!" అన్నాడా వ్యక్తి

"డైమండ్స్ కావాలా?? రత్నాలు కావాలా చెప్పండి సాబ్ మేం చూపిస్తాం!" అన్నాడో గుమాస్తా!

చిన్నగా నవ్వాడా వ్యక్తి

"మీ సేర్‌కి రాజా మహారాణా ఆప్ దోలక్‌పూర్ వచ్చాడని చెప్పు!" అన్నాడు హుందాగా

"వెంటనే లోపల వున్న ముకుంద్‌లాల్ కొడుకు జగల్‌కిషోర్‌కి యింటర్‌కమ్‌లో చెప్పాడు గుమస్తా వెంటనే ఆయన్ని లోపలికి తీసుకు రమ్మని చెప్పాడు సేర్ జగల్‌కిషోర్

మహారాణా భార్యతో కలిసి లోపలికి నడిచాడు ఆయన్ని చూస్తూనే రెండు చేతులు జోడించి–

"ఆయియే సాబ్ ఆయియే ఫర్మాయియే " అన్నాడు జగల్ కిషోర్ సోపా చూపెడుతూ

"వజ్రాల హారంలో పొదగడానికి మంచి వజ్రం కావాలి!" చెప్పాడు మహారాణా

"చెప్పండి ఏ టైప్ కావాలి? అత్యంత ఖరీదైన వజ్రాలు తెప్పించి యిస్తాను" అన్నాడు జగల్ కిషోర్

"మామూలు వజ్రాలు, రత్నాలు మా ఖజానాలో చాలా వున్నాయ్ మాక్కావలసింది కోహినూర్ జాతికి చెందిన 'మేవాడ్ వజ్రం'–"

"మేవాడ్ వజ్రమా! అది నా దగ్గరున్నదని మీరెలా అనుకుంటున్నారు?" అన్నాడు జగల్‌కిషోర్

"కంగారుపడకండి సేర్‌జీ! మేం సంస్థానాధీశులమని మర్చిపోతున్నారు మీరు " అన్నాడు రాణా రీవిగా

"జీ!! నిజమే! నేను సంపాదించాను దాన్ని దాని ఖరీదు క్షమించాలి చాలా ఎక్కువ! దాదాపు మూడు కోట్ల రూపాయలుంటుంది

రాణా కళ్ళెర్రబడ్డాయ్

"మమ్మల్ని మీరు అవమానిస్తున్నారు! అప్టరాల్ మూడు కోట్లేనా? మేము

హెల్త్ హోం ప్రొడక్ట్స్ ప్రై. లిమిటెడ్, సికింద్రాబాద్ సమర్పిస్తున్న స్పెషల్ సీరియల్

దాని ఖరీదు ఇంకా ఎక్కువనుకున్నాం!'' అన్నాడు

తత్తరపడ్డాడు జగత్‌కిషోర్!

"మన్నించండి మహారాజ్! మిమ్మల్ని తక్కువ అంచనా వెయ్యలేదు దాని ఖరీదు మాత్రం చెప్పానంతే! అయినా ఆ వజ్రం యిప్పుడు నా చేతుల్లో లేదు!'' అన్నాడు జగత్‌కిషోర్

రాణా ముఖం కళ తప్పింది

"వాట్ ! అది మీ దగ్గర లేదా? దాని కోసమే వచ్చామే!'' అన్నాడు

"అది విజయపురి రాణీ గాయత్రీదేవికి అమ్మాం!! కావాలంటే అలాంటి వజ్రం కోసం ప్రయత్నిస్తాను!!''

నిట్టూర్చాడు రాణా



"సరే మళ్ళీ అలాంటి ఖరీదైన వజ్రం వస్తే మాకు తెలియజెయ్యండి! యిదుగో నా కార్డ్!!" అంటూ బంగారు నగిషీ అక్షరాలున్న తెల్లటి కార్డు యిచ్చాడు

ఆ తరువాత రాణా తన బేగం వేపు ప్రేమగా చూసి–

"సరే ఉట్టి చేతుల్తో వెళ్ళడం నాకలవాటు లేదు మీ దగ్గరున్న ఖరీదయిన జాతి వజ్రాలు చూపించండి మా దేవికి" అన్నాడు

"జస్టే మినిట్!" అని జగల్‌కిషోర్ యింటర్‌కంలో గుమస్తాకి ఏదో చెప్పాడు వెంటనే రెండు ముఖమల్ కేసుల్లో– గోలీల్లా వున్న వజ్రాలు తెచ్చి టేబుల్ మీద పెట్టి వెళ్ళిపోయాడు గుమస్తా

ఒక్కొక్కటే తీసి దాని గొప్పతనం వివరిస్తున్నాడు జగల్‌కిషోర్!

"నీకా శ్రమ అవసరంలేదు సేఠ్‌జీ!! ఆ వజ్రాలన్నీ మేమే తీసుకుంటున్నాం!!" అన్న రాణా కంఠంలోని కరుకుతనానికి తృళ్ళిపడి తలపైకెత్తాడు జగల్‌కిషోర్

రాణా చేతిలోనూ, మేలి ముసుగు వేసుకున్న స్త్రీ చేతిలోనూ నల్లటి రివాల్వర్లు మెరుస్తున్నాయ్

"అరె! ఏమిటిది?" అని కంగారుగా అంటూ బజర్ నొక్కబోయాడు జగల్‌కిషోర్

ఆ క్షణంలోనే–

"ఫ్లావ్! ఫ్లావ్!"

సైలెన్సర్ అమర్చిన పిస్టల్ మోత చిన్నగా విన్పించింది ఆ శబ్దం ఆ ఎయిర్‌కండిషన్డ్ రూంలోంచి బయటికి పోదని రాణాకి తెలుసు నిశబ్దంగా ముందున్న టేబుల్ మీదకి ఒరిగిపోయాడు జగల్‌కిషోర్!

చటుక్కున టేబుల్ మీదున్న వజ్రాల్ని కర్చీఫ్‌లో చుట్టుకుని కోటు జేబులో పెట్టుకొని రాణితో కలిసి బయటికొచ్చాడు

బయటవున్న గుమస్తాలను చూసి–

"షుక్రియా? మీ సేఠ్ అడిగితే– 'రాజా రాకా' తన సంస్థానానికి వెళ్ళిపోయాడని చెప్పండి!" అంటూ బయటికెళ్ళాడు

మరు నిముషం కారు కదిలింది

★ ★ ★ ★ ★ ★

సరిగ్గా అదే సమయానికి–

పాడుపడిన ఆ కోటలో క్రింద కూర్చుని, చేతులు వెనక్కి వాల్చి ఆకాశం కేసి చూస్తున్నాడు రాకా

అసలు తనెవరు? ఎందుకీ పనులన్నీ చేస్తున్నాడు? చేసి ఏం సాధిస్తున్నాడు? చట్టాన్ని తన చేతుల్లోకి తీసుకుని తను చేస్తున్న మహత్కార్యా లేమయినా ఉన్నాయా? అన్న ప్రశ్నలు అప్పుడప్పుడూ అతనిలో చెలరేగుతాయ్ తీవ్రమైన అశాంతికి గురి చేస్తాయ్

దుష్ట శిక్షణ శిష్ట రక్షణ!

చేసి ? తన పరిధిలో ఉన్నంతవరకూ దుష్టుల్ని శిక్షిస్తాడు శిక్షించినంత మాత్రాన అలాంటి మనుషులు ఈ సమాజంలో మళ్ళీ తయారవకుండా ఉంటారా? ఇలా దుర్మార్గుల్ని శిక్షిస్తూపోతే చివరికి ఈ సమాజంలో ఎంత మంది మనుషులు మిగులుతారు? అసలు మిగులుతారా? ప్రతి వ్యక్తీ ఏదో ఒక క్షణంలో దుర్మార్గంగా ఆలోచిస్తాడు ఎప్పుడో ఒకప్పుడు– ఎవరికో ఒకరికి– తెలిసో తెలియకో– అన్యాయం చేస్తాడు

ఇలా అందరూ పాపాలు చేసే వాళ్ళయినప్పుడు తను కొందర్నే ఎందుకుశిక్షిస్తున్నాడు? వాళ్ళలో చాలా తప్పులు చేసిన వాళ్ళనీ– తమ స్వార్థం కోసం అనేక మందికి ధన, ప్రాణ, నష్టం కలిగించిన వాళ్ళనీ ఏరుకుని వాళ్ళని మట్టుబెడు తున్నాడు

అంత మాత్రాన అలాంటి వాళ్ళందరిలోనూ కనీసం– కొందరిలోనయినా తను ఆశించిన మార్పు కలుగుతోందా? లేదే! మరి అలాంటప్పుడు తను మంచి అని చేస్తున్న పనులన్నిటికీ అర్థ మేమిటి? వీటి పర్యవసాన మేమిటి?

అసలు తనకీ, మిగిలిన సమాజానికీ ఉన్న తేడా ఏమిటి? అందరిలా తనెందుకు లేడు?

ఏ చిన్న ప్రలోభానికి తను లొంగినా కనీసం కోటీశ్వరుడిలా బ్రతికేవాడు

అందమైన భార్య ముద్దు లొలికే పిల్లలూ ఎయిర్‌కండిషన్డ్ ఇల్లు, కారు ఒకటేమిటి? డబ్బు తెచ్చే సుఖాలన్నిటినీ త్యజించి తనీ మార్గంలో ఎందుకు ప్రయాణం చేస్తున్నాడు?

**'అమ్మ' ఆశయం కోసం. ..**

**పది మంది మాన ప్రాణాలు కాపాడ్డానికి ఒక ప్రాణం తియ్యడం తప్పు కాదన్న అమ్మ మాట కోసం. .**

**ఎందరో అభాగ్యుల కన్నీళ్ళు తుడవడానికి కొందరి కళ్ళు మూయించడం ధర్మమే అన్న తాతయ్య కర్మ సిద్ధాంతం కోసం. .**

పదిహేడు సంవత్సరాల క్రితం జరిగిన సంఘటన తాలూకు విషాదచ్ఛాయలే ఈ రోజు తన సిద్ధాంతానికి పునాది రాళ్ళు

తన మార్గానికి మైలు రాళ్ళు

తను కలలుగనే భవిష్యత్‌కి గీటురాళ్ళు

అయితే తను చేస్తున్న పనులన్నిటినీ ఆ న్యాయ దేవత హర్షిస్తుందా? ఆ ధర్మదేవత తనని క్షమిస్తుందా? అసలు చట్టాన్ని తన చేతుల్లోకి తీసుకునే హక్కు తన కెక్కడిది?

ఒక్కసారిగా తల విదిలించాడు రాకా

తీవ్రమైన సంచలనం తనలో కలగ బోతోందని గ్రహించాడు

అందుకే–

కలలోంచి మెలకువ వచ్చిన వాడిలా లేచాడు

వడివడిగా నడిచి వెళ్ళి మోటర్‌సైకిల్ ఎక్కాడు

మరో అరగంటలో నగరానికి ఇరవై కిలో మీటర్ల దూరంలో ఉన్న ఓ ఆశ్రమం ముందు ఆగాడు స్వచ్ఛమైన వెండి వెన్నెల్లో తడిసిన ఆ ఆశ్రమం అప్పుడే కళ్ళు తెరిచిన పసికందులా నిర్మలంగా ఉంది

వెన్నెల కిరణాలు ఆకుల మీద పడి ఆ వాతావరణం ఓ వింత వెలుగుని సంతరించుకుంది

ప్రశాంతతకీ– పవిత్రతకీ ప్రతీకలా ఉన్న ఆ ఆశ్రమంలోకి మెల్లగా అడుగు పెట్టాడు రాకా

ఎదురుగా–

లాంతరు మసక వెలుగులో పద్మాసనం వేసుకుని ధ్యానంలో నిమగ్నమై



# నా ప్రపంచమే తలక్రిందులై పోయేది...



## నేను న్యూ ఇండియాతో పశువుల భీమా చేయించి వుండకపోతే



నా ఎద్దులు చచ్చిపోయాయి, కాని పని మాత్రం ఆగి పోలేదు
ఎందుకంటే, న్యూ ఇండియా సహాయంతో కొత్త ఎద్దులు కొనుక్కోగలిగా.

రైతుకు అతడి ఎద్దులు ఎంత విలువైనవో, అతడికి, అతడి కుటుంబం వారికి బాగా తెలుసు. కాని, ఆ ఎద్దులకు రోగమొస్తే, ప్రమాదంలో దెబ్బ తగిలి పనికి రాకపోతే... లేదా చచ్చిపోతే? అలాంటప్పుడు న్యూ ఇండియా ఎష్యురెన్స్ ఒక మంచి నేస్తంలా మీకు ఆధారంగా నిలుస్తుంది.

**న్యూ ఇండియా ఎష్యురెన్స్ వారి పశువుల భీమా**

ఒక ఏడాదిలో, పశువుల ఖరీదును బట్టి, ప్రతి 100 రూపాయలపై గరిష్ఠం 4 రూపాయలు చెల్లిస్తే చాలు! దేశమంతటా న్యూ ఇండియా ఎష్యురెన్స్ వారివి దాదాపు 1000 కార్యాలయాలు వున్నాయి. ఎక్కువ వివరాల కోసం నేడే మీ ఏజెంట్‌ను కలవండి లేదా మీకు దగ్గరలోని కార్యాలయానికి విచ్చేయండి.

## న్యూ ఇండియా ఎష్యురెన్స్




జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ

పశువుల భీమా—నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం!

R K SWAMY/NIA/3574/TEL

ఉన్నాడు ఓ వృద్ధుడు వెండిలా మెరుస్తున్న జుత్తు- ఆరు శాస్త్రాలనూ- అష్టాదశపు పురాణాలను- నాలుగు వేదాలనూ- ఉపనిషత్తులనూ- ఔపోసన పట్టినట్టుగా ముడతలు పడ్డ ఆయన నుదురు తేజో కిరణాలను వెదజల్లుతోంది

ఆయన నుదిటిపై విభూది రేఖలు బ్రహ్మ వర్చస్సుని- తేజంతో వెలిగిపోతున్న చురుకైన కళ్ళు ఆయన మేథా సంపదనీ- స్థిత ప్రజ్ఞత్వాన్ని స్పష్టంగా సూచిస్తున్నాయి

ఆయనను చూడగానే ఏదో అనిర్వచనీయమైన అనుభూతి చెందిన రాకా- ఆయన ధ్యానముద్రకు భంగం కలుగుతుందేమోనని క్షణం ఆగాడు

రా రాకేష్ బాబూ రా అన్న ఆయన మాటలకు వులిక్కిపడి ముందుకు నడిచాడు

ఆయన కళ్ళలోకి చూడగానే చెప్పలేని దుఃఖం ముంచుకొచ్చింది రాకాకి

తాతయ్యా అంటూ బేలగా ఆయన వళ్ళో వాలి పోయాడు

ఆయన అప్యాయంగా రాకా తల నిమరసాగాడు

ఆ స్పర్శలో ఎంతో ఓదార్పు- మరెంతో లాలింపు!

ఎన్నెన్నో జోల పాటలు

ఏదో అభయహస్తం తన కున్నట్టుగా పసి వాడిలా ఆయన వళ్ళో ఒదిగిపోయాడు రాకా

తనలోని అలజడినీ- మంచి చెడుల సంఘర్షణనీ- ధర్మా ధర్మాల విచక్షణనీ- న్యాయా న్యాయాల సందేహాల్ని ఒక్కసారిగా అడిగేయాలనుకున్నాడు కానీ గొంతు పెగల్లేదు రాకాకి చెప్పాలన్న ఆ తపన అతని కళ్ళలో స్పష్టంగా కనిపిస్తోంది

రాకా అంతర్మథనాన్ని గ్రహించిన తాతయ్య పెదవులపై సన్నటి చిరునవ్వు

'పిచ్చివాడా! భగవద్గీతలో కృష్ణుడు ఏం చెప్పాడు?

బ్రహ్మణ్యాధాయ కర్మాణి
త్యక్త్వా కరోతి యః
లిప్యతే నస పాపేన
పద్మ పత్రమివామ్భసా

ఎవరైతే తాను చేయు కర్మలను పరమాత్మయందు అర్పించి ఫలితము నాశించక చేయు చున్నాడో అట్టి వానిని తామరాకును నీరు అంటనట్టు పాపములు అంటవు అంటలేవు" అంటూ ఆప్యాయంగా రాకా తల నిమిరాడాయన

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

'సెహబాష్! జోగీ- సెహబాష్ మన ప్లాన్, అద్భుతంగా విజయవంతమైంది! ఒకే దెబ్బకు రెండు పిట్టలు! పోలీసులు రాకా వెంటబడ్డారు మనకి వాడి పీడ వదుల్తోంది వజ్రాలు దక్కాయ్!" పట్టరాని ఆనందంతో వజ్రాల్ని చూస్తూ అన్నాడు శంభుదాదా అని పిలవబడే శంభుదాస్

"థాంక్యూ బాస్! మీ ప్రోత్సాహం వుంటే యిలాంటి పీట్స్ ఎన్నైనా చేస్తా!" శంభుదాదా కుడి భుజం జోగీశవ్వాడు

"మనం అనుకున్న నేరాలన్నీ యిక రాకా పేరు మీదే చెయ్యాలి ఆ విషయం చక్కగా ప్లాన్ చేద్దాం! ప్రస్తుతానికి నువ్వు పోయి సెలిబ్రేట్ చేసుకో!" అని జేబులోంచి ఓ వంద రూపాయల నోట్ల కట్ట తీసి జోగి మీదికి విసిరాడు శంభుదాదా

జోగి ఆనందంగా బయటకు నడిచాడు

సరిగ్గాఅదే సమయంలో -

"ఈ మర్డర్ రాకా చేసింది కాదని నా అనుమానం!" అన్నాడు డి జి పి కళ్యాణరామ్ తన ఎదురుగా కూర్చున్న కుక్కుటేశ్వర్రావ్‌ని చూస్తూ

"యస్సర్! కాని వాడు వెడుతూ 'రాకా' అని చెప్పుకున్నాడు కదా మరి?"

"అదే వాడు చేసిన పొరపాటు నేరం 'రాకా' మీదికి పోవాలని చేసినట్టుగా వుంది అలా పేరు చెప్పడం పోతే యిలా ఏదైనా చేసే ముందు రాకా ఫోన్ చేసి చెప్తాడు మరో విషయం ఏంటంటే అతను రివాల్వర్స్ ఎప్పుడూ ఉపయోగించలేదు" చెప్పాడు కళ్యాణ్‌రాం

తల గేదెలాగ ఊపాడు కుక్కుటేశ్వర్రావ్ అతనికి టైట్ యూనిఫాంలో అలా నిల్చోవడం మహా ఇబ్బందిగా వుంది ఆయాసంగా వుంది

యింతలో టెలిఫోన్ మోగింది రిసీవర్ ఎత్తాడు డి జి పి

"హలో సర్! సేఠ్ జుగల్‌కిషోర్‌ని హత్య చేసి వజ్రాలు దోచుకున్నారటగా? మీ పోలీసులు దొంగల్ని వదిలేసి నా నామజపం చేస్తున్నట్టుగా తెలిసింది?" అందవతలి కంఠం

"ఏం నువ్వెందుకు కాకూడదు? ఏం నువ్వు అంతకంటే ఘనుడివా?" అన్నాడు డి జి పి చిరాగ్గా

సన్నటి నవ్వు విన్పించింది

"నేనిలాంటి హేయమైన పనులు చెయ్యనని మీకు తెలుసు కళ్యాణ్‌జీ! యిదెవరు చేసారో నాకు తెలుసు!"

"ఎవరు?" అడిగాడు కళ్యాణ్‌రాం

మళ్ళీ సన్నటి నవ్వు

"అది మీరు తెలుసుకోవలసిన విషయం ఎదురుగా ఉన్నాడుగా మీ కుక్కుటం! అతన్ని కనుక్కోమనండి! ఆ దోపిడీ జరిగింది అతని ఏరియాలో నేగా!" ఫోన్ డిస్ కనెక్ట్ అయింది!!

★ ★ ★ ★ ★ ★

జోగి రాయల్ బార్ నుంచి బయటికొచ్చాడు అతనికి హుషారుగా వుంది బ్లాక్‌డాగ్ విస్కీ కడుపులో వెచ్చగా కదలాడుతోంది బార్‌లోంచి బయటికొచ్చి సిగరెట్ వెలిగించాడు

అతనికి 'రూమీ' గుర్తొచ్చింది ఆమె ఓ కాల్‌గర్ల్! అయినా జోగికి ఆమె సొంత ప్రేయసిలాంటిది! జోగి జేబు నిండుగా కులాసాగా వున్నప్పుడు అతనికి రూమీ జ్ఞాపకం వస్తుంది! టైం చూసుకున్నాడు

పదకొండున్నరయింది ఈ టైంకి రూమీ యింకా తన అపార్ట్‌మెంట్‌కి వెళ్ళదని జోగికి తెలుసు అందుకే ఆమె వుంటుందనుకున్న రాక్‌లాండ్ బార్ వేపు నడిచాడు 'రాక్‌లాండ్' బార్ కాస్త చౌకరకం బార్ రౌడీలు- గాంబ్లర్స్ చేరతారక్కడికి! రూమీ ఒక కస్టమర్‌తో కలిసి కూర్చుని బీర్ తాగుతోంది

"హాయ్ బేబీ" అన్నాడు జోగి రూమీ దగ్గరకెళ్ళి జోగిని చూడగానే రూమీ ఆనందంతో విజిల్ వేసింది

"కమాన్ బేబీ! అయాం ఫుల్ లెటజ్ ఎంజాయ్!" అన్నాడు జోగి

"నో! నో! ఐ బుక్‌డ్ హర్!" అన్నాడు ఆమెకెదురుగా కూర్చున్న కస్టమర్



నేరాల నేపథ్యంలో వాస్త్తవ గాధలు

# ప్రపంచ రికార్డులు బద్దలు చేసిన నరహంతకులు

నెపోలియన్ చిన్న బందిపోటు స్థాయి నుంచి సైన్యాధ్యక్షునిగా ఎదిగాడని నమ్మిన రాస్కోల్నికోవ్ అనే వ్యక్తి ఓ ముసలమ్మని హత్య చేసి శిక్షననుబవించాడు

సమాజాన్నంతటినీ బాధలకు గురి చేసే హత్యలు ఎవరు చేసినా విషమ పరిస్థితులేర్పడి తీరతాయి

ఈ మధ్య 165 హత్యలు చేసి అమెరికా చరిత్రలో హత్యల అధ్యాయంలో అగ్రగామిగా నిల్చిన వాడు లూకాస్ అతని పేరు వినగానే అమెరికా ప్రజలు హడలెత్తిపోతారు

నలభై ఎనిమిదేళ్ళ లూకాస్ అవలీలగా హత్యలు చెయ్యగలడు పగ, ప్రతీకారం, కక్షలు, కార్పణ్యాలు ఇతను చేసిన హత్యలకు కారణాలు కానేకావు

హత్యలు చెయ్యడం లూకాస్ హాబీ! అతని మనస్తత్వం ఏమిటో మానసిక శాస్త్రవేత్తలకు సైతం అంతుపట్టలేదు చివరికి టెక్సాస్ (అమెరికాలో ఓ రాష్ట్రం) ప్రభుత్వం లూకాస్‌ని బంధించి, ఉరిశిక్ష విధించింది

అయితే- అతని సహాయంతో వేరే హంతకులను కూడ పట్టుకోవచ్చునే ఉద్దేశంతో ఇప్పటి వరకూ అతని ఉరిశిక్షను అమలు జరపలేదు ప్రభుత్వం

అసలు లూకాస్ ఎందుకు హంతకుడయ్యాడనే విషయం పరిశీలించినప్పుడు అతని కుటుంబ పరిస్థితులే అతను హంతకుడయేందుకు కొంత వరకూ దోహదం చేశాయని తెలిసింది

లూకాస్ తల్లి ఓ వేశ్య, తండ్రి తాగుబోతు వాళ్ళ పదమూడో సంతానం లూకాస్ ఆర్థిక, సామాజిక సమస్యలతో విసుగెత్తిన లూకాస్ చివరికి హంతుకుడిగా మారి ఉంటాడని కొందరి ఊహ

మనస్థిమితం లోపించడం వల్లనో లేక తల్లి 'వేశ్య' అని తెలుసుకోవడం వల్లనో- లూకాస్ తల్లిని హత్య చేసి పధ్నాలుగేళ్ళ పాటు జైలు శిక్షననుభవించాడు అదీ అతను చేసిన మొదటి హత్య

జైలు నుంచి విడుదల కాగానే హత్యలు, మానభంగాలు చెయ్యడం మొదలు పెట్టాడు ఓ ఎనభైయ్యేళ్ళ వృద్ధురాల్ని హత్య చేసి ఆ శవంతో సంభోగించానని లూకాస్ ఒప్పుకున్నాడు అతను హత్య చేసిన వాళ్ళలో ఎక్కువ మంది 'స్త్రీలు' ఉండడం విశేషం!

> "హత్య వల్ల తక్షణ ప్రయోజనం,సాధించినా శాశ్వత ప్రయోజనమేమీ నెరవేరదు" –డాస్టోవిస్కీ
> (క్రైం అండ్ పనిష్మెంట్)

అయితే అతను ఓ పద్ధతి ప్రకారం హత్యలు చెయ్యలేదు ఎప్పుడు, ఎక్కడ, ఎవరిని, ఎందుకు హత్య చేసిందీ అతనికే తెలీదు ప్రస్తుతం లూకాస్ కటకటాలు లెక్కపెడుతున్నాడు అతని తరఫు లాయర్లు అతనికి మనస్థిమితం లేదని రుజువు చేసేందుకు ప్రయత్నిస్తున్నారు వాళ్ళ ప్రయత్నం ఫలిస్తే అమెరికా న్యాయస్థానంలో లూకాస్‌కి ఉరిశిక్ష తప్పుతుంది

ఇతని కోవకి చెందిన హంతకుడే మరో వ్యక్తి కొలంబియాలో ఉన్నాడు ఈ హంతకుడి పేరు పెడ్రో అలాన్సో లోఫాజ్

నేరాలు చెయ్యడం ఇతని వృత్తి 300 మంది ఆడపిల్లలను మానభంగం చేసి హత్య చేశానని తనే ఒప్పుకున్నాడు దక్షిణ కొలంబియా పెరూ, ఈక్వెడార్ ప్రాంతాల్లోని ఆడపిల్లల్ని ఎంతో మందిని హతమార్చాడతను

ఏడెనిమిదేళ్ళ ఆడపిల్లల్ని వారాని కొకరు చొప్పున అపహరించి, మానభంగం చేసి గొంతు పిసికి చంపేశాడు కొలంబియా పోలీసుల లెక్కల ప్రకారం 1970 నుంచి 1980 మార్చి వరకు మొత్తం 572 మంది ఆడపిల్లలు కనిపించకుండా పోయారు అయితే తను 300 మందిని మాత్రమే హతమార్చాననీ మిగిలిన వాళ్ళ సంగతి తనకు తెలీదనీ లోఫాజ్ అంటున్నాడు

1980 మార్చి నెలలో పట్టుబడ్డ లోఫాజ్, మిగిలిన 272 మంది ఆడపిల్లలను కూడా అతనే హతమార్చి ఉంటాడని పోలీసులు అనుమానిస్తున్నారు

లోపాజ్ హతమార్చిన వాళ్ళ అస్థిపంజరాలను – పోలీసులు అతని ద్వారానే కనుగొన్నారు

1980 మార్చిలో ఈక్వెడార్‌కు సమీపంలోని అంబాటో గ్రామంలో ఓ అమ్మాయిని అపహరిస్తుండగా లోఫాజ్‌ను ప్రజలు బంధించి పోలీసులకు అప్పగించారు అప్పట్నుంచీ ఈక్వెడార్ జైల్లో లోఫాజ్ బందీగా ఉన్నాడు

కోర్టులో కేసు నడుస్తోంది గొప్ప హంతకులుగా 'గిన్నిస్ బుక్ ఆఫ్ ది వరల్డ్ రికార్డ్సు'లో, నమోదయిన లూకాస్, లోఫాజ్‌ల జీవితాలకు ముగింపు ఎలా ఉంటుందో వేచి చూడాల్సిందే □

---

"మిస్టర్ షి ఈజ్ మై గర్ల్! సెర్చ్ ఫర్ ఎనదర్ కాయిన్" అని క్రూరంగా అతని వేపు చూసాడు జోగి

అంత మత్తులోనూ ఆ కస్టమర్‌కి జోగి పర్సనాలిటీ చూసేసరికి ఒళ్ళు జలదరించింది మదించిన ఏనుగులా వున్నాడు చటుక్కున రూమీ చెయ్యి వదిలేసాడు

రూమీ కిలకిలా నవ్వి జోగి మీద వాలి–

"కమాన్ డార్లింగ్! లెటజ్ గో టు మై ప్లేస్!" అంది

యిద్దరూ ఒకరి మీద ఒకరు వాలిపోతూ బార్ బయటికి నడిచారు అంతవరకూ ఆ బార్‌లో వాళ్ళిద్దర్నీ గమనిస్తోన్న ఒక వ్యక్తి మెల్లగా ఫోన్ దగ్గరికి నడిచి భైరాజ్ దాదాకి ఫోన్ చేసాడు

భైరాజ్ ముఠాయే ఈ నగరంలో మొదటి రౌడీ ముఠా అయితే నేరాల్లో కొత్త కొత్త టెక్నిక్స్ ఉపయోగించడం నేర్చుకున్న శంభుదాదా సొంత ముఠాని ఏర్పరుచుకోవడంతో భైరాజ్ ప్రాబల్యం తగ్గిపోయింది దాదాగా జీవితం గడిపిన ఒక ముఠా నాయకుడు తిరిగి అనామకుడుగా ఏదో ఉద్యోగమో వ్యాపారమో చేసి బ్రతకలేడు జీవితాంతం దాదాగానే బతకాలి బతకాలంటే డబ్బు కావాలి అందుకే ఏదో ఒక పెద్ద నేరం చేసి రిటైరైపోవాలని భైరాజ్ ఆశ అలాగే తను రిటైర్ అయ్యేట్టు చేసిన శంభుదాదాని కూడా దెబ్బతియ్యాలని అతని కోరిక ఈ రెండూ నెరవేరాలంటే రాకాలాంటి వాడి సాయం అవసరమని భైరాజ్‌కి తెలుసు

అందుకే రాకా పేరు వాడుకుని వజ్రాలు దొంగిలించిన శంభుదాదా మనిషి జోగి గురించి రాకాకి యినఫర్మేషన్ యివ్వాలని నిర్ణయించుకున్నాడు జోగిని ఫాలో అవుతున్న వ్యక్తి దగ్గర్నుంచి ఫోన్ రాగానే భైరాజ్ రాకా నంబర్‌కి డయల్ చేసాడు

* * * * * *

పావు గంట గడిచింది

రూమీ అపార్ట్‌మెంట్‌లో –

మత్తుగా ఆమె అందాల్ని చూస్తున్నాడు జోగి

"ఏయ్ ప్లీజ్ వద్దు " అంటూనే అతనికి తన నగ్నత్వాన్ని చూపిస్తోంది రూమీ

ఇంతలో –

పెద్ద శబ్దం చేస్తూ మోగింది కాలింగ్ బెల్

"కోన్‌హై?" అరిచాడు జోగి చిరాగ్గా

సమాదానంగా మళ్ళీ కాలింగ్‌బెల్ మోగింది

"హాయ్! హు ఈజ్ దట్?" అడిగింది రూమీ

మళ్ళీ బెల్ మోగింది అలా ఆగకుండా మోగుతూనే వుంది కోపంగా మంచం దిగి తలుపు వేపు నడిచాడు జోగి

రూమీ దుప్పటిని మెడదాకా లాక్కుంటూ "త్వరగా రా!" అంది

తలుపు ఒక రెక్క తెరిచి చేత్తో పట్టుకొని– తల బయటికి పెట్టి చూసాడు జోగి

గదిలోంచి బయటికి పడిన సన్నని వెలుతురు చారలో ఓ ఆకారం నిలబడి వుంది!

అంతే–!

ఆ ఆకారాన్ని చూడగానే

జోగి గుండె ఆగిపోయింది

★ ★ ★ ★ ★

ఆ రోజు–

డి జి పి కళ్యాణ్‌రాం పుట్టిన రోజు–

ఆయన వద్దంటున్నా ఆయన సబార్డినేట్స్ ఆయన మీద అభిమానంతో – పుట్టిన రోజును జరుపుతున్నారు

ఆయన బంగళా ముందు పెద్ద షామియానా వేసారు పోలీస్ శాఖల అదికారులే కాకుండా యితర ప్రభుత్వాధికారులు, పెద్దమనుషులు కూడా వచ్చారు

అందరూ ఏదో ఒక చిరు కానుకలతో వచ్చారు పోలీస్ జవాన్లు వాటిని అందుకుని పక్కన పెడుతున్నారు

అయితే అన్నిటిలోకి రోజ్ ఉడ్‌తో చేసిన ఒక బాక్స్ అందర్నీ బాగా ఆకర్షించింది ఆ బాక్స్ మీద

"వరంగల్ పోలీస్" అని రాసి వుంది గతంలో కళ్యాణ్‌రాం వరంగల్ రేంజ్ డి ఐ జి గా పని చేసాడు

అధికారులందరూ ఆ పెట్టిలో ఏముందో చూడాలని ఉవ్విళ్ళూరారు

"కళ్యాణ్‌జీ వరంగల్ పోలీసులు మీకేదో పెద్ద బహుమతి పంపినట్టున్నారు!" అన్నాడు హోం సెక్రటరీ

కళ్యాణ్‌రాం నవ్వుతూ పెట్టి తెరవమన్నట్టుగా చూసాడు జవాన్లవేపు

"హాపీ బర్త్ డే టూ యూ" అని అందరూ పాడుతూండగా ఆ పెట్టిను తెరిచారు

అంతె!

పాడుతున్న అందరి నోళ్ళూ ఒక్కసారిగా ఆగిపోయాయ్! స్థాణువుల్లా ఆ పెట్టి వేపు చూస్తుండిపోయారు

ఆ పెట్టిలో –

నల్లగా కమిలిపోయిన ఒక వ్యక్తి శవం ఉంది!

సరిగ్గా అప్పుడే ముఖ్యమంత్రి కారు ఆ ఆవరణలో ప్రవేశించింది

"మైగాడ్!" అన్నాడు హోం సెక్రటరీ!

"ఘాస్ట్లీ! అన్నాడు మరో ఐ ఎ ఎస్ ఆఫీసర్

"ఈ శవం శంభుదాదా ముఠాలోని నెంబర్ వన్ కేడీ జోగిది!" అన్నాడు కళ్యాణ్‌రాం కాసేపటికి తేరుకొని

ఒక డి సి పి వంగి, శవం మీదున్న కాగితం తీసి డి జి పి కి అందించాడు కళ్యాణ్‌రాం మెల్లగా ఆ కాగితం మడతలు విప్పాడు అందులో నాలుగే వాక్యాలున్నాయ్

"నా పేరు మీద జుగల్‌కిషోర్‌ని చంపినవాడి శవం పంపుతున్నాను నా పేరు వాడుకుందామని అనుకొనే వాళ్ళకి ఈ శవం ఒక హెచ్చరిక! .

"మీ పుట్టిన రోజు సందర్భంగా నా శుభాకాంక్షలు– రాకా" అని వుందా కాయితంలో

"ఎంత ధైర్యం రాస్కెల్‌కి!" అన్నాడు హోం మంత్రి

చూశారా కళ్యాణ్‌రాంజీ! రాకా ఎంతగా చెలరేగిపోయాడో! ఖిటీజ్ యాన్ యిన్సల్ట్ టు ఆల్ ఆఫ్ అజ్!" అన్నాడు ముఖ్యమంత్రి ఏకాంబరం!

కళ్యాణ్‌రాం ఏం మాట్లాడలేదు అందరి వేపూ ఓసారి చూసి తిరిగి శవంవేపు నిదానించి చూసాడు తర్వాత మెల్లగా ధృఢంగా అన్నాడు

"రాకాని పట్టుకొని తీర్తాను నెల రోజుల్లో! లేకపోతే నా పదవికి రాజీనామా చేస్తాను రాకాని సజీవంగానైనా– శవంగానైనా పట్టుకొని తీర్తాను!" అన్న మాటలు ఆ నిశ్శబ్ద వాతావరణంలో బాంబుల్లా ధ్వనించాయ్

★ ★ ★ ★ ★ ★

ఆదర్శ నగర్–

అధునాతనమైన ఓ బిల్డింగ్ ముందు తన సైకిల్ని ఆపాడు పోస్ట్‌మాన్ వరండాలో కూర్చున్న ఓ అరవై ఏళ్ళ వృద్ధుడు లేచి గేట్ దగ్గరకొచ్చి పోస్ట్ అందుకున్నాడు

"ఏవిటోయ్ యింత ఆలస్యమైంది?" అడిగాడా వృద్ధుడు

"ఏం చెయ్యను సార్! నా ఏరియా పెద్దదయి పోయింది మరో పోస్ట్‌మాన్‌ని అప్పాయింట్ చెయ్యమని ఎంత చెప్పినా మా పోస్ట్‌మాస్టర్ వినడంలేదు మీకేం సార్! యింజనీర్లు! రిటైరయినా బోల్డంత పెన్షనొస్తుంది కాలు మీద కాలు వేసుకొని బతికెయ్యవచ్చు" అన్నాడు పోస్ట్‌మాన్

"ఏం బతకడంలే! బోరుకొట్టి ఛస్తున్నా! పని చేసినన్నాళ్ళూ ఎప్పుడు రిటైరవుదామా అనిపించేది యిప్పుడు అసలు పని లేకుండా కూర్చోవడం విసుగ్గా వుంది!" అన్నాడు

"అన్నట్టు మీకో రిజిస్టర్ లెటర్ వచ్చింది సార్!" అంటూ కవరందించాడు పోస్ట్‌మాన్ సంతకం చేసి– పరంధామ్, రిటైర్డ్ చీఫ్ యింజనీర్ అని వున్న ఆ కవర్ని ఆశ్చర్యంగా విప్పసాగాడు పరందామ్



"వస్తాను సార్" అనేసి వెళ్ళిపోయాడు పోస్ట్‌మన్

పరంధామ్ అనేక నీటిపారుదల కార్యక్రమాలు- యిరిగేషన్ ప్రాజెక్ట్‌లకూ యిన్‌చార్జ్‌గా వుండేవాడు కొడుకు ఓ ఫార్మాస్యూటికల్ కంపెనీని నడుపుతున్నాడు ప్రస్తుతం ఆయన కొడుకు దగ్గరే వుంటున్నాడు

కవరు విప్పి లోపలున్న రెండు పేజీల ఉత్తరాన్ని బయటికి తీసాడు టైప్ చెయ్యబడ్డ అక్షరాల వెంట ఆయన కళ్ళు పరుగెత్తాయ్

"పూజ్యులైన పరంధామ్‌గారికి!

స్వాతంత్ర్యానంతరం నవభారత నిర్మాణానికి నడుం కట్టిన మహనీయులెందరో వున్నారు అలాగే మన రాష్ట్ర పునర్నిర్మాణానికి కృషి చేసిన త్యాగధనుల్లో యింజనీర్లు ప్రముఖ పాత్ర వహిస్తారు

అయితే ప్రస్తుత పరిస్థితుల్లో గతంలోలా అంకిత భావంతో పనిచేసే యింజనీర్లు కరువయ్యారు అందుకే నిర్మాణాత్మక- కార్యక్రమాలు చురుగ్గా సాగడంలేదు రాష్ట్రంలో బడుగు వర్గాలకు మేలు జరగడంలేదు

అందుకే మేము ఆనాటి యింజనీర్లలో కొంతమందిని ఎంపిక చేసి సత్కరిద్దామనుకొంటున్నాము మీలాంటి అనుభవజ్ఞులైన యింజనీర్ల సలహా సహకారాలు ఈనాటి యువ యింజనీర్లకు అవసరమని భావిస్తున్నాము

ఆ ఉద్దేశ్యంతోనే మేము ఎంపిక చేసిన యింజనీర్లకు వివిధ ప్రాంతాల పర్యటనలు ఏర్పాటుచేద్దామనుకొంటున్నాం వీలయితే ప్రభుత్వ సహకారంతో కొన్ని పనులకు ఆనరరీ యింజనీర్లుగా ఉంచే ఏర్పాట్ల గురించి ప్రభుత్వంతో సంప్రదింపులు చేస్తున్నాం

ఈ విషయాలన్నీ సమగ్రంగా చర్చించడానికి ఈ నెల పన్నెండో తేదీన ఏలూరు నుంచి రాజమండ్రి వెళ్ళే దారిలో గుండుగొలను అనే గ్రామం దాటిన తర్వాత కొత్తగా కట్టిన హరిజన కాలనీలో ఆహ్వానితులతో మీటింగ్ ఏర్పాటు చేసాం ఆ కార్యక్రమానికి మీరు తప్పక విచ్చేయవలసిందిగా కోరుతున్నాం

ఏలూరులో మీరు దిగగానే మా సభ్యులు మిమ్మల్ని రిసీవ్ చేసుకుంటారు పన్నెండో తారీఖున గోదావరి ఎక్స్‌ప్రెస్‌కి ఫస్ట్ క్లాస్ ట్రెయిన్ టికెట్ పంపిస్తున్నాం మీరు తప్పకుండా వచ్చి కార్యక్రమాన్ని జయప్రదం చేస్తారని ఆశిస్తున్నాము-

యిట్లు

ఎమ్ ఎన్ డి పి సోమరాజు,

కార్యదర్శి మరియు సభ్యులు,

రాష్ట్ర పునర్నిర్మాణ సంస్థ

ఆ ఉత్తరం చూసిన పరంధామ్‌కి కాస్త గర్వం, కొంచెం ఆశ్చర్యం, బోలెడంత ఆనందమూ కలిగింది

వెంటనే మిత్రుడు సంజీవరావుకి ఫోన్ చేసాడు

"నాకివాళ ఓ విచిత్రమైన ఉత్తరం వచ్చింది!" అని చెప్పాడు

"అదే- ఆ రాష్ట్ర పునర్నిర్మాణ సంస్థదేనా?" అడిగాడు సంజీవరావు

"అరె! నీకెలా తెలుసు?" అడిగాడు పరంధామ్ ఆశ్చర్యంతో

"యిప్పుడే నాక్కూడా అలాంటి ఉత్తరమే వచ్చింది ఫస్ట్ క్లాస్ టికెట్‌తో -"

"అయితే నువ్వు కూడా వస్తున్నావా?" అడిగాడు

"మరి? మళ్ళీ ఈ వయసులో మన సంపాదనకి ఛాన్సు వస్తుంటే వదులుకుంటానా? ఏం? నీకు సరదాగా లేదా?" అడిగాడు సంజీవరావు

ఎందుకు లేదు కాస్త రిలీఫ్‌గా వుంటుందిగదా!

ఆహ్! కాస్త జాగ్రత్తగావుంటే లాభసాటిగా కూడా వుంటుంది "

అంటే యింకో బిల్డింగ్ కడదామనా? అడిగాడు పరంధామ్

ఏం? అవకాశంవుంటే నువ్వు కట్టవా?

ఇద్దరూ సరదాగా నవ్వేసుకున్నారు

సాయంత్రం ఓసారి యింటికిరా మనం ప్రయాణపు ఏర్పాట్ల గురించి మాట్లాడుకుందాం రేపేగా మనం వెళ్ళాల్సింది?

"అలాగే."

ఫోన్లు పెట్టేసిన ఆ యిద్దరు రిటైర్డ్ యింజనీర్లకి తెలీదు- ఇరవైనాలుగు గంటల్లో అనూహ్యమైన ఓ సంఘటన జరగబోతోందని.

★ ★ ★ ★

ఆ రోజే పన్నెండో తేదీ!

పరంధామ్, సంజీవరావులతో పాటు మరి కొంతమంది రిటైర్డ్ యింజనీర్లు ఏలూరు స్టేషన్లో దిగారు. అక్కడ వాళ్ళని రిసీవ్ చేసుకున్న సంస్థ కార్యదర్శి సోమరాజు ఒక వ్యాన్‌లో వాళ్ళందర్నీ తీసుకుని బయల్దేరాడు.

దాదాపు వచ్చినవాళ్ళంతా ఒకరికొకరు పరిచయస్తులే! రిటైరయినతర్వాత కలుసుకోవడం – అదేదో అందరూ కలిసి ఎక్స్‌కర్షన్ కెళ్ళబోతున్నంత ఆనందంగా వుంది. జోక్స్‌తో కబుర్లతో లోకం మర్చిపోయారు వాళ్ళంతా.

ఏలూరుదాటి పద్నాలుగు కిలోమీటర్లు దాటాక వ్యాన్ రోడ్డు దిగింది. అలా అయిదు కిలోమీటర్లు వెళ్ళాక – యింకా కట్టబడి ప్రారంభంకాని ఓ హరిజన కాలనీ ముందు ఆగింది వ్యాన్. కాలనీ ప్రక్కనే ఈ సమావేశం కోసమే ఓ పెద్ద హాలు కట్టబడింది. స్నానాలు, టిఫిన్ల కార్యక్రమం పూర్తయింది. ఆ తర్వాత అందరూ ఆ హాల్లో సమావేశమయ్యారు.

పరంధామ్, సంజీవరావుల్ని స్పీకర్లుగా నియమించారు. మరో సీనియర్ యింజనీర్‌ని ప్రెసిడెంట్‌గా చేసి – గతంలో వాళ్ళు ఆధ్వర్యంవహించిన ప్రాజెక్టుల గురించి, ప్రజోపయోగ కార్యక్రమాల గురించీ చర్చించుకున్నారు. ఆ తర్వాత భోజనాలు ఏర్పాటయ్యాయి. షడ్రసోపేతమైన విందుభోజనం ముగించుకుని తాంబూలాలు నములుతూ విశ్రాంతి తీసుకోవడానికి మళ్ళీ హాల్లోకి వచ్చారంతా.

సరదా కబుర్లతో ఐదునిముషాలు గడిచాయి. అంతలో సంస్థ కార్యదర్శి సోమరాజు, మరికొంతమంది వ్యక్తులు కలిసి ఏవో ఫైల్స్ తీసుకుని వచ్చి చకచకా తలకొక ఫైలు చొప్పున యిచ్చారు. ఆ ఫైలు విప్పిన వాళ్ళ ఒక్కొక్కరి ముఖాలు వాడిపోసాగాయి.

"డియర్ ఫ్రెండ్స్!" ఓ గంభీర కంఠం హాల్లో ప్రతిధ్వనించింది.

అందరూ ఉలికిపాటుగా తలలు ఎత్తారు. ఆ మాటలు ఎక్కడనుంచి వచ్చాయో అర్థంకాలేదెవరికీ. కాని అక్కడున్న వాళ్ళంతా మేధావులు! కొన్ని క్షణాల్లోనే కనిపెట్టేసారు హాలు రూఫ్‌లో ఒక చిన్న మైక్ ఏర్పాటయిందని. బయటనుంచి ఎవరో మైక్‌లో మాట్లాడుతున్నారనే వాళ్ళకి అర్థమైంది.

"డియర్ ఫ్రెండ్స్! యిప్పటివరకూ మీరు గతంలో చేసిన పనుల తాలూకు ఫైళ్ళను చూసారు. ఆ పనుల్లో ఎన్ని అవకతవకలున్నాయో, మీరు కాంట్రాక్టర్లు కలిసి లంచాలు ఎంతగా మింగారో, పేదవాళ్ళ పొట్టలు ఎలా కొట్టుకుతిన్నారో అందులో స్పష్టంగా వుంది. అలాగే మీరు కట్టిన నాసిరకం కట్టడాలు కూలి ఎంతమంది అభాగ్యులు చచ్చిపోయారో – ఎందరు పసిపిల్లలు అనాధలయ్యారో – ఒక్కసారి గుర్తుతెచ్చుకోండి!

మీరు చేసిన పాపాలకి తగిన శిక్ష విధించి – యువ యింజనీర్లకి కనువిప్పు కలిగించాలనేదే నా ఆశయం".

ఆ మాటతో అందరూ గాభరాగా చుట్టూ చూసారు. తమకి ఫైళ్ళందించిన వాళ్ళు ఎప్పుడు ఆ హాల్లోంచి వెళ్ళిపోయారో తెలీదు. నలువేపులా హాలు తలుపులు వేసివున్నాయి!

మళ్ళీ ఆ కంఠం చెప్పసాగింది.

తాముచేసిన అన్యాయాలూ, అకృత్యాలూ, ప్రజా ద్రోహం తాలూకు వివరాలన్నీ వినలేక చెవులు మూసుకున్నారు ఆ యింజనీర్లు అందరూ.

(ఇంకా వుంది)

# మనిషి

ఎం.వి.ఎస్.ఎస్.ప్రసాద్

నేను పదిహేను రోజుల తరువాత ఆ రోజు నర్సింగ్‌హోం కి వెడుతున్నాను. చిన్నపిల్లలు పదిపదిహేను రోజుల తరువాత స్కూలికి వెళ్ళాలంటే ఎలా బాధపడతారో అలా అనిపించింది నా మనస్సుకు. అంతా ఏదో కొత్తగానూ, కంగారుగానూ వుంది. నా విచిత్ర మానసిక స్థితి నాకే నవ్వు వచ్చింది. మనిషికి ఏదైనా రెండు రోజులు అలవాటు పోయేసరికి మామూలుగా చేసేపనులకే కష్టపడిపోతాడు. వాచీకేసి చూసుకున్నాను. తొమ్మిది కావడానికి ఎక్కువ ఆలస్యం లేదు. గబగబా చెప్పులు తొడుక్కుని కారుకేసి నడిచాను.

"అయ్యగారూ భోజనాని కొస్తారా లేకపోతే కేరియర్ తీసుకు రమ్మంటారా?" అని అడిగింది పనిమనిషి.

"వచ్చేస్తానులే. అయితే చాలా రోజుల తరువాత వెడుతున్నానుకదా. కేషులు అవీ చూడడం ఆలస్యం అవవచ్చు. నా కోసం చూడకు. నువ్వు భోజనం చేసేయ్" అంటూ కారును నెమ్మదిగా రోడ్డుమీదకు నడిపించి, ఒకటి, రెండు నిమషాలలో ట్రాఫిక్ ప్రవాహంలో కలిసిపోయాను.

నర్సింగ్‌హోం చేరేసరికి అరుణ నాకోసం ఎదురుచూస్తోంది. ఆ రోజు వస్తున్నానని క్రితం రాత్రి ఆమెకి ఫోన్‌చేసాను.

"ఏమిటమ్మా అరుణా ఎలా వున్నావు? ఏమిటో ఈ పేషంట్ల బాధ్యత అంతా నీకే అప్పగించి వెళ్ళిపోయాను. ఏం కష్టపడ్డావో ఏమిటో..... కుమార్‌ని రోజూ వచ్చి కాస్త నీకు సహాయం చేయమని చెప్పాను..... వచ్చేవాడా?"

"ఆఁ! ఇక్కడే మీ సమస్యలు లేవుబాబాయ్. నిన్నొక ఎమర్జన్సీ మేజర్ సర్జరీచేసాం. డాక్టర్ కుమార్, డాక్టర్ రఘునాథ్ వచ్చారు..... పేషంట్ చక్కగా కోలుకుంటున్నాడు."

"అలాగా! కేసేమిటమ్మా?"

అరుణ కేసుగురించి చెప్పింది.

"కంగ్రాట్స్! ఎనీవే డాక్టర్ అర్జున అండదండలుండగా పేషంట్లకి భయమేమిటి?" అన్నాను నవ్వుతూ.

"అయినా నువ్వు కాకపోతే నన్నెవరు పొగుడుతారులే బాబాయ్. ఎంతయినా నీ శిష్యురాలినే కద.... మా ఆయనకి ఎంతసేపూ కంపెనీ గొడవలూ, బోర్డ్ మీటింగ్‌లే సరిపోతాయ్. ఇక నన్ను విమర్శించడానికీ, పొగడడానికీ టైమెక్కడిది..... ఏమిటిబాబాయ్ మరీ చిక్కిపోయావు?..... పేషంట్స్‌ని చూస్తావా లేకపోతే ఈపూటకి రెస్టు తీసుకుంటావా?"

"నిన్న ఆపరేషను అయిన కేసుని చూస్తానులే అరుణా.... మిగతా కేసులు చూసే ఓపికా, ఆసక్తి..... ఈ రోజు లేదమ్మా. పద" అంటూ వార్డుకేసి బయలుదేరాను.

ఆ ఒక్క పేషంట్‌నీ చూసొచ్చి నా గదిలో మౌనంగా కళ్ళు మూసుకుని కూచున్నాను. అరుణ వార్డులోనే వుంది. 'నా కనుకొలనులలో నీళ్ళు చేరాయి. హృదయం భారమయ్యింది. అవును జరిగిన సంఘటన అటువంటిది..... నా ఆలోచనలు అటువైపు పరిగెత్తాయి. నా తల్లి.... నవమాసాలు మోసి, కని, పెంచిన నా తల్లి.... నా కళ్ళముందే బూడిదయిపోయింది. నన్ను ప్రాణం కన్నా మిన్నగా చూసుకున్న ఆ రాగమయి నేను చూస్తుండగానే పంచభూతాల్లో కలిసిపోవడం నన్ను విపరీతంగా క్రుంగదీసింది. రక్త సంబంధం అంటూ యిక నేను చెప్పుకోతగ్గ వ్యక్తి ఎవరూ ఈ ప్రపంచంలో లేరనే భావన నా గుండెను పిండిచేసింది..... అయినా..... అయినా అన్నిటినీ భరించే శక్తి ఆ భగవంతుడిచ్చారు..... కన్న తండ్రి ఎవరో, ఎలా వుంటాడో నాకు తెలియదు. తోబుట్టువులు లేరు. నాకు తెలిసిందల్లా అమ్మ.... అమ్మ మాత్రమే. నాకు ఆమెతోడిదే లోకం అయింది. అటువంటి అమ్మ యింకలేదనే విషయంతో ఎందుకో నా మనస్సు రాజీపడలేకపోతోంది. చివరి రోజులలో నా దగ్గరుండకుండా మామయ్యగారింటికి వెళ్ళి అక్కడే ఆమె తనువు చాలించడం మరీ బాధగా వుంది.

చిన్నప్పుడే నూరేళ్ళు నిండిన నా ఒక్కగానొక్క కొడుకు, అతనిని వెతుక్కుంటూ వెంటనే వెళ్ళిపోయిన నా భార్యా...... అప్పుడు కూడా నేను క్రుంగిపోయాను. దుఃఖభారానికి లొంగిపోయాను. అప్పుడు అమ్మ నన్ను తన ఒడిలోకి తీసుకొని ఓదార్చింది, సేదతీర్చింది..... మరి యిప్పుడు అరుణ....... అరుణ వుందిగా. అరుణ నా పెళ్ళయిన కొత్తలో పక్కింట్లో వుండేది. అప్పుడు చాలా చిన్నపిల్ల. 'బాబాయ్ - బాబాయ్' అంటూ చనువుగా తిరిగేది. రోజులో ఎక్కువభాగం మా యింట్లోనే గడిపేది. అలాంటి అరుణ యిప్పుడు శారీరకంగానూ, మానసికంగానూ కూడా ఎంతో ఎదిగిపోయింది. ఎం. ఎస్. పాసయి నాకు అసిస్టెంట్ చేస్తోంది.

"అమ్మా!" అప్రయత్నంగా నా నోటినుంచి ఆ మాట వెలువడింది. కళ్ళమ్మట నీళ్ళు బొట్లుగా రాలిపడడం ప్రారంభించాయి. అరుణ నేను కూచున్న గదిలోకి వచ్చింది.

"ఏమిటిబాబాయ్ బాధపడుతున్నావా? అందరికీ ధైర్యం చెప్పే నువ్వే అలా అయిపోతే ఎలాగ చెప్పు? అయినా డాక్టరుగా నువ్వు ఎంతోమందిని మృత్యువును చేరుకుంటూంటే చూసుంటావు....... తల్లి అంటే బాధ తప్పదనుకో....... ఏమిటది చిన్నపిల్లాడిలా? కళ్ళు తుడుచుకో!"

"అమ్మా అరుణా! ఒక డాక్టరుగా నా హృదయం మొద్దుబారిపోయినా, ఒక మనిషిగా, ఆ తల్లి కొడుకుగా యింకా అది సున్నితంగానే వుందమ్మా. అయినా నా హృదయంపై గాయాలు ఆరేవికాదులేమ్మా. ఈ రోజు బాధపడి, రేపు మర్చిపోడానికి" అన్నాను కింది పెదవిని పళ్ళతో బిగపట్టి వస్తున్న దుఃఖాన్ని బలవంతంగా ఆపుకుంటూ.

"నీ బాధను నేను అర్థంచేసుకోగలను. కానీ మన చేతులలో ఏముంది చెప్పు.... పోనీ బాబాయ్ కొన్ని రోజులు మా యింట్లో వుండగూడదూ. వంటరిగా ఆయింట్లో ఏం వుంటావు?"

"వంటరితనం కొందరిపట్ల శాపమైనా అది నా విషయంలో వరమైందమ్మా. అందుకే.... అందుకే నా జీవితాన్ని డాక్టరుగా రోగులకు అంకితం చేయగలుగుతున్నాను అరుణా. అయినా వంటరితనం నా కేమీ కొత్తకాదు. కాకపోతే పరిస్థితులొక్కోసారి బాధపెడతాయంతే. నేను వెడతానమ్మా. ఏదైనా అవసరం వుంటే ఫోన్‌చెయ్యి" అంటూ రూము బయటికి నడిచాను నేను.

* * *

సాయంకాలం నాలుగయ్యింది. ఫోన్ అదేపనిగా రింగవుతూంటే పనిమనిషి ఎత్తింది. ఒక నిమషం

అయ్యాక,

అయ్యగారూ అరుణమ్మగారు మిమ్మల్ని అరజంటుగా పిలవమన్నారు అని చెప్పిందామె

నేను ఒక్కవుదుటన ఫోన్‌దగ్గరికి పరిగెత్తాను ఎందుకంటే అరుణ – అందులోనూ యింకొక గంటలో నర్సింగ్‌హోంకి వస్తానని తెలిసి ఆ టైములో కంగారుగా ఫోన్‌చేసిందంటే ఏదో అత్యవసరమైన కేసే అయ్యుంటుంది

హలో అరుణా ఏమిటీ సంగతి? అని అడిగాను నేను అరుణ వివరంగా చెప్పింది ఏదో సీరియస్ కేసు వచ్చిందని, వెంటనే బయలుదేరి రమ్మనీ, ఆపరేషనుకి అన్ని ఏర్పాట్లు చేస్తున్నాననేది ఆమె చెప్పినదాంట్లో సారాంశం నేను వెంటనే బట్టలు వేసుకుని కారు స్టార్టుచేసాను

రా బాబాయ్' నిన్ను డిస్టర్బ్‌చేసినందుకు సారీ నీకు అంతా చెప్పేనుకదా ఆపరేషనుకి అన్ని ఏర్పాట్లు చేసాను కానీ బ్లడ్ ప్రోబ్లేమ్‌గా వుంది 'ఒ' గ్రూప్ కొంచెం కష్టం కదా నాలుగయిదు చోట్లకి ఫోన్‌చేసి ట్రైచేసా ఎక్కడా లేదన్నారు

అలాగా కానీ అరుణా ఈపరిస్థితిలో

అడుగో బాబాయ్ ఆయనే ఆ అబ్బాయి తండ్రి అంటూ అప్పుడే రూములోకి వస్తున్న వ్యక్తిని చూపించింది అరుణ

ఒక నిమషం ఉలిక్కిపడ్డాను నేను వచ్చినతని మొహంలో రంగులు మారాయి అతను విశ్వం అనుమానం లేదు విశ్వం నేను ఆవేశ పడలేదు ఎందుకంటే ఆవేశం వలన అనర్థం తప్పితే ఉపయోగం లేదని నాకు జీవితం నేర్పింది

నన్ను క్షమించండి డాక్టర్, నేను చేసిన పనికి సిగ్గు పడుతున్నాను గతంలో జరిగిన విషయాలేమీ మనస్సులో పెట్టుకోకండి నా కొడుకుని కాపాడండి డాక్టర్ నా కొడుకుని కాపాడండి అంటూ నా కాళ్ళు పట్టుకున్నాడు విశ్వం

లెండి' ఏమిటిది మిమ్మల్నే అంటూ అతనిన్ని పైకి లేవనెత్తాను

దయచేసి నా బిడ్డను కాపాడండి నేను మీకు క్షమించరాని ద్రోహం చేసాను కానీ ఆ కోపం నా కొడుకు మీద చూపించకండి

సారీ మిస్టర్ విశ్వం ఈ ఆపరేషను నేను చెయ్యలేను

అలా అనకండి డాక్టర్ ప్లీజ్ అలా అనకండి నేను కదా మీ శత్రువును నన్ను కొట్టండి నరకండి చిత్ర వధ చేయండి కానీ నా బాబుని రక్షించండి

చెప్పాను కదా వేరే డాక్టర్‌కి ఎవరి కన్నా చూపించండి డాక్టర్ కుమార్ అని

నా మాటలను మధ్యలో నే త్రుంచేసాడు విశ్వం

అలా అనకండి డాక్టర్ మీరొక్కరే ఈ ఆపరేషన్ బాగా చేయగలరు మా ఊరి డాక్టరుగారు చెప్పారు ఈ ఊళ్ళో ఎవ్వరిని అడిగినా మీ పేరే చెప్పారు మిమ్మల్ని ప్రాధేయపడుతున్నాను ఎంత డబ్బైనా ఇస్తాను

చూడండి మిస్టర్ విశ్వం డబ్బుతో చాలా పనులు అవుతాయి, కానీ అన్ని పనులూ మాత్రం అవవని తెలుసుకోండి అన్ని రోజులు మీవి కావనే విషయం మీకు అర్థమయిందనుకుంటాను

అమ్మా మీరన్నా చెప్పండమ్మా అన్నాడు విశ్వం దీనంగా అరుణకేసి తిరిగి

బాబాయ్ అరుణ ఏదో చెప్పబోయింది

నువ్వు మాట్లాడకు అరుణా అన్నాను సీరియస్‌గా

అంటే మా కేసు మీరు టేకప్ చేయరా'? దృఢంగా ఉంది విశ్వం స్వరం

యస్!!' అన్నాను నాకు తెలియకుండానే నా కంఠంలో కాఠిన్యత వ్యక్తమైంది

సరే మా ఖర్మ ఎలాగుంటే అలా జరుగుతుంది కానీ డాక్టర్ మిమ్మల్ని అని ఏం లాభం లెండి మిమ్మల్ని దేవుడూ, దెయ్యమూ అంటారే ఆ ప్రజలని అనాలి ఛీ! ఒక మనిషి ప్రాణాపాయంలో ఉంటే చూస్తూ ఊరుకునే మీరు మనుషులా, రాక్షసులు మానవ రూపంలో ఉన్న యమ దూతలు ఇంకా ఆవేశంగా ఏదో అనబోయాడు విశ్వం



"మిస్టర్ మైండ్ యువర్ టంగ్" అని అరుణ గద్దించేసరికి ఏమనుకున్నాడో ఏమో ఒకసారి అరుణ వైపు, నా వైపు చూసి బయటికి వెళ్ళిపోయాడు విశ్వం.

"బాబాయ్ నువ్వు తప్పు చేస్తున్నావనిపిస్తోంది" అంది అరుణ మెల్లగా.

"లేదమ్మా ఈ బాబాయ్ ఎప్పుడూ తప్పు చేయడు"

"కానీ బాబాయ్ ఈ ఆపరేషను నీ అంత బాగా ఇంకెవరూ. చెయ్యలేరు కదా.... అటు వంటప్పుడు...."

"నీకు తెలియదు అరుణా. నువ్వింకా చిన్నపిల్లవి"

"మీకూ మీకూ మధ్య ఏవో గొడవలు ఉండొచ్చు... కానీ పాపం పసి పిల్లాడిని బలి చెయ్యడం...."

"కొన్ని పరిస్థితులలో అంతేనమ్మా.... నా నిర్ణయం మారడం అనేది జరగదు. కుర్రాణ్ణి వెంటనే డిశ్చార్జ్ చేసి డాక్టర్ కుమార్ దగ్గరకు తీసికెళ్ళమను"

"మనం కాదన్న తరువాత వాళ్ళిష్టం వచ్చిన చోటుకి వాళ్ళు వెళతారు" అంది అరుణ కొంచెం కోపంగా.

"వాళ్ళు వెళ్ళి తీరుతారు. వాళ్ళకి కొడుకు ప్రాణం ముఖ్యం."

"అంత ప్రాణానికి విలువ ఇచ్చేవాడి వయితే అలా మాట్లాడవు .బాబాయ్. నీకు పగ, ప్రతికారం తీర్చుకుందుకు మంచి సమయం వచ్చింది. తీర్చుకున్నావు. ఇక ఎవరు ఎలా పోతే నీకేం!?" అంటూ నా ఎదురుగా ఉన్న కుర్చీలోంచి లేచి వెళ్ళిపోయింది అరుణ.

నేను అసహనంగా తల పట్టుకు కూచున్నాను, మనస్సంతా చికాకుగా ఉంది. అసలే అమ్మ పోయిన దుఃఖంలో ఉన్న నాకు, విశ్వం వచ్చి గతం గుర్తు చేసి, మరింత బాధ పెట్టాడు. ఇక ఆ రోజుకి ఇంటికి వెళ్ళిపోదామని నిశ్చయించుకున్నాను.

* * *

"ఏమిటి బాబాయ్ ఎలా ఉన్నావు!!?? నీ ఒంట్లో బాగా లేదని పని మనిషి ఫోన్ చేసేసరికి కంగారు పడిపోయాననుకో" అంది అరుణ ఆతృతగా నా బెడ్ రూములోకి అడుగు పెడుతూ...

"పిచ్చి పిల్లా ఎందుకమ్మా అంత కంగారు.. రాత్రి సరిగా నిద్దర లేదు. కొంచెం అలసట అనిపించింది. నేను రాను అని ఫోన్ చెయ్యమన్నానంతే. పని మనిషి నిన్ను అనవసరంగా కంగారు పెట్టేసినట్టుంది" అన్నాను మంచం పక్కనే ఉన్న కుర్చీలో కూర్చుంటూ...

"అందుకే చెప్పాను మా ఇంటికి రమ్మని... అవునులే నేను పిలిస్తే ఎందుకొస్తావు!? అదే నీ సొంత కూతురు పిలిస్తే నువ్వు వెళ్ళేవాడివి కాదా?" అంది అరుణ కోపంగా.

"ఏమిటమ్మా అరుణా ఆ మాటలు!!??... ఛ!ఛ! ఎప్పుడు అలా అనుకోకు తల్లీ. అరుణా నాకు నువ్వు కూతురివి మాత్రమే కాదమ్మా నా తల్లివి కూడా నువ్వే!!?? నాకు రావాలనిపించినప్పుడు పది రోజులు... కాదు పది నెలలుంటాను సరేనా" అన్నాను నేను.

అరుణ మెంలో కోపం తగ్గిపోయింది. ఆమె మొఖం ప్రసన్నమయింది.

"నువెప్పుడూ ఇంతే బాబాయ్ ఏదో చెప్పేస్తావు... ఇంతకీ నిన్న వచ్చిందెవరు బాబాయ్!!? శత్రువు, శత్రువు అంటున్నాడు ఎవరతను? అసలు నీలాంటి మనిషికి కూడా శత్రువులుంటారా బాబాయ్!!?"

"పిచ్చి పిల్లా మనం పురాణాల్లో చదివే ఆ దేవుళ్ళకే శత్రువులున్నారమ్మా. ఇక మనమేపాటి!!?... అతను విశ్వం అని" చెప్పడం ప్రారంభించాను" మా నాన్న గారూ, విశ్వం తండ్రీ చిన్నతనం నుంచీ కూడా మంచి స్నేహితులు. పక్క, పక్క పొలాలలో వ్యవసాయం చేసుకుంటుండేవారట. ఒకసారి పొలాల గట్ల విషయంలో ఏవో మనఃస్పర్థలు వచ్చాయట... మా నాన్నగారిని ఆ పొలాల గొడవలు కారణంగా విశ్వం తండ్రి చంపించాడుట. అయితే అతనికున్న పలుకుబడి వల్ల ఆ విషయం బయటికి పొక్కకుండా చేసాడుట. ఇప్పటికీ మా ఊళ్ళో కొంత మంది ఆ విషయం గురించి అనుకుంటూ ఉంటారు. అందులో నిజానిజాలు నాకు తెలీవనుకో. సరేనేనైతే ఆ విషయం పెద్దగా పట్టించుకోలేదు. అదీకాక నేను డాక్టరుగా ఊరు వదిలి వచ్చేసాను. నేను ఈ ఊరు వచ్చాక ఏదో గొడవలుగా ఉందని మా పాలేరు ఉత్తరం రాస్తే వెళ్ళాను. అప్పుడు... అప్పుడు ఈ విశ్వం తన మనుషుల చేత నన్ను కొట్టించాడమ్మా. ఇంక ఆ బాధలు పడలేక పొలం అమ్మేసాను."

"వ్యాట్!!!??...." నోరు తెరిచింది అరుణ "అంతటి దుర్మార్గుడా!!??"

"అవునమ్మా"

"ఏమయినా బాబాయ్ నువ్వు నిన్న చేసిన పనిని సమర్థించలేను. ఒక నిండు ప్రాణాన్ని బలి తీసుకున్నావేమో అనిపిస్తోంది. పాపం ఆ కుర్రాడెలా ఉన్నాడో ఏమిటో"

"మనం డాక్టరు పట్టా తీసుకునేటప్పుడు చేసిన ప్రమాణాన్ని మర్చిపోయావా అరుణా!? మనం ప్రాణాలను కాపాడుతాం గానీ, ప్రాణాలు తియ్యం."

"కానీ... కానీ.. నిన్న నువ్వు చేసినది అందుకు పూర్తిగా విరుద్ధంగా ఉంది పాపం ఎంత ఆపదలో ఉన్నాడో అని కూడా ఆలోచించకుండా పొమ్మన్నావు."

"అరుణా కడుపు శోకం ఏమిటో నాకూ తెలుసమ్మా"

అన్నీ తెలిసిన నువ్వలా ప్రవర్తిస్తావని ఊహించలేక పోయాను బాబాయ్"

"అరుణా నీకో విషయం తెలుసా!!? కుర్రాడు కుమార్ నర్సింగ్ హోంలో క్షేమంగా ఉన్నాడు."

"నిజంగా!!??? నీకెలా తెలుసు!?" అంది అరుణ ససంభ్రమంగా.

"నేను ఇంటికి వచ్చిన వెంటనే కుమార్‌కి ఫోన్ చేసానమ్మా. ఆ కుర్రాడిని అక్కడికే తీసుకెళ్ళారుట. నేను కుమార్‌కి అన్ని డైరక్షన్సు ఇచ్చాను... అవసరమయితే థియేటర్‌కి వస్తానని చెప్పాను."

"మరి... ఆ ఆపరేషన్ నువ్వే చెయ్యొచ్చుగా!!?"

"నేను శారీరకంగా, మానసికంగా గత పదిహేను రోజులుగా చాలా అలసిపోయాను. నిన్న నా పరిస్థితి బాగా లేదు. ఆ స్థితిలో అంత ముఖ్యమైన, ప్రమాదకరమైన ఆపరేషను నేను చేయకూడదు....





అప్పుడు ఆపరేషన్ చేసి ఆ కుర్రాడికి అతని తండ్రికి అన్యాయం చెయ్యకూడదనిపించింది."

"ఆ సంగతి విశ్వంతో నే చెప్పొచ్చు కదా!!?"

"అప్పుడు నేను ఏం చెప్పినా విశ్వం నమ్మదమ్మా. అతనే కాదు అతని పరిస్థితులలో ఉన్న ఎవరూ కూడా నేను నిజం చెపుతున్నానని అనుకోరు. ఎందుకంటే అతని కొడుకు బతకాలంటే....."

"ఆ మాటకు అడ్డు వస్తున్నాననుకోకు బాబాయ్.... అతనికి నువ్వు శత్రువు అని తెలిసి కూడా నీ దగ్గరికే ఎందుకు తీసుకు వచ్చాడంటావు... ఒకవేళ నువ్వు అతని కొడుకుని సరిగ్గా చూడకుండా ఇన్ డైరెక్టుగా పగ తీర్చుకుంటే"

"ఒక డాక్టరుగా అంత నీచానికి దిగననే నమ్మకం అరుణా. ఇంతకీ నేను థియేటర్‌లోకి వెళ్ళలేదు."

"అవునులే ఆ కుర్రాడు నీ శత్రువు కొడుకు అనే భావన అడ్డు వచ్చి ఉంటుంది"

"నిజంగా ఆ భావనే వచ్చిందమ్మా!!!? అయితే అది నువ్వూహించినట్టుగా కాదు ఆ భావనే... ఆ భావనే అతనినిని బతికించాలనే పట్టుదల నాలో పెంచింది. 'ం' గ్రూప్ బ్లడ్ కోసం ప్రయత్నించానని చెప్పావు గుర్తుందా. నేను ఎంతో ప్రయత్నించాను, ప్చ్! లాభం లేకపోయింది. సరే నాది 'ం' గ్రూప్ కదాని.... నేను ఒక బాటిల్ రక్తం ఇచ్చాను. ఆ నీరసం చేత థియేటర్‌లోకి వెళ్ళలేకపోయాను. కుమార్ నేను కూడా చాలా వీక్‌గా ఉన్నానని రక్తం ఇవ్వవద్దనీ బతిమాలాడు అఫ్‌కోర్స్ నేను వినలేదనుకో. అరుణా ఆ కుర్రాడెలా ఉన్నాడో అని ఆదుర్దాతో రాత్రంతా నిద్దర పట్టలేదు రెండు, మూడు సార్లు ఫోన్ చేసి కనుక్కున్నాను. అందుకే కొంచెం అలసటగా ఉంది"

"బాబాయ్".... నిన్ను ఎంత తప్పుగా అర్థం చేసుకున్నాను బాబాయ్. నన్ను క్షమించు బాబాయ్... నన్ను క్షమించు" అంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకుంది అరుణ.

"ఊరుకోమ్మా క్షమార్పణలు ఏమిటి!!?"

"బాబాయ్ నువ్వు దేముడివి బాబాయ్. నిజంగా నువ్వు దేముడివి."

"నాకింకా కొన్నాళ్ళు బతకాలని ఉందమ్మా... అప్పుడే నన్ను దేముళ్ళతో కలిపేందుకు నేను మనిషినమ్మా. ఒక సామాన్యమైన మనిషిని" అన్నాను నేను నవ్వుతూ.

"లేదు బాబాయ్ నువ్వు సామాన్యుడివి కాదు. మరొకరు అయితే దరిదాపులకు కూడా రానీయని శత్రువు కొడుకుని రక్తం ఇచ్చి బతికించావు. నువ్వు మహోన్నతమైన వ్యక్తిత్వం కలవాడివి. మానవతావాదివి. మహామనిషివి"

"నేను చేసిన దేముందమ్మా!? అది కేవలం నా వృత్తి ధర్మం. ఒక డాక్టరుగా అది నా బాధ్యత" అన్నాను తల వంచుకుని నేలను చూస్తూ. ■




## ధర్మపథం — మంచి చెడ్డలు

భగవంతుని సృష్టిలో ఉన్న వస్తువులకు అంతములేదు. ఆకాశంలో కానవచ్చు నక్షత్రాలను లెక్కించడం సాధ్యం కానట్టు. పదార్థాల పరిగణనకూడా సాధ్యం కాదు. కొన్ని పదార్థాలు చిన్నవి, కొన్ని చాలా పెద్దవి. కొన్ని ఎందుకూ పనికిరానివిగా కానవస్తాయి. కొన్ని ఎంతో మేలు చేసేవిగా కానవస్తాయి. కాని, సృష్టికర్తకు ఇవన్నీ సమానమే! ఆలోచించి చూస్తే ఎక్కువ, తక్కువ భేదం, ఉపయోగ, నిరుపయోగ భేదంమానవకల్పితమే కాని యధార్థం కాదని తెలియకపోదు. చాలా హీనంగా చూడవలసిన మనిషిని గడ్డిపోచతో పోలుస్తారు. అవి నిష్ప్రయోజన మని అన్నమాట! ఆ గడ్డిపోచలనే చేర్చి త్రాడుగా పేనిన యెడల, దానితో ఏనుగును కూడా బంధించవచ్చును. మనం ప్రాణాలు తీసే వనుకున్న పదార్థాలే ప్రాణాలను కాపాడడానికి కూడా ఉపయోగిస్తాయి. పాము విషం శరీరానికి ఎక్కితే మనిషి ప్రాణాలు పోతాయి. జబ్బుపడి ప్రాణాలు పోయే స్థితిలో ఆ గరళాన్నే ఔషధంతో ఉపయోగించి ప్రాణాలు నిలుపుతారు. అపాయకరమైన నాభి మొదలైనవి కూడా ఔషధంగా ఉపయోగపడతాయి. ఆవిధంగానే మనకు మిక్కిలి అవసరమై, మధురంగా ఉన్న పదార్థాలు కూడా – మితికి మించి ఎక్కువ తినడం వల్ల ఆరోగ్యం చెడి రోగగ్రస్తులమై, ప్రాణాలు పోయే పరిస్థితి కూడా సంభవిస్తుంది. ఇలా మంచి వస్తువులయినా హానిని కలుగజేస్తాయి. దీనిని బట్టే

"విషమ ప్యమృతం క్వచిద్ భవేత్
అమృతం వావిష మీశ్వరేచ్ఛయా."

అనే ఆర్యోక్తి ఏర్పడింది. విషం అమృతంగానూ, అమృతం విషంగానూ మారడానికి భగవంతుని ఇచ్ఛయే కారణమనుకున్నా. దానికి మానవ ప్రవృత్తి కూడా ముఖ్యకారణమని గ్రహించాలి. ప్రతి వస్తువు లోనూ మంచి చెడ్డలు ఉంటాయి. వాటిని ఉపయోగించడంలో నే ఉన్నది. ఉచితజ్ఞతను చూపాలి. సక్రమంగా ఉపయోగిస్తే మంచి కలుగుతుంది. సరికాని పద్ధతిలో ఉపయోగిస్తే హాని కలుగుతుంది.

–బులుసు వేంకటరమణయ్య

# కార్టూనిస్టులకు సూచనలు!

- ★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.
- ★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.
- ★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!
- ★ వ్యాఖ్య చిన్నదిగా, క్లుప్తంగా వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీాదే పేరూ, పూరా అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.
- ★ సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.
- ★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.
- ★ పండుగల కార్టూన్‌లు – బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.
- ★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.
- ★ మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

ప్రస్తుత విజయనగరం జిల్లాలో నిరంతరం ప్రవహించుచున్న పవిత్ర సువర్ణముఖీ తీరమున కన్యాశుల్క నాటక రంగస్థలమై విశ్వ విఖ్యాతిగాంచిన కృష్ణారాయపుర శ్రోత్రియ అగ్రహారము వారి స్వస్థలం 1899 ఆషాఢ శుద్ధ పౌర్ణమి వీరి జన్మదినం సుప్రసిద్ధ ప్రబంధము "శివకథా సుధారస" ప్రణీత కీ శే **ఆర్యసోమయాజుల లక్ష్మీ నారాయణశాస్త్రి గారు** జనకుడు తల్లి **సూరమాంబ** ఆంధ్ర ద్రవిడ బ్రాహ్మణ కుటుంబం వీరిది విజయనగర మహారాజ కళాశాలలో FA (ఎఫ్ ఎ)లో ఉత్తీర్ణుడు విద్యాభ్యాసానంతరం ఒరిస్సాలో గల జయపురం సంస్థానాధీశులగు శ్రీశ్రీశ్రీ విక్రమదేవ వర్మ మహారాజా వారి ఆస్థానంలో 1918 నుండి 1952 వరకు పెక్కు బాధ్యతా యుతమైన ఉద్యోగములు నిర్వర్తించి తుదకు అసిస్టెంటు దివానుగా ఆస్థాన వ్యవహారము లను నిస్వార్థంగ, నిజాయితీతో నిర్వర్తించి మహారాజా వారి ఆదరాభిమానము లను చూరగొనిరి 1952లో పదవీ విరమణ చేసిరి వ్యక్తిగ అతి నైష్ఠికుడు సత్య సంధత, పరోప కారం వైదిక కర్మలపై దైవముపై అచంచల విశ్వాసం ధ్యేయాలుగా జీవనయాత్ర సాగించిరి అంతే కాక సుఖ దుఃఖాతీతమైన స్థిత ప్రజ్ఞతను సాదించిన కర్మ యోగి తన సంతతికి ఇతర మానవ మానవాళికి ఈయన ఒక ఆదర్శ జ్యోతిగా మార్గదర్శి అయ్యారు 1987 జ్యేష్ఠ మాసంలో సహస్ర పూర్ణిమల దర్శించి 88వ ఏట స్వర్గస్తులయ్యారు

17-06-1988 అతని తొలి వర్ధంతి సందర్భంగా అతనికి ఆత్మశాంతి సత్‌గతులు భగవంతుడు కలిగించాలని ప్రార్థిస్తూ ఆయనను సంస్మరిస్తూ–

కీ శే ఆర్య సోమయాజుల
అరుణాచలేశ్వరశర్మగారు

భార్య
కొడుకులు, కోడళ్ళు కూతుళ్ళు అల్లుళ్ళు
హితులు దౌహిత్రులు, ప్రపౌత్రులు,
ఇంకా మిగతా సన్నిహిత బంధువుల
అశ్రుతర్పణయే ఈ ప్రకటన

# షేర్ మార్కెట్‌లో పెట్టుబడులు



–యన్. రామ్‌జీ, న్యూఢిల్లీ

ఉన్నట్టుండి మా "ఢుంబు" ప్రత్యక్ష మయ్యాడు. ఈ ఢుంబు ఎవరో కాదు, మా పాలేరు కొడుకు. ఇతగాడు ఇంటర్ ఫెయిల్ అయ్యి, తన తెలివి తేటలకు సరైన వుద్యోగం ఏది లేదని, ఇటు గ్రామ రాజకీయాలలో అటు కుల రాజకీయాలలో మునిగి తేలుతున్నాడు. మా వాడు రామారావు మొదలు రీగన్ రాజకీయాల వరకు, మా మున్సబు నుంచి హైకోర్టు జడ్జి దాకా విమర్శించ గలడు. ఏ జడ్జికి, ఏ లాయర్ అంటే ఫర్ లేక కడుపు మంట, ఎవరికి ఏ కోర్టులో బెయిల్ రావటానికి అవకాశం వుంది అనేవి అనర్గళంగా చెప్పగల మహానుభావుడు. వాడు చెప్పే వాటిలో ఎంతవరకు నిజా నిజా లున్నాయి అనేవి, వినే వారి యొక్క నమ్మకాల మీద ఆధారపడి వుంటుంది.

ఢుంబు ఏమిటి ఇలా ఊడి పడ్డావు అన్నాను.

మా నాన్న ఢిల్లీ పొమ్మన్నాడు.

ఎందుకు?

"మన ఊరిలో వుంటే చెడిపోతున్నానంట, అందుకని మా నాన్న మీ ఇంటికి పోయి బావురు మంటే, మీ వాళ్ళు నన్ను ఢిల్లీ పార్సెల్ చెయ్యమన్నారు" అన్నాడు.

సరే మరి ఇక్కడ బుద్ధిగా వుంటావా? మరి ఏమి చేద్దాం అనుకుంటున్నావు అన్నాను. అదేంటి బాస్ అలా అడుగుతావు, మా నాన్నకి బాస్ మీ నాన్నగారు, మరి నాకు బాస్‌వి నువ్వేకదా (మా వాడికి ప్రేమ ఎక్కువ అయితే నన్ను "నువ్వు" అంటాడు లెండి.)

ఢుంబుని నా అసిస్టెంట్‌గా ఊహించుకొని, నా నవనాడులలో నీరసం ఆవహించింది. కాని హోం డిపార్ట్ మెంట్ నిర్ణయం కాబట్టి చేసేదిలేక హతవిధీ రాబోవు కాలంలో నాకు ఎన్నిపాట్లు వున్నాయో కదా! అనుకొని నిశ్శబ్దంగా వుండి పోయాను కొంచెం సేపు.

"సరే, ఢుంబు నీకు ఈ వ్యాపారం ఇష్టమేనా?" అని ప్రశ్నించాను.

"నీ బిజినెస్ గూర్చి నాకు తెలవదు కాని. నీ పత్రికలో ఆర్టికల్స్ మార్వెలస్" అన్నాడు.

ఎవరన్నారు అలాగా అన్నాను.

"ఎవరేంటి బాస్ గాద్రేజ్ కంపెని వారే అలా అంటున్నారు. నీకు తెలుసో, తెలవదో గాని పత్రికలో నీ ఆర్టికల్స్ ప్రక్కనే మార్వెల్ సబ్బు ఎడ్వర్‌టైజ్ మెంటు వస్తుంది. దానిలో ఒక ఎర్ర చీర కట్టుకున్న అమ్మాయి, ఆ సబ్బుతో స్నానం చేసినందుకు పులకించిందో లేక ఆర్టికల్స్‌లో నువ్వు రాసే హాస్యానికి పులకించిందో చెప్పటం కష్టం కూడా. అది చూసిన కాడ నుంచి నాకు అనిపిస్తుండేది. నీకు లెటర్ వ్రాసి, నీ ఆర్టికల్స్ మార్వెలస్ అని చెబ్దాం అనుకొన్నాను. కాని టైమ్ లేక రాయలేదు" అన్నాడు.

హాశ్శి అనుకొని, "సరే ఢుంబు నువ్వు స్నానం చేసి రెస్ట్ తీసుకో. నేను పత్రిక వారికి ఈ వారం ఆర్టికల్ రాసి పంపాలి" అని వ్రాయటం మొదలు పెట్టాను.

సాధారణంగా ఏ కంపెనీ ఐనా తమ యొక్క కంపెనీలలో ప్రజలకు ఎందుకు వాటాలను పంచాలి? అని ప్రశ్నిస్తే మీకు మన పాత నానుడి జ్ఞాపకం వస్తుంది. ఒక శెట్టిగారు (ఈ శెట్టిగారు అనేది కుల ప్రశక్తి కాదు, వ్యాపారం చేసే వారిని ఎవ్వరినైనా కూడా శేఠ్ అనటం మన భారతదేశ సాంప్రదాయం) నదిలో కొట్టుకు పోతుంటే, ఒడ్డున వున్న ఇద్దరు వ్యక్తులలో ఒకడు, అరె శెట్టిగారు నీళ్ళలో కొట్టుకు పోతున్నాడే అని ఆదుర్దాగా అంటే, రెండవ వ్యక్తి, ఏదో లాభం వుండి వుంటుందిలే. లేకుంటే ఎందుకు కొట్టుకు పోతాడు" అని అన్నాడు. అలాగే ఈ కంపెనీలు కూడా ప్రజల మీద ప్రేమతో వాటాలను పంచవు. వీరు తమ భాగస్వాములుగా సామాన్య ప్రజలను చేరిస్తే, వీరికి అనేకమైన పన్ను రాయితీలు కల్గుతాయి. దీనికోసం భారతదేశ ప్రభుత్వం 1956లో ఒక చట్టం రూపొందించింది. ఈ విధంగా రాయితీలు కంపెనీలకు లాభదాయకం అవుతే, సామాన్య మానవునికి కూడా వ్యాపారంలో ప్రవేశించ గల అవకాశం వుంటుంది. సాధారణంగా డబ్బున్న వారందరూ కూడా మంచి వ్యాపారవేత్తలు కాలేరు. వ్యాపారం చేయాలంటే రోజు ఒక సమస్యని ఎదుర్కొంటు వుండాలి. ఒక ప్రక్క పన్నుల వారు, మరో ప్రక్క బాకీదారులు ఇంకొక ప్రక్క కష్టమర్స్ అన్నిటికంటె వ్యాపారంలో తోటి వ్యాపారుల పోటీ. అంతేకాక కార్మికులతో పని చేయించుకోవటానికి చాలా చాతుర్యం కావాలి. అంతకు మించి లౌక్యం ఉండాలి.

వీటిని అన్నింటిని నెగ్గుకొని వ్యాపారం లాభాలతో నడపడమంటే నిజంగా హెర్క్యులియన్ టాస్క్ లాంటిది. ఇటువంటి ప్రావీణ్యం అందరిలో వుండదు. మరి ప్రభుత్వానికి లాభము ఏమంటే ఆర్థిక అసమానతలు పోగొట్ట గల్గడం మరియు ఏ కొందరి గుప్పిట్లోనే ఈ సంపద వుండ కూడదని. ఎందుకంటే పూర్వం మనకు పాలించటానికి రాజులు వుండేవారు. రాజులు పోయారు, రాజ్యాలు పోయినాయి. తరువాత జమిందారులు వుండే వారు నిన్న మొన్నటి వరకు, జమీలు పోయినాయి. జమీందార్లు పోయారు. మరి ఈ రోజులలో పరిపాలకులు ఎవరంటే ఈ పారిశ్రామిక వేత్తలే. ఈ రోజున ఏ దేశమైన అభివృద్ధి చెందిన దేశంగా మనం గుర్తించాలంటే, ఆ దేశం ఎంత మేరకు పారిశ్రామికంగా అభివృద్ధి చెందింది అనేది ప్రమాణంగా తీసుకుంటున్నాం. ఏ ఒక్క పారిశ్రామిక వేత్త చేతులలో గాని పరిశ్రమలు వుండటం మంచిది కాదు అనే తలంపుతో దూరమైన ఆలోచనతో చేసిన చట్టం ఇది. అంతేకాక ఈ పారిశ్రామికవేత్తలు తమ వాటాలను ప్రజలకు పంచేటప్పుడు, సామాన్య మానవుడు పాలు పంచుకొనే విధంగా వుండాలి అనే సత్సంకల్పంతో వీటిని చిన్న చిన్న డినామినేషన్ లుగా పంచాలని 100 రూపాయిల విలువ చేసేవి 5 వాటాలు చొప్పున, లేక 10 రూపాయిల విలువ చేసేవి 50 చొప్పున వుండాలని నిర్దేశించింది. ఈ మధ్య ఈ 10 రూపాయిల విలువ కలవి 100 చొప్పున వుండేటట్టు మార్చబడినది. మిగతాది వచ్చేవారం తెలుసుకొందామా. □



సీరియల్ ప్రారంభం!

# తమస్





హిందీమూలం: డా|| భీష్మసాహ్నీ

తెనుగుసేత: డా|| యార్లగడ్డ లక్ష్మీప్రసాద్

## గూటిలో దీపం మరొకసారి రెపరెపలాడింది.

పై కప్పుకు దగ్గరగా గోడ మీద రెండు ఇటుకలు రాలిపోయి ఖాళీ ఏర్పడి వుంది.

ఆ ఖాళీ నుండి గాలి వీచినప్పుడల్లా దీపం రెపరెపలాడుతూ, గోడ మీద నీడలు పరుస్తూంది.

కొద్ది సేపట్లోనే మళ్ళీ దీపం వత్తి గూటిపై మసి అంటిస్తూ తిన్నగా వెలుగుతూంది. నత్తూ చాలా గట్టిగా శ్వాస పీలుస్తున్నాడు అతను తన శ్వాసకారణంగానే దీపం రెపరెపలాడుతుందనుకుంటున్నాడు!

నత్తూ గోడ నానుకుని కూర్చున్నాడు. అతని దృష్టి మరల పంది వైపు మళ్ళింది పంది కీచుగా అరుస్తూ గది మధ్యలో వున్న ఏవో పరకల్ని నోటితో పీకసాగింది అసహ్యంగా వున్న ఆ పందితో నత్తూ రెండు గంటల నుండి నానా తిప్పలు పడుతున్నాడు.

అప్పటికే ఆ పంది తన గులాబీ రంగు మూతితో అతని మోకాళ్ళను మూడు సార్లు కుమ్మింది అది నేల మీద చూపులు నిలిపి దేనినో వెదుకుతున్నట్లు గోడ ప్రక్కనే నడుస్తూంది మరలా వెంటనే అరుచుకుంటూ వెనకకు పరుగెత్తుతున్నది కొండెంలాగా వున్న దాని చిన్నతోక వీపు మీద ఊగుతూ కొసేపూ రింగులాగ చుట్టుకుంటూ, విప్పుకుంటూ, కాసేపూ విన్యాసాలు చేయసాగింది దాని ఎడమకంటి నుండి పుసులు మూతి దాకా కారుతున్నాయి అది నడుస్తుంటే బరువుగా వున్న దాని పెద్దపొట్ట అటూ ఇటూ ఊగుతున్నది అది పరుగెత్తుతున్న కారణంగా గదంతా గందరగోళంగా తయారయ్యింది ఆ గదిలో పడి వున్న మలిన పదార్థాలు చెల్లాచెదరయ్యాయి వాటి దుర్గంధం పంది విడుస్తున్న శ్వాస, దీపం పొగలతో గదంతా నిండిపోయింది నేల మీద అక్కడక్కడా నెత్తుటి మరకలు కనపడుతున్నాయి కాని పంది శరీరం మీద మాత్రం ఒక్క గాయం కూడా కాలేదు గత రెండు గంటలుగా నత్తూ నీటిలోనో, ఇసకగుట్టలోనో గుచ్చుతున్నట్లు, కత్తి గుచ్చుతూనే వున్నాడు అతనప్పటికి

ఎన్నో సార్లు ఆ పంది పొట్టలోనూ, తొడల పైన కత్తితో పొడిచాడు. పొడిచిన కత్తి బయటకు లాగినపుడు నేల మీద ఒకటి రెండు నెత్తుటి చుక్కలు పడుతున్నాయి తప్ప, పంది శరీరం మీద మాత్రం చిన్నగాయం కూడా కనపడటం లేదు. పంది మాత్రం అరుచుకుంటూ నత్తూ మోకాళ్ళను తన మూతితో పొడవటమో, గోడ వైపు పరుగెత్తటమో, నడవటమో చేస్తున్నది. కత్తి మొన చర్మపు పొరలను చీల్చుకుని కొవ్వు వరకే దిగుతున్నది గాని, పేగులు దాకా వెళ్ళటం లేదు

చంపటానికి అయినా దౌర్భాగ్యపు పంది దొరికింది. మురికిగా, పెద్ద పొట్టతో, వీపు మీద నల్లని దట్టమైన వెంట్రుకలు, మూతి దగ్గర ముళ్ళ పందిలాగా తెల్లని బిరుసైన వెంట్రుకలతో వుంది.

పందిని చంపటానికి దాని మీద మరిగే నీళ్ళు పోస్తారని అతనెక్కడో విన్నాడు. అయితే నత్తూ దగ్గర మరిగేనీళ్ళు ఎక్కడున్నాయి?

"పందిని చంపాలంటే దాని వెనక కాళ్ళు పట్టుకుని బోర్లా పడవేయి. బోర్లా పడిన పంది త్వరగా లేవలేదు. తర్వాత దాని మెడనరాన్ని కోసెయ్యి. అది చచ్చిపోతుంది" అని ఒకసారి తోళ్ళు శుభ్రం చేసేటప్పుడు పంది కొవ్వును గురించి మాట్లాడుతూ తోటి మాదిగ భీకూ నత్తూతో చెప్పాడు.

నత్తూ పందిని చంపటానికి తనకు తెలిసిన అన్నిరకాల ఉపాయాలు ప్రయోగించి చూశాడు. అయితే ఏ ఒక్కటీ ఫలించలేదు. ఫలించకపోగా అతని మోకాళ్ళకు, మోచేతులకు గాయాలు తగిలాయి. తోళ్ళు శుభ్రం చెయ్యటం తేలికైన పనే కాని పందిని చంపటం అతని వల్ల కావటం లేదు. అతను ఏ బలహీన క్షణంలో ఈ పనిని నెత్తిన వేసుకున్నాడో! ఈ పందిని చంపే పనికి పారితోషికం తీసుకుని వుండకపోతే నత్తూ ఎప్పుడో ఆ పందిని ఎత్తి బయట పారవేసి వుండేవాడు.

"మా పశువుల డాక్టరు గారికి వైద్యానికి సంబంధించిన పని కోసం ఒక చచ్చిన పంది కావాలి."

తోళ్ళు శుభ్రం చేసి కాలవలో చేతులు కడుక్కుంటున్న నత్తూతో నెమ్మదిగా చెప్పాడు మురాద్ అలీ.

"పందా! అయ్యా! అసలు ఏం చెయ్యమంటారు?" నత్తూ ఇబ్బందిగా అడిగాడు.

"అక్కడ పందులు పెంచే ఫారం వుంది. ఆ బయట చాలా తిరుగుతూ వుంటాయి. అందులో ఒక దానిని గుడిసెలోకి తీసుకు వచ్చి నరికి పారెయ్" నత్తూ కళ్ళెత్తి మురాద్అలీ మొహంలోకి చూశాడు.

"నేనెప్పుడూ పందిని చంపలేదు దొరా! పైగా పందిని చంపటం చాలా కష్టమైన పనంటారు. నా వల్ల కాదు దొరా! చచ్చిన పశువుల తోలు వలిచే పనేదైనా వుంటే చెప్పండి. పందుల్ని చంపే పని, ఆ పందుల్ని పెంచే వాళ్ళకు చెప్పండయ్యా" చేతులు వెనక్కు కట్టుకుని నత్తూ అన్నాడు.

"వాళ్ళకే చెప్పేటట్లయితే నీకెందుకు చెపుతాను. ఈ పని నువ్వే చెయ్యాలి" అంటూ మురాద్అలీ పెళపెళలాడుతున్న కొత్త ఐదు రూపాయల కాగితం తీసి, నత్తూ జేబులో కుక్కాడు.

"ఇది నీకు పెద్ద పనేం కాదు. పశువుల డాక్టరుగారు చెప్పిన పని ఎట్లా కాదంటాము? అక్కడ ఫారంలోంచి కంచె దాటి చాలా పందులు బయట తిరుగుతూ వుంటాయి. ఒక దానిని పట్టుకో. కావాలంటే డాక్టరుగారు తర్వాత ఆ ఫారం వాళ్ళతో చెపుతారు" మురాద్అలీ చాలా మామూలుగా చెప్పాడు.

నత్తూ తిరిగి ఏమీ మాట్లాడకుండానే, తన చేతిలోని సన్నటి బెత్తాన్ని మోకాళ్ళపై చిన్నగా కొట్టుకుంటూ మురాద్అలీ చెప్పసాగాడు– "ఈ పని ఈ రాత్రికే పూర్తి చెయ్యి. ఉదయమే పాకీవాడు బండి తీసుకు వస్తాడు. అందులో పడవెయ్యి. మర్చిపోవద్దు. వాడే దానిని పశువుల డాక్టరు గారింటికి చేరుస్తాడు. నేను వాడితో చెపుతాను. అర్థమయ్యిందిగా?"

నత్తూ ఇంకా చేతులు కట్టుకునే వున్నాడు. అయితే జేబులోకి చేరుకున్న ఐదు రూపాయల నోటు అతనిని నోరు తెరవనీయలేదు.

"ఇదంతా మహమ్మదీయులు ఉండే ప్రాంతం. ఏ మహమ్మదీయుడు చూసినా పెద్ద గొడవ అవుతుంది. జాగ్రత్తగా వుండు. నాకూ ఈ పని ఇష్టం లేదు. కాని ఏం చేస్తాం. డాక్టరు గారు చెప్పిన పని కదా? ఎట్లా కాదంటాం?" అంటూ బెత్తంతో మోకాళ్ళ మీద కొట్టుకుంటూ అక్కడినుండి వెళ్ళిపోయాడు.

నత్తూకు మురాద్అలీతో ప్రతి రోజూ పని వున్న కారణంగా అతని మాటకాదనలేకపోయాడు. ఎప్పుడైన పట్నంలో ఆవో, గేదో, గుఱ్ఱమో



చచ్చినప్పుడు, రూపాయో, అర్ధో తీసుకున్నప్పటికీ మురాద్అలీ వాటి తోళ్ళు నత్తూకు ఇప్పిస్తుంటాడు మురాద్అలీ చాలా పలుకుబడి కలవాడు కమిటీ గుమస్తా అయిన కారణంగా పెద్దవాళ్ళకు అందరకూ అతనితో పని వుంటూ వుంటుంది

పట్నంలో మురాద్అలీ కనుపించని వీది వుండదు నల్లగా వుండే మురాద్అలీ సన్నని బెత్తం చేత పట్టుకుని ప్రతి చోటూ తిరుగుతూ వుంటాడు ప్రతి పేటలో, ప్రతి సందులో, ఏ సమయంలోనైనా ప్రత్యక్షమవుతుంటాడు పాముకళ్ళు లాంటి, తీక్షణమైన చిన్న కళ్ళు, ముళ్ళలాంటి మీసాలు, మోకాళ్ళ దాకా వున్న ఖాకీ కోటు, సల్వార్, తల మీద టోపీ చూడగానే ఆకట్టుకునే టట్లుంటాడు ఇవన్నీ కలసిందే మురాద్అలీ స్వరూపం చేతిలో సన్నని బెత్తం లేకపోయినా, తల మీద టోపీ లేకపోయినా అతని రూపం అసంపూర్తిగానే వుండిపోతుంది

మురాద్అలీ ఆజ్ఞ జారీ చేసి వెళ్ళిపోయిన తర్వాత నత్తూ ఈ లోకంలోకి వచ్చాడు పందిని ఎక్కడ నుండి పట్టుకురావాలి? ఎలా చంపాలి? ఊరు చివర వున్న పందుల పారం దగ్గరకు వెళ్ళి వాళ్ళతోనే ఒక పందిని చంపి పశువుల డాక్టరు గారింటికి పంపమని చెపుదామనుకున్నాడు అయితే అతని కాళ్ళు ఆ వైపుకు సాగలేదు

పందిని పట్టి ఇంటిలోనికి తీసుకురావటం ఏమంత తేలికైన పనిగా కనిపించలేదు చెత్తగుట్టల్ని మూతితో కెలికే ఊరపందులు అతనికి గుర్తు వచ్చాయి అతనికేమి తోచలేదు బయట ఒక చెత్తగుట్ట నుండి చెత్త తీసుకుని వచ్చి సగం విరిగిపోయిన ప్రహరీ లోపల వున్న గుడిసె తలుపు దగ్గర వేయసాగాడు చీకటి మెల్ల మెల్లగా పరుచుకుంటున్న సాయం సమయానికి మురికి గుంటల్లో పార్లి, పేడకుప్పల్ని దాటుకుంటూ మూడు పందులు ఆ వైపుకు వచ్చాయి అందులో ఒకటి చెత్త వాసన చూసుకుంటూ ఆ ప్రహరీ లోపలకు వచ్చింది నత్తూ వెంటనే ఆ ప్రహరీ గేటు బయట నుండి మూసి వేసి, ప్రక్కన సగం విరిగిన గోడ దాటి లోపలకు వచ్చి గుడిసె తలుపు తీసాడు వెంటనే తన దగ్గర వున్న కర్రతో అదిలిస్తూ పందిని గుడిసె లోపలకు తోలుకు వెళ్ళాడు పంది అరిస్తే, దాని అరుపులు విని పందుల కాపరి వస్తాడనే భయంతో నత్తూ బయట వున్న చెత్తంతా గుడిసె లోపలకు తీసుకు వచ్చి వేయసాగాడు లోపల చెత్తగుట్ట పెరగగానే పంది అన్ని మర్చిపోయి ఆ చెత్త కెలక సాగింది నత్తూ హాయిగా గాలి పీల్చుకుని తలుపు వేసి బయట కూర్చుని బీడీలు కాలుస్తూ చీకటి ఎప్పుడు పడుతూందా అని ఎదురు చూడసాగాడు చాలా సేపటికి చీకటి దట్టంగా ముసిరిన తర్వాత నత్తూ లేచి నెమ్మదిగా గుడిసె లోపలికి వెళ్ళాడు దీపపు మసక చీకటిలో చెల్లాచెదరైన చెత్త దుర్వాసన వెదజల్లుతూ అతనికి కనిపించింది ఆ చెత్తలో పొర్లుతున్న ఆ పెద్ద మురికి పందిని చూసి ఇంత అసహ్యమైన, నీచమైన పని ఎందుకు నెత్తిన వేసుకున్నానా అనిపించింది ఒక్క క్షణం తలుపు తీసి ఆ పందిని బయట పడేద్దామా అన్న ఆలోచన కలిగింది

అప్పటికే సగం రాత్రి కావస్తుంది పంది ఆ చెత్తలో హాయిగా దొర్లుతున్నది నేల మీద నెత్తుటి మరకలు పంది పొట్ట మీద చిన్న కత్తిగీతలు కనపడుతున్నాయి నత్తూ మోకాళ్ళ మీద, పంది మూతితో కుమ్మగా ఏర్పడిన గాయాలు వున్నాయి నత్తూ బరువుగా శ్వాస పీలుస్తున్నాడు శరీరమంతా చెమటతో తడిసిపోయింది పంది మాత్రం ఎప్పటి లాగానే వున్నది నత్తూకు ఈ ఝుంఝూటం నుంచి బయట పడే మార్గం మాత్రం కనపడటం లేదు

దూరంగా షేక్‌ల తోటలోని గడియారం రెండు కొట్టింది నత్తూ గాభరాగా లేచాడు అతను మరొకసారి ఆ పంది వైపు చూసాడు పంది ఆ చెత్త మధ్య నిలబడి ఉచ్చపోసింది గది మధ్య నుండి కదిలి గోడ ప్రక్కన నడవసాంది దీపంవత్తి గాలికి మరొకసారి రెపరెపలాడింది ఏదో పీడ కలలాగ నీడలు గోడ మీద పడసాగాయి గుడిసెలోని పరిస్థితిలో మాత్రం ఏమాత్రం తేడా లేదు పంది కొంచెం సేపు మూతితో చెత్తను కెలకసాగింది కొంచెం సేపు గోడ వెంట నడుస్తున్నది కొంచెం సేపు కీచుగా అరుస్తూ అటూ ఇటూ పరుగెత్తుతూంది దాని సన్నని తోక, పలుచని పురుగు లాగా చుట్టలు చుట్టుకుంటూ, వదులుకుంటూ వుంది

ఇట్లా లాభం లేదు ఇది నా వల్ల అయ్యే పనికాదు ఇదే నా ప్రాణం తీస్తుంది నత్తూ పళ్ళు నూరుతూ అనుకున్నాడు

పంది వెనక కాళ్ళను పట్టుకుని వెల్లకిలా పడవేసే ప్రయత్నం మరొక సారి చేద్దామనుకున్నాడు కుడి చేతిలో కత్తిని ఎత్తి పట్టుకుని, మెల్లగా అడుగులు వేస్తూ గుడిసె మధ్యకు నడవసాగాడు పంది ఎడమ వేపు మూలకు వచ్చి అక్కడి నుండి కుడి వైపు గోడ వెంబడి నడవసాగింది నత్తూ తన వైపుకు రావటం చూసి పారిపోవాల్సింది పోయి, అది తిరిగి, అతనికి ఎదురుగా రాసాగింది పంది నత్తూ మీద దూకుతుందా అన్నట్లు అరిచింది నత్తూ ఒక్కొక్క అడుగు వెనకకు వేయసాగాడు అతని చూపులు మాత్రం పంది మూతి మీద నిలిచి వున్నాయి పంది ఇప్పుడు అతనికి తిన్నగా వుంది అతని వైపే అడుగులు వేస్తున్నది ఈ పరిస్థితులలో దాని వెనుక కాళ్ళు పట్టుకుని, వెల్లకిలా పడవేయటం నత్తూకు అసంభవంగా తోచింది దాని చిన్న కళ్ళలో ఏదో మత్తు వ్యాపించినట్లుంది ఏమి చేస్తుందో ఏమిటో? నత్తూ చాలా అసహనంగా వున్నాడు నిన్న సాయంత్రం నుండి చేయలేని పని, ఇప్పుడు ఆవేశపడితే మాత్రం ఏం జరుగుతుంది? ఏక్షణాన అయినా పాకీవాని బండి రావచ్చు మురాద్అలీ ఏమనుకుంటాడు స్నేహం మాట అటుంచి శత్రుత్వం పెరిగే ప్రమాదముంది తోళ్ళు ఇప్పించకపోవచ్చు ఈ గుడిసె నుండి గెంటి వేయవచ్చు ఎవరితోనయినా కొట్టించవచ్చు ఇబ్బంది పెట్టవచ్చు నత్తూకు కాళ్ళు చేతులు ఆడటం లేదు పంది వెనుక కాళ్ళు పట్టుకుంటే అది లొంగి పోతుందో, ఎగురుతుందో, విడిపించుకుని పోతుందో అతనికి అర్థం కావటం లేదు

ఉన్నట్టుండి నత్తూకు ఒక్కసారిగా పూనకం వచ్చినట్టయింది అతనికి ఒళ్ళు మండిపోసాగింది దీని సంగతోనా సంగతో తేలిపోవాలి' అంటూ గుడిసెలో ఒక మూల ఉన్న సన్ని కల్లును ఎత్తి పట్టుకుని గది మధ్యకు నడిచాడు ఆ సన్నికల్లును రెండు చేతులతో తల మీదగా ఎత్తి పట్టుకుని కళ్ళెత్తి ఆ పంది వంక చూశాడు అది చెత్తలో మూతి బెట్టి అందులోని కరబూజా ముక్కలను వాసన చూస్తుంది దాని కళ్ళు ఎర్రగా ఉన్నాయి తోక అటు ఇటు ఊగుతున్నది 'ఈ సన్నికల్లు దాని మీద పడేస్తే అది చావకపోయినా కనీసం తీవ్రంగా గాయపడి కదలలేదు గదా!' అన్న ఆలోచన నత్తూకు వచ్చింది

నత్తూ తన బలవంతా ఉపయోగించి ఆ సన్నికల్లను పంది మీద పడవేసాడు గూటిలోన దీపం రెపరెపలాడుతూ గోడల మీద నీడలు పరచింది సన్నికల్లు పందికి తగిలింది కాని, ఖచ్చితంగా ఎక్కడ తగిలిందో నత్తూకు

# బైద్యనాథ్ ..............

## ఇద్దరికీ ఆరోగ్యము మరియు పెరుగుదల కొరకై

జీవితమంతా

మీరు భాగస్వాములు కనుక

మీరు శ్రద్ధవహిస్తారు కనుక

మీరు ఒకరికి మరియొకరు
ఆనందముగా ఉండుటకు
శ్రద్ధ తీసుకుంటారు.



మీకు శక్తిని, బలమును కలుగచేసి
రోజు రోజుకు సంవత్సరముల తరబడి
విటా-ఎక్స్ మిమ్ములను కాపాడును.

స్త్రీ పురుషులకు బలవర్ధకమైన ఔషధము.

## బైద్యనాథ్ విటా-ఎక్స్

## మొటిమలా?

మొటిమలు, మచ్చలు, ఉడుకు పొక్కులు మరియు
చర్మరోగములకు ఆదర్శమైన నివారిణి
మంచి రక్తశుద్ధికరము, చర్మమును పరిశుద్ధముగా
ఉంచును,






## బైద్యనాథ్ సురక్తాస్ట్రాంగ్

రక్తమును శుద్ధి చేయును చర్మమును నిర్మలముగా ఉంచును.




మామూలు పండ్లపొడేకాదు ఔషధముకూడా దంతక్షయము మరియు చిగుళ్ళ
వ్యాధులకు అత్యవసరమైన నివారిణి ఆరోగ్యకరమైన దంతములు బలమైన
చిగుళ్ళు ఆరోగ్యముగా చింతలు లేకుండా ఉంచును.

బైద్యనాథ్ ఎర్ర పండ్లపొడి మాత్రమే ఈ పనిచేయును

## బైద్యనాథ్ ఆయుర్వేద పండ్లపొడి

B3P 97T

# నేను సింథాల్ వాడతాను. మరి మీరో?

Godrej

NEW CINTHOL

DEODORANT AND COMPLEXION SOAP

CINTHOL

సింథాల్ యొక్క అద్వితీయమైన టి సి సి గల దుర్గంధనాశక
ఫార్ములా, శరీరం నుంచి దుర్గంధం రాకుండా
నివారించి మీకు శరీరం
విషయంలో
ఆత్మవిశ్వాసాన్నిస్తుంది.

**శరీరం గురించిన ఆత్మవిశ్వాసం వినోద్ కైవసం-సింథాల్‌తో!**

తెలియలేదు పంది బిగ్గరగా, బాధగా అరిచింది నత్తూ, ఒక అడుగు వెనకకు వేసి ఆ పందిని పట్టి పట్టి చూడసాగాడు సగం మూసిన కళ్ళతో పంది తన వైపే చూస్తున్నట్లు తోచిన నత్తూకు చాలా ఆశ్చర్యం కలిగింది

ఉన్నట్టుండి పంది ఒక్కసారి అరుస్తూ గోడ దగ్గరి నుండి గుడిసె మధ్యకు రాసాగింది అది అటుఇటు ఊగసాగింది' నత్తూ తలుపు దగ్గరకు వెళ్ళి ఒక ప్రక్కకు ఆనుకొని నిలబడ్డాడు అస్పష్టంగా ఉన్న దీపపు వెలుగులో ఆ పంది నల్లనిపొద కదలివస్తుందా అన్నట్టు నత్తూకు అనిపించింది నత్తూ వేసిన ఆ సన్నికల్లు దాని నుదుటిమీద పడిన కారణంగా దానికి తల తిరిగి నట్లయింది చూపుకూడా సరిగ్గా కన్పిస్తున్నట్టు లేదు నత్తూ, భయపడ్డాడు పంది తనవైపే వస్తున్నట్టు, తనపై దూకబోతున్నట్టు అతనికి అన్పించింది తను కొట్టిన దెబ్బ దానికి తగల లేదేమో అన్పించసాగింది

నత్తూ వెంటనే తలుపు తెరచి బయటకు వెళ్ళిపోయాడు ఆవరణలోకి వస్తూ 'వెధవ గొడవలో ఇరుక్కున్నాను' అని అనుకోసాగాడు స్వచ్ఛమైన బయటగాలి అతనికి ఎంతో హాయిగా తోచింది గుడిసెలో పలి దుర్వాసనతో అతను ఇప్పటిదాకా ఇబ్బంది పడ్డాడు చెమటతో తడిసిన అతని శరీరం చల్లని గాలికి పులకించి పోయింది అతనికి పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్లయింది

"ఈ పందిని చంపటం వల్ల నాకేం వస్తుంది పశువుల డాక్టరు గారికి పంది దొరక్కపోతే నాకేం పోయింది రేపు మురాద్ అలీకి ఐదు రూపాయిలు ఇచ్చేసి నా వల్ల ఈ పనిగాదు స్వామీ! అని దణ్ణం పెట్టేస్తా ఐతే రెండు రోజులు అలుగుతాడు ఏదో విధంగా బ్రతిమాలుకోవచ్చు అతను ప్రహరీ ఆనుకొని నిలబడ్డాడు నాలుగు వైపులా పరచుకొన్న తెల్లని వెన్నెల్లో ఆ ప్రాంత మంతా అతనికి కొత్తగాను, వింతగానూ తోచింది ఎదురుగుండా ఉన్న బళ్ళ దారి ఖాళీగా ఉంది ఆ ప్రాంత మంతా నిశ్శబ్దం పరుచుకొని ఉంది పగలంతా ఎడ్ల బండ్ల మోతతో ఎద్దుల గంటల చిరుసవ్వడితో ఆ ప్రాంత మంతా కోలాహలంగా ఉంటుంది బండ్ల చక్రాల క్రింద నలిగి అక్కడ మట్టి, కాలు పెట్టగానే దిగి పోయేటంత మెత్తగా తయారయింది బాట పక్కగా ఉన్న రేగుచెట్లు దుమ్ముతో కప్పబడి వెన్నెల్లో తెల్లగా కనబడు తున్నాయి దారి పక్కన మైదానం దాటిన తరువాత స్మశానం ఉన్నది అక్కడ ఉన్న గుడిసెలో కాటి కాపరి ఉంటాడు అతని గుడిసెలో దీపం కూడా వెలగటం లేదు మామూలుగా రాత్రి పూట ఆ కాటికాపరి తాగి అరుస్తుంటాడు అయితే ఇప్పుడు కాటికాపరి చచ్చినవాడిలా పడి వున్నాడు నత్తూకు మాదిగగూడెంలో హాయిగా నిద్రించే అతని భార్య గుర్తు కొచ్చింది ఈ వెధవ గోల లేకుండా వుంటే నత్తూ ఈపాటికి ఆమె పక్కలో ఉండి ఉండేవాడు అలసిన ఆమె శరీరం నత్తూ కౌగిలిలో ఉండి ఉండేది వయసులో ఉన్న భార్య కౌగిలికోసం అతని శరీరం తొందర పెట్టసాగింది పాపం! ఎంతసేపు అతని కోసం ఎదురు చూసిందో! ఆమెకు చెప్పకుండా వచ్చేశాడు ఒక్క రాత్రి ఆమెకు దూరంగా ఉన్నందుకు నత్తూ చాలా బాధపడ సాగాడు

ఆ బళ్ళదారి కొంచెం దూరం తర్వాత ఎడం వైపుకు తిరిగిన తరువాత పల్లంగా ఉంటుంది వెన్నెల్లో ఆ దారి ఎంతో శుభ్రంగా కన్పించింది ఆ దారి పక్కనే బావి ఉన్నది కొంచెం దూరం తరువాత ఈ దారి పట్టణానికి వెళ్ళే రోడ్డును కలుస్తుంది అక్కడ నాలుగు వైపులా నిశ్శబ్దం తాండవిస్తోంది ఎడం వైపు కొంచెం దూరంగా పందుల పెంపక కేంద్రం వుంది చాలా దూరం వ్యాపించి ఉన్న ఖాళీ ప్రదేశంలో రకరకాల ముళ్ళ పొదలు, పిచ్చి చెట్లు ఉన్నాయి అక్కడకు చాలా దూరంగా మిలటరీ కంటోన్మెంటు భవనాలు ఉన్నాయి అక్కడకు వెళ్ళాలంటే చాలా సేపు పడుతుంది

నత్తూ శరీరం 'అలసి పోయింది నిస్సత్తువ ఆవహించింది అక్కడే నిదరపోదా మనిపించింది శుభ్రంగా వీస్తున్న చల్లని గాలిలో, ఆ వెన్నెల్లో అతని పరిస్థితికి అతనికే దుఃఖం వస్తున్నది బయటకు వచ్చిన తరువాత చేతిలోని కత్తి అసహనంగా తోచింది కనీసం మరలా గుడిసె లోపలకు తొంగి చూడకుండా పారిపోదామా! అనిపించింది తెల్లవారిన తర్వాత పందుల కాపరి అటునుంచి వెళుతూ చెత్త చెదారం చూసి పంది అక్కడే ఉందని తెలుసుకొని దాన్ని తోలుకు పోతాడు

అతనికి మళ్ళీ భార్య గుర్తుకు వస్తున్నది ఆమె దగ్గరకు చేరుకుంటే గాని అతనికి మనశ్శాంతి కలిగేటట్టు లేదు ఈ పీడ ఎప్పుడు వదుల్తుంది? ఎప్పుడు గూడెంకు తిరిగి వెళతాడు?

దూరంగా ఉన్న షేక్‌ల తోటలో గడియారం మూడు గంటలు కొట్టింది నత్తూ శరీరం చెమటతో తడిసిపోసాగింది నత్తూ దృష్టి తన చేతిలోని కత్తి వైపుకు మళ్ళింది అతని గుండెల్లో సన్నని మంట లేచింది ఇప్పుడేం జరుగుతుంది? ఇక్కడ ఉండి ఏం చెయ్యాలి? పంది ఇంకా చావలేదు పాకీవాడు బండి తీసుకుని బయల్దేరాడేమో? అతనికి ఏమి చెప్పాలి? తెల్లవారి పోతున్నది ఇంకాపని పూర్తి కాలేదు నత్తూకు తన పరిస్థితిపై తనకే జాలివేసింది

గాబరాగా గుడిసె వైపు నడిచాడు నెమ్మదిగా లోపలికి తొంగి చూసాడు ఒక్కసారిగా దుర్గంధం అతని ముక్కును తాగింది నిశ్చలంగా, అటు ఇటు తిరిగి అలసి పోయిందా అన్నట్లు పంది గుడిసె మధ్యలో నిలబడివుంది ఇప్పుడు దానిని చంపటం అంత కష్టమైన పనికాదని నత్తూకు అనిపించింది నత్తూ గుడిసె తలుపు మూసి నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ గూటి దగ్గరకు వెళ్ళి కళ్ళార్పకుండా పందిని చూడసాగాడు

నత్తూను చూడగానే పంది తలెత్తింది దాని తల ఎర్రగా, కళ్ళు మూసుకుపోయి ఉన్నట్టు నత్తూకు కన్పించింది దానిమీద పడవేసిన సన్నికల్లు దాని వెనుక కొంచెం దూరంలో పడిఉంది మిణుకు మిణుకుమంటున్న దీపం వెలుగులో పంది కదులుతున్నట్లు అనిపించింది అది నిజంగానే బరువుగా అడుగులు వేసుకుంటూ నత్తూవైపు రాసాగింది ఒకటిరెండు అడుగులువేసి అటు ఇటు ఊగిన తర్వాత అది విచిత్రంగా అరచింది నత్తూ కత్తి మరలా పైకెత్తి నేలమీద మోకాళ్ళపై కూర్చున్నాడు పంది ఇంకో రెండడుగులు ముందుకువేసింది నత్తూ దగ్గరకు వస్తూ వస్తూ పక్కకు పడిపోయింది అది విచిత్రంగా కాళ్ళను పైకిలేపి ఒక్కసారిగా కుప్ప

## విజ్ఞానం-వినోదం

బాచ్ బ్రౌన్

**సమస్య**

సాంద్రత

**అవసరం**

ఒక గాజు పాత్రలో వేడి నీరు, ఒక చెంచా నిండా మిఠాయి రంగు లేదా సిరా కలిపిన చల్లని నీరు

**ఈ విధంగా చేయండి.**

వేడి నీటిలో చల్లని నీరు జాగ్రత్తగా పోయాలి చల్లని నీరు మనకి స్పష్టంగా కనిపిస్తూ పాత్ర అడుగు భాగానికి దిగడం చూడవచ్చు




**ఇలా ఎందుకని?**

వేడి నీరు వ్యాకోచం చెంది చల్లని నీటికన్నా తక్కువ సాంద్రత కలిగి ఉంటుంది కాబట్టి ఎక్కువ సాంద్రత కలిగిన చల్లని నీరు కిందికి దిగి పోతుంది

మరో విధానం పావు కప్పు వేడి నీటిని అర కప్పు చల్లని నీటిలో జాగ్రత్తగా పోస్తే కొంత సేపటి వరకు వేడి నీరు తేలుతుంది వేడి నీటిలో గానీ చల్లని నీటిలో గానీ రంగు కలిపితే గుర్తించడానికి అనువుగా ఉంటుంది

కూలిపోయింది.

నత్తూ కత్తిని నేలపై విడిచాడు. అతని చూపులు మాత్రం పంది మీదనే నిలిచి ఉన్నాయి. దూరంగా కోడికూత విన్పించింది. అదే సమయంలో బండివస్తున్న మోత కూడా విన్పించింది. నత్తూ విశ్రాంతిగా గాలి పీల్చుకున్నాడు.

★ ★ ★ ★ ★ ★ ★

మామూలుగా 'ప్రభాత ప్రదర్శన' అంటే ఇద్దరు ముగ్గురు ముఖ్యులు మాత్రమే వస్తుంటారు. తరువాత ప్రదర్శనసాగినవైపు ఎవరి యింటిముందు కొచ్చేసరికి వాళ్ళు, ఆవలిస్తూ, పొట్టలు సవరించుకొంటూ అందులో పాల్గొంటూ ఉంటారు.

ఇంకా చలిగాలి వీస్తూనే వుంది. రాత్రిపూట గదుల్లో పడుకొన్నా తెల్లవారేసరికి దుప్పట్లు కప్పుకోవలసివస్తున్నది. ప్రభాత ప్రదర్శనలో పాల్గొనే వయసు మళ్ళినవారు 'చెవి టోపీలు' ధరించి వస్తుంటారు.

షేక్‌ల తోటలోని గడియారం నాలుగు గంటలు కొట్టింది. కాంగ్రెస్ కమిటీ కార్యాలయం ముందు రోడ్డుమీద ఇద్దరు ముగ్గురు నిలబడి, మిగిలిన సభ్యులకోసం ఎదురు చూస్తున్నారు. ఇద్దరు రహస్య పోలీసులు సాదాబట్టలు ధరించి కొంచెం దూరంలో నిలబడున్నారు.

దూరంగా చీకటిలో నుంచి కొద్దిగా వెల్తురు కన్పించసాగింది. ఎవరో ఒక వ్యక్తి చేతిలో హరికేన్ లాంతరు పట్టుకొని పెద్ద వీధి మలుపు తిరిగి ఆ వైపుకు రాసాడు. ఆ లాంతరు వెలుగులో ఆ మనిషి కట్టుకున్న పైజామా మాత్రమే కన్పిస్తూంది. తలలేకుండా రెండు కాళ్ళు మాత్రమే నడిచి వస్తున్నట్టుంది.

పైజామాను గుర్తించి "అదిగో! బక్షీగారు వచ్చేస్తున్నారు" అన్నాడు అజీజ్.

'నాలుగ్గంటలంటే ఖచ్చితంగా నాలుగు గంటలకే రావాలి. ఒక్క నిముషం కూడా అటూ ఇటూ రాకూడదు' అంటూంటారు బక్షీగారు. కాని ఈ రోజు ఆయనే ఆలస్యంగా వస్తున్నారు.

బక్షీగారే! ముసలితనంలో శరీరం క్రుంగిపోయినప్పటికీ జిల్లా కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిగా ఉంటున్నారు. ఆయనే రాకుంటే ప్రభాత ప్రదర్శనకు ఇంకెవరొస్తారు?

అజీజ్ ఆయనకు దగ్గరగా వెళ్ళి.

బక్షీగారు దగ్గరకొచ్చి, "రాత్రి ఆలస్యంగా నిద్రపోయాను అందుచేత ఉదయం మెలకువ రాలేదు" అంటూ సంజాయిషీ ఇచ్చి "రామదాసు మాష్టారు రాలేదా?" అని అడిగారు బక్షీ.

"అవుపాలు తీయకుండా ఆయనెట్లా వస్తాడు?" అన్నాడు అజీజ్.

"జీతం పెంచమనడానికైతే రాత్రి పదకొండు గంటలకు పిల్చినా వచ్చేస్తాడు. జీతం పెరిగిపోయిందికదా, ఇక సమయానికి రావలసిన అవసరమేముంది.'

'కొత్త వీధివైపు నుండి తలనుండి కాళ్ళవరకు తెల్లని బట్టలు ధరించిన ఒక పొడవాటి వ్యక్తి ఎదురుగుండా వస్తూ కన్పించాడు.

"హమ్మయ్య! మెహతాజీ వచ్చేశారు. మెహతాజీ! మీరు అచ్చం నాయకుడిలా ఉన్నారు."

మెహతాజీ ఒక్కసారి అందరికిని చూసి అజిత్‌సింగ్, దేశరాజ్, రామదాసు మాష్టారులను గురించి వాకబు చేసారు. బక్షీగారివైపు అసహనంగా చూస్తూ "ప్రభాత ప్రదర్శనకు నాలుగు గంటలు సరైన సమయం కాదని నేను ముందే చెప్పానుకదా!" అన్నారు.

"నాలుగు గంటలని చెబితే కనీసం ఐదు గంటలకైనా ప్రభాత ప్రదర్శన మొదలవుతుంది. ఐదు గంటలని చెబితే పొద్దెక్కినాగాని జనంరారు. మీరే ఆలస్యంగా వచ్చి ఆ సమయం సరైనదికాదు, ఈ సమయం సరైనది కాదు అంటున్నారు" అంటూ బక్షీగారు జేబులోని సిగరెట్ డబ్బాను బయటకి తీసారు.

"మెహతాజీ! దూరం నుండి చూస్తే మీరు అచ్చం నాయకుడి లాగానే ఉన్నారు" అజీజ్ మెహతాజీని మళ్ళీ ఆటపట్టించాడు.

(ఇంకా ఉంది)

# వసపిట్ట

పక్కలంక రామారావు

కోనసీమ కొబ్బరి, కానపల్లిలంక వంకాయలు, గూడపల్లి తేగలు, తాటిపాక తాటి ముంజెలు, మోరి జీడిపప్పు, అయినవిల్లిలంక మొక్కజొన్న పొత్తులు అంటే ప్రకాశానికి చాలా చాలా ఇష్టం!

అలా అని మదరాసు సాంబారు, కలకత్తా రసగుల్లాలు, తాపేశ్వరం కాజాలు, పుల్లారెడ్డి స్వీట్లు ఇష్టం లేవనికాదు అయినా అతడు పుట్టిందీ పెరిగిందీ కోనసీమ కావటంతో జగ్గంతోట ప్రభల తీర్థం, అంబాజీపేట సంత, అమలాపురం గణపతి పందిళ్ళు, గోదావరి వరదలు వంటివి కలిగించినంత థ్రిల్లూ, ఆనందం మరేవీ అతడికి కలిగించవంటే అతిశయోక్తి కాదు

అందుకే ప్రకాశం వయసొచ్చి, పెద్దవాడై, పెళ్ళీడు కొచ్చినా కోనసీమపట్ల ఈ అభిమానాన్ని మరింత పెంచుకున్నాడే గాని తెంచుకోలేక పోయాడు

ప్రకాశం అమలాపురం కాలేజీలో డిగ్రీపూర్తి చేసి, రాజమండ్రీలో ఒక బ్యాంకులో మంచి ఉద్యోగమే సంపాదించుకున్నాడు అమలాపురంలో ఆ బ్యాంకుకు బ్రాంచి లేక పోబట్టి కాని, వుంటే వెంటనే ఎగిరి అమలాపురం బ్రాంచిలో వాలిపోయేవాడే! అయినా రేపో, మాపో అమలాపురంలోనూ ఆ బ్యాంకు బ్రాంచి పెడతారట ఆ శుభసమయం కోసమే వెయ్యి కళ్ళతో ఎదురు చూస్తున్నాడు ప్రకాశం!

ప్రకాశానికి ఉద్యోగం వచ్చి స్థిరపడగానే పెళ్ళో, పెళ్ళో అని పోరు మొదలు పెట్టారు వాళ్ళ, అమ్మా, నాన్నా మరియు బామ్మా! వాళ్ళ మాటను కాదన లేక 'అలాగే పిల్లని చూడ్డానికి నేను రెడీయే' అంటూ గ్రీన్ సిగ్నల్ ఇచ్చాడు ప్రకాశం

పిల్ల మాత్రం పదహారణాల కోనసీమ పిల్ల అయివుండాలి లేనిపోని బేషజాలు, టక్కుటిక్కులు నాకు పనికిరావు బాబ్డ్ హెయిర్ అమ్మాయిలన్నా, రాత్రి మేక్సి వేసుకుని నిద్రపోయే బుట్ట బొమ్మలన్నా, మగరాయుడిలా మోపెడ్ డ్రయివ్ చేసే మగువలన్నా, అస్తమానూ వసపిట్టలా వాగే వాగుడు కాయలన్నా నాకు ఎంతమాత్రం సరిపడదు పెద్దంత చదువులేక పోయినా పరవాలేదు సంసార పక్షంగా వుండి సగటు అందగత్తె అయితేచాలు - ఇవి ప్రకాశం తన కాబోయే అర్ధాంగిలో కోరుకునే లక్షణాలు

ప్రకాశం కోరిక విని 'మా మనవడివి అన్నీ అచ్చంగా వాళ్ళ తాత బుద్ధులే! వాళ్ళ తాతయ్యా ఇలాగే కోనసీమ పిల్లను గాని కట్టుకోనని నా మెడలో మూడు ముళ్ళూ వేశారు' అంటూ గతాన్ని తలచుకొని మురిసి పోయింది కోనసీమ ఆడపడుచు అయిన వాళ్ళ బామ్మ

అయన పుట్టిందీ పెరిగిందీ కోనసీమ నడిబొడ్డు - అమలాపురం మా పుట్టింటి వారిదా పక్కనే వున్న 'పేరూరు' ఇక మా ఇద్దరి సంతానం మా బుజ్జి గాడు కోనసీమ పిల్లని తప్ప మరో పిల్లని చేసుకోననటంలో ఆశ్చర్యపడాల్సింది అవగింజంతలేదు వాడి ఇష్టం ప్రకారమే కానివ్వండి అంది ప్రకాశం తల్లి సుభద్రమ్మ

'సరే వాడెలాగంటే అలాగే' అని పుత్తేటి కుర్రు సంబంధం చూసి రావటానికి అన్ని ఏర్పాట్లూ చేసి, ఫలానా తేదీకి సెలవు పెట్టి అమలాపురం రమ్మని ప్రకాశానికి ఉత్తరం రాశాడు వాళ్ళ నాన్న, రిటైర్డ్ తహసీల్దార్ జానకి రామయ్య

పెళ్ళిచూపులు పూర్తయ్యాయి పెళ్ళికూతురు 'గీత' ప్రకాశానికి అన్నివిధాలా నచ్చింది అప్పటి కప్పుడే కట్నకానుకలు కూడా మాట్లాడుకుని, నెల రోజుల్లో పెళ్ళికి ముహూర్తం పెట్టుకున్నారు

ప్రకాశం ఆరోజే అమలాపురం నుంచి తిరిగి రాజమండ్రీ బయలుదేరాడు బస్సుస్టేషన్ దగ్గర రిక్షా దిగే సరికి రాజమండ్రీ బస్సు రెడీగా వుంది హడావిడిగా బుక్‌స్టాల్లో ఒక వారపత్రిక కొని బస్సెక్కాడు

బస్సు బయలుదేరింది పత్రిక తెరచి ఏదో ఒక కథ చదవ బోయాడు కథకు సంబంధించిన ప్రతి ఆడబొమ్మలోనూ నేనే ఉన్నానంటూ 'గీత' కనిపించింది

'గీత'- ఎంత చక్కని పేరు ఆ అమ్మాయిలాగే పేరు కూడా సింపుల్‌గా, చక్కగా, జిలేబీలా వుంది సన్నగా, నాజూగ్గా, ఎర్రగా, ఎంచక్కా, ఎప్పుడూ చిరునవ్వు నవ్వుతూ వుండే గీతని తలచుకోగానే ప్రకాశం హృదయం ఒక్కసారి ఆనందంతో పులకరించింది.

'గీతా మై స్వీట్ డాళింగ్' అనుకుంటూ వారపత్రిక అట్ట మీది బొమ్మని అచేతనంగా, తన్మయత్వంతో తనివి తీరేలా ముద్దు పెట్టుకున్నాడు ప్రకాశం

'ఏంటి బాబూ ఈ అబ్బాయి! ఆడబొమ్మ కనబడితే చాలు ఆదో మాదిరిగా అయిపోతున్నాడు ఇక నిజంగానే ఆడగాలి తగిలిందంటే ఈడి ఏసాలకి పట్టపగ్గాలుండవ్' అనుకుంటూ పమిట కొంగు దగ్గరగా తీసుకుని, మరి కాస్త సర్దుకు కూచుంది పక్కసీట్లోని పంకజాక్షి ఇవేమి పట్టించుకోకుండా తన కలల ప్రపంచంలో తానుండి పోయాడు ప్రకాశం

అంబాజీపేట వచ్చింది పనస తొనలూ, చక్రకేళీ అరటిపళ్ళూ అమ్మే వాళ్ళు అరుస్తూ బస్సుచుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నారు ప్రకాశం ఈలోకంలోకి వచ్చాడు

'వీళ్ళ పిచ్చిగాని బస్సు బయలుదేరి అచ్చంగా అరగంటైనా కాలేదు అప్పుడే ఆకలితో అలమటించే వాళ్ళూ, తిండి కోసం ఎగబడేవాళ్ళు ఎవరుంటారు బస్సులో! అందుకే దేనికైనా ఆలోచన ముఖ్యమంటారు కాని ఈ అమ్ముకునే వాళ్ళకి అదే తక్కువయ్యింది' అనుకున్నాడు ప్రకాశం మనసులో

ఇంతలో తమ బస్సులోనే ప్రయాణం చేస్తున్న ఒక లావుపాటి శాల్తీ అయిదు రూపాయల అరటిపళ్ళు, మూడు రూపాయల పనస తొనలు కొని ఒక్కొక్కటే తీరిగ్గా తినటం ప్రారంభించాడు ఈవిషయంలో తన అంచనా తప్పయినందుకు తనలో తనే ఆదోలా పీలయ్యాడు ప్రకాశం సాదారణంగా ఏవిషయంలోనూ తను అంచనా తప్పడు ఈరోజే ఈ విషయంలో ఎందుకో మరి ఇలా తన అంచనాకు బిన్నంగా జరిగింది కొంపతీసి 'గీత'



మగువలు
కోరుకునే
అధునాతన
పెండ్లి చీరలు



విషయంలో కూడా తన అంచనా ఇలాగే తారుమారయితే ఇంకేమైనా వుందా! నో! నో! అలా జరగటానికి ఎన్నటికీ వీలులేదు గీతంటే గీతే?

బస్సు మళ్ళా బయలు దేరింది ప్రకాశం పత్రికను ఉండలా చుట్టి బుగ్గకు ఆన్చుకుని మరోసారి తన పెళ్ళి చూపుల సీను మననం చేసుకున్నాడు

మీపేరు?

గీత

ఎంత వరకూ చదువుకున్నారు?

'ఇంటర్ మీడియేట్ వరకూ"

అటుపైన డిగ్రీలో ఎందుకు జాయిన్ కాలేదు?

ఇంటర్మీడియేట్ తప్పితే డిగ్రీలో ఎలా జాయిన్ కావాలి!

ఓహో! ఇంటర్ తప్పారన్నమాట!

ఊఁ

మీకు పాటలంటే ఇష్టమేనా?

ఏం పాటలు?

పాటలంటే సినిమా పాటలుకాదు అవే జానపద గీతాలు, త్యాగరాజ కృతులు, అష్టపదులు వగైరా

ఇష్టమే తరచు రేడియోలో వింటూ వుంటాను '

వినటం కాదు మీరు పాడగలరా మీకు పాడటం వచ్చా అని నా ఉద్దేశం'

పాడగలనేమో! అదినాకు తెలియదు కాని ఇంత వరకూ ఇలా పదిమంది ముందు మాత్రం ఎన్నడూ పాడలేదు ఏదో బాత్రూంలోనో, పెరట్లో పూలదండలు కడుతూనో ఒంటరిగా పాడుకోటం తప్ప

అయితే మీకు పాటలు రావంటారు?"

రావని నేననలేదు ఎప్పుడూ ఇంతమంది ముందు పాడలేదన్నాను అంతే"

గీత జవాబుకు అక్కడున్న వాళ్లంతా పకపకానవ్వారు ప్రకాశానికి గీత జవాబులు కొంచెం కొంటితనంగా, అతిగడుసుగా వున్నా ఆమె మాటల్లోని నిజాయితీ మాత్రం నచ్చింది

"మిమ్మల్ని ఛాలా ప్రశ్నలు వేసి విసిగించానేమో! మీరు కూడా నన్ను ఏవైనా ప్రశ్నలు వేస్తే వెయ్యండి జవాబులు చెబుతాను' అన్నాడు ప్రకాశం

"అక్కరలేదు మీ గురించి మానాన్నగారు అంతా వివరంగా చెప్పారు ఒక్కసారి కళ్ళు ఎత్తి ప్రకాశం ముఖంలోకి చూసింది గీత

'నేనంటే మీకు ఇష్టమేనా?'

" "

'పోరా! పిచ్చి ప్రశ్నలూ నువ్వూను పెద్దవాళ్ళు వెయ్యవలసిన ప్రశ్నలన్నీ నువ్వే స్వయంగా వేశావు అయినా పాపం బిడియపడుతూనే ఆ పిల్ల అన్నిటికీ శావ్యంగా సమాధానాలు చెప్పింది. ఏదో అడిగిన దానికల్లా జవాబులు చెబుతోంది గదా అని 'నేనంటే ఇష్టమేనా' అని సూటిగా అడిగితే ఏ ఆడపిల్ల మాత్రం ఏమని సమాధానం చెబుతుంది" ప్రకాశాన్ని మందలించింది సుభద్రమ్మ

అటుపైన ఇరువర్గాల వారూ అంగీకరించటం అవుతూనే తాంబూలాలు పుచ్చుకోవటం

ప్రకాశం ఇంకా ఆలోచనలో వుండగానే సడన్గా బస్సుకి బ్రేకుపడింది పుల్లేటికుర్రు వచ్చింది

అయిదారుగురు బస్సులోంచి దిగారు మరోపదిమంది బస్సెక్కారు బస్సెక్కిన వాళ్ళలో ఆరుగురు అమ్మాయిలు వాళ్ల ఆరుగురి టికెట్లూ ఒక్కమ్మాయే తీసుకుంది కండక్టరు పావలా చిల్లర తక్కువిస్తే కాదని పోట్లాడి మరీ పుచ్చుకుంది

ప్రకాశం 'ఎవర్రా బాబూ ఈ గాంగ్ లీడర్' అనుకుంటూ ఆ అమ్మాయి ముఖం వైపుకు చూశాడు ఇంకెవరూ గీత! గీతని పూర్తిగా స్టడీ చేయాలంటే ఇంతకంటే మంచి అవకాశం రాదు ఆమెమాటలు, ధోరణి వీటిని బట్టి ఆమె తన అంచనాకు సరిపోయిందో లేదో చక్కగా తెలుసుకోవచ్చు

పత్రిక తెరచి ముఖానికి అడ్డం పెట్టుకుని చదువుతున్నట్టు నటిస్తున్నాడు ప్రకాశం ఈలోగా ఆ అమ్మాయిలు ఆరుగురూ ప్రకాశానికి ముందువైపున ఉన్న రెండు సీట్లలోనూ కూర్చున్నారు

బస్సు మళ్ళీ బయలు దేరింది

గీతా! ఇంతకీ నీ పెళ్ళి బట్టలు రాజమండ్రీలో ఏ షాపులో తీద్దామంటావ్?

మనకి ఫలానా షాపని ఏముందోయ్! బస్సు దిగుతూండగానే బజార్న పడి ముందుగా కాస్తంత కాఫీ సేవించి, అటుపైన చీరలవేట ప్రారంభిస్తాం సాయంకాలానికి చీరలు కొనటం పూర్తి చేసి, కూల్డ్రింకులు తాగి మళ్ళా బస్సెక్కుతాం దీనికి పెద్ద ప్రాబ్లమ్ ఏముంది ఈ వంకనైనా రాజమండ్రీలో వున్న అన్ని షాపులలోని అన్ని రకాల చీరలూ చూడొచ్చు ఏమంటావ్ వెంకటలక్ష్మీ' అంది గీత

అంటానికి ఏముంది పెళ్ళి నీదికాని నాది కాదుగా! అమ్మాయిగారు ఎలా అంటే మేమంతా అలాగే అంటాం!"

"సరే దానికేం గాని గీతా! మీ కాబోయే ఆయన పెళ్ళి చూపుల్లో నిన్ను సవా లక్ష ప్రశ్నలు వేశాడన్నావుగదా నువ్వు కూడా ఆయన్ను

అయిదారు ఆటంబాంబుల్లాంటి ప్రశ్నలు వేసి హడలగొట్టక పోయావా అంది లత

లత అన్నదీ నిజమే! ఆయనకు నచ్చే చీరలేమిటో సచరు చీరల రంగులేమిటో తెలుసుకునివుంటే ఆరంగు చీరలే కొనుక్కునుండే దానివి సెలక్షన్ కూడా సులువయ్యేది అంది రుక్మిణి

చూడు రుక్మిణమ్మా! మా కాబోయే శ్రీవారి గురించి ఇంకా నీకు పూర్తిగా తెలిసినట్టు లేదు ఆయనగారికి కోనసీమంటే మహాచెడ్డ అభిమానం కోనసీమ పిల్లని గాని పెళ్ళి చేసుకోనని కండిషన్ పెట్టారట అలాటి ఆయన్ను మీకు నచ్చే చీరలేమిటి అని అడిగామనుకో – బండార్లంక, ఫుల్లేటికుర్రు, మోరి అంటూ మన కోనసీమలోని నాలుగైదు పేర్లు పారం వప్పగించినట్టు వప్పగించి వుండేవారు ఆ చీరలు మా అమ్మా, మా నాయనమ్మా నిత్యం కడుతూనే వున్నారు ఆయన ఇష్టం ప్రకారం చెయ్యాలంటే ఇహమనకీ ఆ నేత చీరలే ప్రాప్తి! మనకి ఈనాడు రాజమండ్రీ బస్సు ప్రయాణమూ వుండేదికాదు, రకరకాల కొత్త ఫాషన్ చీరలు చూసే అదృష్టమూ లబించేదికాదు

ఏమిటి! మీ ఆయనకు కోనసీమ అంటే అంత పిచ్చా!'

ఏం తప్పా? ఆయన ఇష్టం ఆయనది ఎన్టీరామారావు గారికి తెలుగు బాషన్నా, తెలుగు దేశమన్నా, తెలుగు ఆడపడుచులన్నా పిచ్చి అభిమానం లేదూ! అలాగే మా వారికీ కోనసీమంటే పిచ్చి అభిమానం వుండటంలో తప్పేముంది?

అబ్బే తప్పనికాదు ఊరికే మీ వారిటేస్టు తెలుసుకుందామని అడిగాను. అంతే సరే దానికేం గాని మీవారి గురించి ఇంకా ఏఏవిషయాలు తెలుసుకున్నావు?

విషయాలకేముంది! ఆయన గురించి చాలా బోగట్టాయే సేకరించాను మావారి ఫ్రెండొకడు ఈమధ్యే మాయింటికి వచ్చాడు వాడు ఎవరో కాదు స్వయంగా మా బాబాయ్‌కొడుకు వాడికీ, మా వారికి చచ్చేంత స్నేహమట. ఒకే కంచంలో తింటే ఇద్దరికీ కడుపు నిండినట్టుగా వుండదనీ, ఒకే మంచంలో పడుకుంటే ఇరుగ్గా వుండి ఇబ్బంది అవుతుందనీ తప్ప లేకపోతే ఒకే కంచంలో తిని, ఒకే మంచంలో పడుకోవాల్సినంత క్లోజ్ ఫ్రెండ్సట వాళ్ళిద్దరూ

అయితే మీ బాబాయ్ గారి అబ్బాయ్ మీ కాబోయే శ్రీవారి గురించి ఏం చెప్పాడు?'

మా వారికి అతిగా వాగేవారంటే అస్సలు కిట్టదుట అందుకే బాబూ ఇప్పటినుంచీ ఇలా వసపిట్టలా వాగటం తగ్గించేద్దామనుకుంటున్నాను మా అమ్మా, మా నాయనమ్మా కూడా అదే చెప్పారు ఇదిగో ఈ రాజమండ్రీ ప్రయాణం పూర్తి చేసి ఇంటికి తిరిగి వచ్చేశాక అస్సలు మాట్లాడనే మాట్లాడను ఇప్పట్నుంచీ అలవాటు చేసుకోకపోతే ముందు ముందు మా సంసారంలో కలతలు వచ్చేస్తాయి బుంగమూతి పెట్టి మురిపెంగా అంది గీత

పోవే బడాయి! నీ ఏక్షనూ నువ్వూను మీ ఆయన గురించి ఇంకా ఏమన్నా విశేషాలు చెప్పు అడిగింది దమయంతి

చెబుతా! చెబుతా! ఇదిగో రావులపాలెం రానీయండి అక్కడ జామకాయలు కొనుక్కుని, కొరుక్కు తింటూ చెప్పుకుందాం నవ్వుతూ అంది గీత

అమ్మ బాబోయ్! ఎంత వాగుతోందో! తెలిసి, తెలిసి ఈ వసపిట్టనా తను కట్టుకోబోయేది ఇంకానయం అదృష్టం బాగుంది నేనూ ఈ బస్సే ఎక్కబట్టి ఈ 'గీత' గారి అసలు స్వరూపం బయటపడింది జీవితమంతా ఈవిడగారు ఇలా ఫుల్‌స్టాపూ, కామా లేకుండా మాట్లాడుతుంటే తనకు నిజంగా పిచ్చెక్కటం ఖాయం చస్తే ఈ పిల్లని చేసికోను ఈ సంబంధం వెంటనే కేన్సిల్ చేయమని రేపే మానాన్న గారికి ఉత్తరం రాసి పడేస్తాను' తన మనసులో గట్టిగా నిర్ణయించుకున్నాడు ప్రకాశం

రావులపాలెం వచ్చింది గీత ఒక డజను జామ కాయలు కొని తన ఫ్రెండ్స్ అందరికీ తలో రెండూ పంచింది జామకాయలు తింటూ మళ్ళీ కబుర్లలో పడ్డారు అంబాజీపేటలో కొన్న అరటి పళ్ళూ, పనస తొనలూ తినటం అయిపోవటంతో తాను కూడా ఒక అరడజను జామ కాయలు కొని మళ్ళీ పనిలో పడ్డాడు లావుపాటి శాల్తీ

మా ఆయన్ని వాళ్ళ ఇంటి దగ్గర అంతా ఏమని పిలుస్తారో మీకు తెలుసా? సడన్‌గా ఓ ప్రశ్న విసిరింది గీత

ఆయనపేరు ప్రకాశమటగా! అంతా ప్రకాశం అనే పిలుస్తారు

నో! నో! ఆయన బయటవాళ్ళకి మాత్రమే ప్రకాశం! వాళ్ళ నాయనమ్మ ఆయన్ని ముద్దుగా 'నానీ' అని పిలుస్తుంది వాళ్ళ నాన్నగారు అబ్బిగా అని పిలుస్తే, వాళ్ళ అమ్మగారు మాత్రం బుజ్జిగా అనిపిలుస్తారు

అయితే ఈ పిలుపులకి మీ ఆయన పలుకు తారా లేక నోట్లో బొటన వేలు వేసుకుని చీకుతూ కూర్చుంటారా?

పలకడం పలుకుతారట వేలు చీకటం విషయం మాత్రం మా బాబాయిగారి అబ్బాయిని నేను అడగటం మరచి పోయాను

గీతతో పాటు ఆ అమ్మాయిలంతా తెగ వాగుతూ పకపకా నవ్వుకుంటున్నారు వాళ్ళ మాటలు వింటున్నా, చేష్టలు చూస్తున్నా ప్రకాశానికి ఒళ్ళంతా కారం పూసినట్టుగా వుంది

అమ్మో! పెళ్ళిచూపుల్లో ఈ అమ్మాయిని చూసి నోట్లో వేలుపెట్టినా కొరకలేదనుకున్నాను వేలే కాదు మొత్తం చేతినంతనీ జామకాయ నమిలినట్టు నమిలేస్తుంది ఈ 'గీత' నా జీవితంలోకి ప్రవేశిస్తే నన్ను జీవితాంతం ఆటపట్టిస్తుంది తప్ప నాతో కాపురం చేయదు వాయమ్మో! ఎంత గడుగ్గాయో!' గుండెల మీద చెయ్యేసుకుని మరీ ఆశ్చర్య పోయాడు ప్రకాశం

బస్సు రాజమండ్రీ చేరింది ఆ అమ్మాయిలంతా బస్సుదిగి వెళ్ళిపోయాక గీత కంట బడకుండా తన రూముకి చేరుకున్నాడు ప్రకాశం

ఆ రోజే గీతతో సంబంధం తనకు ఎంత మాత్రం ఇష్టం లేదని వెంటనే పెళ్ళి కేన్సిల్ చేయమని వాళ్ళ నాన్న గారికి ఒక ఉత్తరం రాసి పడేసి 'అమ్మయ్య' అని ఊపిరి పీల్చుకున్నాడు

ఉత్తరం అందిన మరునాడే రాజమండ్రీ వచ్చి వాలాడు జానకిరామయ్య వస్తూండగానే ఎందుకు ఇష్టం లేదురా నీకీ సంబంధం తీరా ముహూర్తాలు పెట్టుకున్నాక కాదంటే ఆపిల్ల బతుకు ఏమవు



తుంది? మనం ఇలా చేశామని తెలిస్తే నీకు మరో పిల్ల నివ్వటానికి బుద్ధున్న వాళ్ళెవరైనా ముందుకు వస్తారా?" అంటూ రుసరసలాడాడు

ప్రకాశం బస్సులో జరిగిన కథంతా తండ్రికి వివరించాడు

"ఆగీత శుద్ధ వసపిట్ట అంత అతిగా మాట్లాడే వాళ్ళంటే నాకు ఇష్టం వుండదని నేను ముందే చెప్పాను అయినా పెళ్ళి చూపుల్లో మాత్రం తీయతీయగా మితంగా, మాట్లాడి నా గొంతు కొయ్య బోయింది అదృష్టం బాగుంది పెళ్ళికి ముందే నిజం బయట పడింది గాని లేకపోతే నా నూరేళ్ళ జీవితం ఆ వసపిట్ట వాగుడుకి బలైపోయి వుండేది బాధగా అన్నాడు ప్రకాశం

కొడుక్కి ఇష్టం లేని పెళ్ళి చేయటం తనకూ ఇష్టం లేక తప్పని సరిమీద మరునాడు పుల్లేటికుర్రు వెళ్ళి తమ అబ్బాయికి గీత నచ్చలేదన్న విషయం చల్లగా ఆడ పెళ్ళి వారి చెవిని వేశాడు జానకిరామయ్య

"ఇంత వరకూ వచ్చాక ఇదేమిటి? పెళ్ళి చూపుల నాడే చెప్పి వుండొచ్చుగా ఈ మాట! పెళ్ళంటే బొమ్మలాటేం కాదు ఇప్పుడు మా గీత జీవితం ఏం కావాలి? అంటూ కస్సుమన్నారు ఆడపెళ్ళి వారు

మీరు కస్సుమన్నా, బుస్సుమన్నా సుఖం లేదు బస్సులో మీ గీత విషయం మావాడికి పూర్తిగా తెలిసి పోయింది మీ గీత తెగ వాగుతుందట ఆ వసపిట్టను నేను కట్టుకోను బాబో అంటూ గోల పెడుతున్నాడు మా అబ్బిగాడు నచ్చ చెప్ప బోయాడు జానకిరామయ్య

అబ్బిగాడెవరు? మీ అబ్బాయేనా! మీ ప్రకాశాన్ని మీరు అబ్బిగాడంటారా మామయ్యా!

ఏవమ్మా గీతా! మా వాడు చెబుతే ఏమిటో అనుకున్నాను నీకు పెద్దా, చిన్నా లేనట్టుంది అందుకే నిన్ను చేసుకోవటానికి మా వాడు సుతరామూ ఇష్టం లేదన్నాడు

ఇంతకీ మీరు నన్నెవరను కుంటున్నారు? మీ కాబోయే కోడలు గీతను కాను నేను! నా పేరు సీత! గీతా, నేనూ కవల పిల్లలం! పెళ్ళి చూపుల రోజున నేను మీ అందరిముందూ అతిగా వాగుతానేమో ననే భయంతో నన్ను దాచేసి నేను ఊళ్ళో లేనని అబద్ధం చెప్పారు మా వాళ్ళు అయినా తలుపు చాటునుంచి ఆ రోజున మా బావగారిని చూడనే చూశాను అప్పట్నుంచీ బావను సరదాగా ఓ ఆట పట్టించాలనుకున్నాను అందుకే ఆ రోజు బావ రాజమండ్రీ వెడతాడని తెలిసి నా ఫ్రెండ్స్‌తో కలసి బావ ఎక్కిన బస్సే ఎక్కి బావను ఆటపట్టించాను నన్ను క్షమించండి మామయ్యా!"

ఆ! అయితే నువ్వు గీతవు కావూ!" ఆశ్చర్య పోయాడు జానకిరామయ్య

కాదు సీతని అదిగో మా అక్క గీత

వంటి నిండా పైట కప్పుకుని, అడుగులో అడుగు వేసుకుంటూ వినయంగా వచ్చి జానకిరామయ్య గారి పాదాలకు నమస్కారం చేసింది గీత ఆశ్చర్య పోతూనే దీవించాడు జానకిరామయ్య

గీత చిరునవ్వు నవ్వింది సీత పకపకానవ్వింది గీత నెమ్మదిగా నడచుకుంటూ హాల్లోంచి తనగదిలోకి వెళ్ళింది సీత గంతులేస్తూ గీత వెనకే పరుగెత్తింది

అసలు విషయం తెలుసుకున్న జానకిరామయ్య ఆడపెళ్ళివారిని మన్నించమని వేడుకుని, గీతతో ప్రకాశం పెళ్ళి మరోసారి ఖాయంచేసి తిరిగి రాజమండ్రీ బయలు దేరాడు కొడుకుతో జరిగిన విషయమంతా చెప్పటానికి

* * * * *

పెళ్ళి పీటల మీద కూర్చుని గీత మెడలో తాళికడుతూ కూడా బెదురు చూపులు చూస్తున్నాడు ప్రకాశం- ఏక్షణంలో నైనా హఠాత్తుగా సీత వచ్చి తనని 'బుజ్జీ' అనో, 'నానీ' అనో, 'అబ్బీ' అనో పిలుస్తుందేమోనని అతగాడి భయం □

## ఇ'వేమన' పద్యాలు




ముచ్చు గుడికిబోయి ముడివిప్పుటేగాని
బొసగ స్వామి జూడ బోడితండు
కుక్క యిల్లు సొచ్చి కుండలు వెదుకదా
విశ్వదాభిరామ వినురవేమ



"అశ్వత్థామ"లో కృష్ణ, విజయశాంతి

# సినిమా విశేషాలు

— జి. వి. జి.

## మారిషస్‌లో "యుద్ధభూమి"

"ఏప్రిల్ 22 నుంచి మే 5 వరకు మారిషస్‌లో షూట్ చేసిన సన్నివేశాలు హైలైట్ అని చెప్పొచ్చు. జూలైకి షూటింగ్ ముగుస్తుంది. అక్టోబర్ మొదటి వారంలో విడుదల", అన్నారు కె. రాఘవేంద్రరావు. ఈయన దర్శకత్వం నెరపే ఆర్. కె. అసోసియేట్స్ వారి పై చిత్రంలో చిరంజీవి, విజయశాంతి, మోహన్‌బాబు, మురళీమోహన్, నూతన్‌ప్రసాద్, సుధాకర్, ప్రసాద్‌బాబు, వేలు, చిట్టిబాబు, సుమిత్ర, అరుణ ఆదిగాగల నటవర్గం. ఎం. వి. ఎస్. హరనాథరావు మాటలు, చక్రవర్తి సంగీతం, కె. ఎస్. ప్రకాష్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, జి. ఆనంద్‌కుమార్ సంయుక్త దర్శకత్వం; సునీల్‌వర్మ-రఘు సహకార దర్శత్వం, రామారావు, రామ్మోహనరావు ప్రొడక్షన్, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పుతో కె. కృష్ణమోహన్‌రావు నిర్మాత.

## శోభన్‌బాబు, శరత్‌లతో "అగ్ని నక్షత్రం"

విధి నిర్వహణలో తనకు తానే సాటి అనిపించుకున్న ఓ పోలీసు అధికారి జీవితంతో ఓ దుర్మార్గుడు ఆడిన చెలగాటానికి, జైలు నుంచి తిరిగొచ్చిన ఆ వ్యక్తి దుష్టశక్తులకు ఎలాంటి ప్రతిఘటన ఇస్తాడన్నది ఇతివృత్తం. 'మర్ తే దమ్‌తక్' హిందీ చిత్రం ఆధారం," అన్నారు శరత్. ఈయన దర్శకత్వంలో శ్రీ అనఘాచిత్ర అధినేత వల్లభనేని లక్ష్మీదాసు నిర్మిస్తున్న పై చిత్రంలో శోభన్‌బాబు, మోహన్‌బాబు, కల్యాణ చక్రవర్తి, రంగనాథ్, సత్యనారాయణ, వేలు, ప్రదీప్‌శక్తి, వినోద్, రజని, వరలక్ష్మి, తాతినేని రాజేశ్వరి, కుయిలీ నటిస్తున్నారు. జంధ్యాల మాటలు, వేటూరి పాటలు, కె. వి. మహాదేవన్ సంగీతం: ఎన్. సుధాకరరెడ్డి ఛాయ, నాగరాజు శిల్పం, ఎన్. గోపాల్ సంయుక్త దర్శకత్వం, అక్కినేని శ్రీనివాసరావు నిర్వహణ, డి. వెంకటరత్నం కూర్పు తెర వెనుక హంగులు.

శరత్ దర్శకత్వంలోనే చల్లా సుబ్రహ్మణ్యం విరచిత "నక్షత్ర సమరం" చిత్రాన్ని తెరకెక్కించనున్నట్లు వల్లభనేని లక్ష్మీదాసు తెలిపారు.

## రామానాయుడు కొత్త చిత్రాలు

"నేను సినిమారంగాని కొచ్చి పాతికేళ్ళు పూర్తయిన సందర్భంగా మా స్టాఫ్ కోసం ఓ నిర్ణయం తీసుకున్నాను. రామానాయుడు ఛారిటబుల్ ట్రస్ట్ బానర్‌లో నిర్మించే తొలి చిత్రం మూలంగా వచ్చే లాభాల్లో యాభై శాతం మా సంస్థలో ఎన్నో ఏళ్ళుగా పని చేస్తున్న కొందరు ఉద్యోగులకు కేటాయించి, వాళ్ళకు హైదరాబాద్‌లో గృహాలు నిర్మించడానికి నిశ్చయించాను," అన్నారు. ఈ చిత్రంలో వెంకటేశ్, రేవతి, గొల్లపూడి మారుతీరావు, శుభలేఖ సుధాకర్ ప్రభృత నటవర్గం.

"మీ పిచ్చరు పూర్తి అయ్యేదాక నేను మరో పిచ్చర్లో నటించకూడదా? అయ్యో! ఈలోగా నేను ముసల్దాన్ని అయిపోను కదా!"



"సత్య" ఫేమ్ సురేష్ కృష్ణ దర్శకుడు. జూన్ 1 నుండి 20 వరకు షూటింగ్. జూలై, ఆగస్టులలో ప్రతి నెలా 10–20 తేదీల మధ్య జరిగే షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది.

"సురేష్ ప్రొడక్షన్స్ ప్రైవేట్ లిమిటెడ్ బానర్‌లో చిత్రాన్ని జూలై నెలలో మొదలెడుతున్నాను," అన్నారు రామానాయుడు. ఇందులో వెంకటేశ్, భానుప్రియ, గౌతమి ప్రధాన తారాగణం. పరుచూరి సోదరుల మాటలు, చక్రవర్తి సంగీతం, ఎస్. గోపాల్ రెడ్డి ఛాయతో బి. గోపాల్ దర్శకుడు.

## ఎం. ఎస్. ఆర్ట్ మూవీస్ 4వ చిత్రం

"డబ్బు, రాజకీయ పలుకుబడి, న్యాయ శాస్త్రంలోని లొసుగుల ఆసరాగా నేరస్థుడు తప్పించుకుంటే, అతనివలన సామాన్య ప్రజలకు కీడు అనిపిస్తే, తన పరిధిని అతిక్రమించి అంతం చేసే అసామాన్యమైన పోలీస్ అధికారిగా డాక్టర్ రాజశేఖర్ నటిస్తున్నారు," అన్నారు ఎం. శ్యామ్‌ప్రసాద్‌రెడ్డి. ఈయన నిర్మాతగా ఎం. ఎస్. రెడ్డి సమర్పించే ఎం. ఎస్. ఆర్ట్ మూవీస్ 4వ చిత్రంలో సహజ కవి మల్లెమాల గీతాలు ఆణిముత్యాలు. సత్యం సంగీతం, సూర్యకుమార్ శిల్పం, మణి కృష్ణప్రసాద్– కె. శివనాగేశ్వరరావు సంయుక్త దర్శకత్వం, మార్తాండ్ కూర్పు, బి. నాగేశ్వరరావు సహాయ దర్శకత్వం, మల్లు వెంకురెడ్డి– ఎం. ఎస్. కుమార్ నిర్వహణతో స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే కోడి రామకృష్ణ "హైదరాబాద్‌లో మే 15న ప్రారంభించిన షూటింగ్ జూన్ 5 వరకు ఒకే షెడ్యూల్లో పూర్తవుతుంది" అన్నారు. ఈ విశిష్టమైన చిత్రంలో జీవిత, ఎ. జె. వి. ప్రసాద్, బాబూ మోహన్, గోపి, హైదరాబాద్ కళాకారులు పాల్గొంటున్నారు.


"బందిపోటు"లో సుమన్


"జానకీ రాముడు"లో జీవిత, నాగార్జున

## ఈ తరం వారి "నవభారతం"

"జూన్ 15 నుంచిధేనువకొండ వగైరా ఒంగోలు ప్రాంతాలలో ఒకే షెడ్యూల్‌లో షూటింగ్ ముగుస్తుంది," అన్నారు ముత్యాల సుబ్బయ్య. ఈయన దర్శకత్వంలో పోకూరి వెంకటేశ్వరరావు నిర్మించే పై చిత్రంలో డాక్టర్ రాజశేఖర్, నరేష్, 'మహర్షి' రాఘవ, నూతన్‌ప్రసాద్, పి. ఎల్. నారాయణ, వేలు, వీరభద్రరావు, నర్రా, సాయికుమార్, సంజీవి, జీవిత, కల్పన, అనూరాధ, నిర్మల, చంద్రిక, తాతినేని రాజేశ్వరి పాత్రధారులు. పరుచూరి రాజా కథ, సంభాషణలు సమకూర్చారు. జాలాది, అదృష్టదీపక్, వంగపండు గీతాలకు చక్రవర్తి స్వరకర్త, ఆర్. రామారావు ఛాయ, యోగి సంయుక్త దర్శకత్వం. గోలి చక్రవర్తి చౌదరి, భీమనేని శ్రీనివాసరావు సహకార దర్శకత్వం, రమేష్ సహాయ దర్శకత్వం, బెజవాడ కోటేశ్వరరావు– సి. హెచ్. కోటేశ్వరరావు ప్రొడక్షన్, గౌతంరాజు కూర్పుతో పోకూరి బాబూరావు సమర్పణ.

## "యమపాశం"

"మల్లాది 'యమపాశం' నవలను తెరకెక్కిస్తున్నాం. జూలై నుంచి మూడు షెడ్యూల్స్‌తో ఆగస్టుకు షూటింగ్ పూర్తవుతుంది." అన్నారు రేలంగి నరసింహారావు. ఈయన దర్శకత్వంలో బత్తిని సత్యనారాయణ "మారణహోమం" అనంతరం నిర్మించే యువశక్తి క్రియేషన్స్ వారి పైచిత్రంలో డాక్టర్ రాజశేఖర్ హీరో.

( 82 వ పేజీ చూడండి)




**ఎ. ఎల్. రమణానందం, మల్కాజిగిరి**

ప్ర : "ఈ జగమే ఒక నాటకరంగం. అందులో మనమంతా పాత్రధారులం" అన్నారు షెక్స్‌పియర్ మహాకవి ఐతే, నా పాత్ర ఏమిటో ?

జ : ఇలా ప్రశ్నలడగడం.

**వై. యాదగిరి, సికింద్రాబాద్–25**

ప్ర భర్త పోయిన భార్య విధవ అవుతుంది. భార్య పోయిన భర్త ఏమౌతాడు?

జ : నూతన వరుడు అవుతాడు సాధారణంగా.

**ఎస్. పద్మ, పొందూరు**

ప్ర "జీవితం" ఒక కల అనుకుంటే, మరి . మరణం?

జ : యధార్థం.

**వేమాని భరత్‌కుమార్, ధర్మపురి**

ప్ర: ఆడవాళ్ళ నోట్లో మాట నిలవదంటారు మరి, రాజకీయవేత్తల నోట్లో . ?

జ: ఇచ్చిన మాట నిలవదు.

**జె. ఆశీర్వాదం, వరంగల్లు**

ప్ర: ఆకులు రాలిపోతే చెట్టు చిగురిస్తుంది మరి, జుట్టు రాలిపోతే బట్టతల ఏర్పడుతుందేమండీ!

జ: అప్పుడు బుద్ధి చిగురుస్తుంది గనుక.

**పి.వి. రామతారకం, నూజివీడు**

ప్ర: కొందరు ప్రభుత్వోద్యోగులు లంచం తీసుకోవడమెందుకు! వాళ్ళకు ప్రభుత్వం జీతం ఇస్తుంది కదా?

జ: ఇస్తుంది. కాని, లంచం ఇవ్వదు కదా?

**వై. జయరాజ్, భిలాయ్**

ప్ర: అవినీతి నిరోధక శాఖవారే అవినీతికి పాల్పడవచ్చా!

జ: చెరువు కాపలా కాచే వారికి దాహం వేసినప్పుడు కాస్త ఆ చెరువు నీటితో నే గొంతు తడుపుకోకుండా ఉండగలరా?

**బమ్మెర సాయిబాబా, కర్నూలు**

ప్ర: నిన్నరాత్రి మీరు నా కలలోకి ఎందుకు వచ్చారు, సుమలతగారూ?

జ: ఈ ప్రశ్నను అప్పుడు కలలో నే మీరు అడిగి ఉండాల్సింది.

**సి. నారాయణరెడ్డి, పొన్నేరి**

ప్ర వర్షాలు ఎక్కువగా పడడానికి చెట్లు ఎక్కువగా నాటాలనే విషయంతో మీరు ఏకీభవిస్తారా?

జ: వర్షాలు ఎక్కువగా పడడానికే కాదు- మేం హీరోలతో డ్యూయెట్లు పాడుతూ చుట్టూ తిరగడానికి కూడా చెట్లు అవసరం... కాదా?

**కొత్త సత్యశాయి, అద్దంకి**

ప్ర: నేను పొట్టిగా ఉన్నాను జీవితంలో ఎలా పైకి రాగలనని నా బాధ

జ: బాధపడకండి.హిట్లర్, నెపోలియన్, స్టాలిన్, లాల్‌బహదూర్‌శాస్త్రి అందరూ పొట్టివారే.

**డి. ఈశ్వరరావు, నెల్లూరు**

ప్ర: జీవితం చేదు– తీపి మిశ్రమం అని తెలిసి కూడా కొందరు తీపి మాత్రం కావాలని కోరుకుంటారు ఎందుకు

జ: చేదు– కోరుకోకుండానే వచ్చేది.

**దేవతా సదానందం, ధవళేశ్వరం**

ప్ర: అంతా ముందుగా బ్రహ్మ రాసిన. రాత అంటారుకదా? మరి కష్టాలొచ్చినప్పుడు దేవుళ్ళకు మొక్కుకోవడం; ముడుపులు ఎందుకు?

జ: బ్రహ్మ రాతను దిద్దడానికి లంచం.

**వై. లక్ష్మణ్, శ్రీకాకుళం**

ప్ర నాకెంతో ప్రపంచజ్ఞానం ఉంది కాని, నా దగ్గర డబ్బులేదే!

జ: ఆ జ్ఞానమే మీకు మూలధనం.

**భాగవతుల శంకరరావు, కనిగిరి**

ప్ర: కొన్ని చిత్రాల పేర్లు, పబ్లిసిటీ, ఇతర వివరాలనుబట్టి ముందుగానే ఏయే చిత్రాలు ఫెయిల్ అవుతాయో, ఏవేవి హిట్ అవుతాయో మేము ఊహించుకో గల్గుతాం కాని, చిత్ర నిర్మాతలు ఆపాటి ఊహించలేరా?

జ: మీరూ చిత్ర నిర్మాతలైనా– మీరూ అంతే. ■

---

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## సుమలత సమాధానాలు

ప్రశ్న...............................................................................

...............................................................................

...............................................................................

పంపినవారి పేరు.....................................................

పూర్తి చిరునామా.....................................................

సీరియల్

హరికిషన్

(గత సంచిక తరువాయి)

## అపాయింట్‌మెంట్:-

ఆ రోజున సావిత్రిని తీసుకొచ్చి అభిలాష్‌కు అసిస్టెంట్‌గా నియమించిన తరువాత శాంతాదేవి మనస్సులో కొత్త ఆందోళన ప్రారంభం అయింది ఎమ్మే పాసయి యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం తెలిసి తండ్రి ఆస్తికీ, డబ్బుకూ, ఇంటి పరువు ప్రతిష్టలకూ వారసుడైన ఒక్కగానొక్క కొడుకూ మాట దూకుడుతో మనసు దూకుడుతో వయస్సు దూకుడుతో ఈ రకంగా చెడ్డ పేరు తెచ్చుకుంటూంటే ఆవిడ మనస్సు విలవిల్లాడింది ఒక్క రోజులోనే ఈ ఆలోచనా భారంతో ఆవిడ వయస్సు పదేళ్ళు ముందుకు సాగినట్లయింది

దశరదరామయ్యకూ కొడుకును గురించి మనస్సులో ఆందోళన ఉన్నా, లోలోపల దిగమింగుకుని పైకి గంభీరంగా కనిపించేవాడు

ఆ రోజు ఉదయం సావిత్రి డ్యూటీలో చేరటానికి వస్తుంది ఆ అమ్మాయితో ఎట్లా ప్రవర్తించవలసిందీ కొడుక్కి చెపుతానన్నది శాంతాదేవి వద్దన్నాడాయన

"శాంతా, డబ్బుకు రెండు పక్కలా పదును వుంటుంది అది మనిషిని నిలబెట్టగలదు నాశనం చెయ్యగలదు నువ్వేం చెప్పొద్దు అమ్మాయి వీడిని ఎట్లా మారుస్తుందో చూస్తూ వుండటమే మన కర్తవ్యం చెడు జరిగితే కన్న కొడుకయినా కటకటాల వెనక్కి పంపే ఏర్పాటుని నేను చేస్తాను పెడదారిని పడ్డ కొడుకు జీవితం రహదారిలోకి రావాలంటే, ఒక్కొక్కప్పుడు మనస్సు రాయి చేసుకోక తప్పదు" అన్నాడాయన

ఉదయం ఎనిమిదయింది గడియారంలో ఎనిమిదో గంట కొడుతూ ఉండగానే వచ్చింది సావిత్రి లైట్ ఆకుపచ్చరంగు జార్జెట్ చీర, ఎర్రంచు బార్డరు, అదే మ్యాచింగ్ చోళీ, ప్రిన్సెస్ టైప్ బ్రా, చెవులకు బంగారు రింగులు, నుదుట ఎర్రని బొట్టు బిళ్ళ, కుడి చేతికి రెండు బంగారు గాజులు, ఎడం చేతికి రిస్టు వాచి, భుజాన తోలు బెల్టు స్టీలు రింగు లేడీస్ బ్యాగ్. అత్యంత ఆకర్షణీయం కాకుండా ఆకర్షణీయమైన తీర్చిదిద్దిన ముఖాలంకరణ సింహద్వారం దాటి హాల్లోకి వచ్చి సోఫాలో కూర్చుని మాట్లాడుకుంటున్న ఆ దంపతులకు నమస్కరించింది

"డ్యూటీలో చేరటానికి వచ్చాను నేను చెయ్యవలసిన పన్లు, పనివేళలూ చెప్పండి" నమ్రతగా అడిగింది

ఒక మనిషిగాని, వస్తువుగాని మనది కానప్పుడు బాగుంటే చూసి సంతోషిస్తాము బాగుండకపోతే కాస్త సంకోచపడుతూ ఈ విధంగా ఉంటే ఇంకాస్త బావుంటుంధి అనే మధ్యేమార్గంతో మన అభిప్రాయాన్ని చెప్తాం బాగున్నా బాగుండకపోయినా రెండు మూడు రోజులు పోయాక ఆ విషయాన్నే మర్చిపోతాం కారణం సంబంధం ఎటాచ్‌మెంట్ లేకపోవటం చేతనే అదే మనది కావాలని అనుకున్నప్పుడు మనలో స్వార్థం తలెత్తి చూస్తుంది

"నీ డ్యూటీ ఏమిటో నీకు తెలుసా సావిత్రీ" అన్నది శాంతాదేవి

"పూర్తిగా తెలీదు మీరు చెపాలి, టైమింగ్స్" అన్నది సావిత్రి

"నీ పోస్టు అభిలాష్‌కు అసిస్టెంట్ మాకు ప్రత్యేకమైన ఆఫీసు ఏదీ లేదు ఆ ఆఫీసు గదీ ఇంట్లోనే ఉన్నది టెలిఫోన్ ఉన్నది ఉదయం ఎనిమిది నుంచీ పన్నెండు వరకూ, సాయంత్రం మూడు నుంచీ ఏడు గంటలు వరకూ బిఎస్సి పాసయినదానివి, మావాడి మనస్తత్వం తెలిసినదానివి, ఏం చెయ్యాలో నువ్వే తెలుసుకో! మాకు కావాల్సింది లాభాలూ, వ్యాపారమూ కాదు మా వాడిని సన్మార్గుడిగా తీర్చిదిద్దటం, దట్సాల్" అన్నాడు దశరథరామయ్య

"వాడి గది మేడ మీద ఉన్నది ఆఫీసు గది ఆ ముందరి హాలు, పద ఇల్లంతా చూపిస్తాను"

శాంతాదేవి మేడ మెట్లు ఎక్కుతున్నది, వెనకాల సావిత్రి, ఆ వెనకాల అనుపమ

"ఇది అభిలాష్ గది. బాత్ అండ్ లావ్ ఎటాచ్‌డ్, ఈ పక్కనున్నది అనుపమ గది ఇప్పటికి చిన్న పిల్లయినా మరో పదేళ్ళు పోతే అల్లుడొస్తాడుగా, కాస్త ముందు చూపు. ఈ ఎదురుగా వున్నది మా దంపతులగది అన్నీ బాత్ ఎటాచ్‌డ్,

జరిగిన కథ -15 :శ్రీవిద్య తన ఎకౌంట్‌లో పాతిక వేల రూపాయలు జమ కట్టబడి ఉండటం గమనించి ఎ ఎ బి బి సి సి డి డి హేమంత్ అనే ఆయన తమ పాలేరని బ్యాంక్ వారికి చెప్తుంది సావిత్రి జగదీష్ పర్ణశాలకు వచ్చి వెళ్ళింది అభిలాష్ జీవితాన్ని పూలబాటగా చేయాలని కంకణం కట్టుకుంది సత్యభామ బ్యాంక్‌లో డబ్బు ఎవరు జమ చేసారో తెలియక అన్న జగదీష్ దగ్గరికి వెళ్ళి విషయం చెప్పింది శ్రీవిద్య అభిలాష్ జమ చేసి ఉండవచ్చుని శార్వాణి అనగా నిర్విణ్ణురాలయింది శ్రీవిద్య

విత్ వాటర్ హీటర్స్ ఎక్కడి స్నానాలు అక్కడే ప్లగ్ సిస్టమ్‌లో ఫోన్ వున్నది ఇక గ్రౌండ్ ఫ్లోర్‌లో కిచెన్, డైనింగ్‌హాలు పూజామందిరం, స్టోర్ రూం, కామన్ హాల్, ఆఫీసు రూం, మరో గెస్ట్ రూం, మరో డ్రాయింగ్ రూం అన్ని గదులూ నువ్వే చూడు ఇక ముందుగా వాడిని పలకరించు, గదిలోనే ఉన్నాడు'' అని మెట్లు దిగుతున్నదావిడ

''సావిత్రిగారూ, ఎక్కువ సిగ్గుపడకండి, సాహసే ధైర్యే ఉద్యోగం ఆడపిల్ల రూంలోకి దర్జాగా ఎంటరవాలి, బై బై'' అని సావిత్రి వీపు చరిచి నవ్వుకుంటూ వెళ్ళింది అనుపమ

గదిలోకి వెళ్ళింది సావిత్రి అభిలాష్ సిగిరెట్ కాలుస్తూ పేపరు చదువుకొంటూ కుర్చీలో కూర్చున్నాడు పేపరు తెరిచి ఉండటంతో అతని ముఖం కనిపించలేదు

''గుడ్‌మార్నింగ్ సర్''

పేపరు బెడ్‌మీద పడేసి సిగిరెట్ తాగుతూ చూసేడు

''నా జీవితాన్ని పూలబాటలో నడిపించటానికి వచ్చావ్ అవునా? జాయినింగ్ రిపోర్ట్ ఇస్తావా'' అన్నాడు అభిలాష్

''జాయినింగ్ రిపోర్టా'' అర్థంకాక అన్నది

''ఎస్ ఎస్ గవర్నమెంట్ ఉద్యోగమైనా, ప్రైవేట్ సర్వీస్ అయినా, ఒక



అపాయింట్‌మెంట్ ఆర్డరూ జీతం, మెడికల్ ఫిట్‌నెస్ సర్టిఫికెట్ ఉండాలి'

'అపాయింట్‌మెంట్ ఆర్డర్ ఇవ్వలేదు, జీతం తెలీదు ఇది ప్రైవేట్ ఉద్యోగం కాబట్టి మెడికల్ సర్టిఫికెట్ అక్కర్లేదు'' నెమ్మదిగా అన్నది అతను కూర్చోమనలేదు తనే ఒక కుర్చీ అవతలకు జరుపుకుని కూర్చున్నది

టేబుల్ సొరుగులో నుంచీ ఒక టైప్ చేసిన కాగితం తీసి సావిత్రికి ఇచ్చాడు తీసుకుని చదువుకున్నది

## ఆర్డర్ ఆఫ్ అపాయింట్‌మెంట్

మిస్ సావిత్రి బి ఎస్సీని, శాంతాదేవి కన్సల్‌టింగ్ కార్పొరేషన్‌లో బిజినెస్ మేనేజరయిన అభిలాష్‌కు పర్సనల్ అసిస్టెంట్‌గా నియమించటమైనది

## ఆడపిల్లలు- అనుభవాలు

జీతం స్కేలు రూ 1000–50–1200–75–1650

2) బిహేవియర్ కోడ్ రూల్సును పాటించని ఎడల కారణం తెలుపకుండానే ఉద్యోగం నుంచీ తొలగించబడును

3) మర్యాద, మన్నన, ఇచ్చిపుచ్చుకొనే మనస్తత్వమూ, గౌరవప్రదమైన ప్రవర్తన, కంపెనీ రహస్యాలను కాపాడటంలో నేర్పు, మాటలలో, చేతలలో మృదుత్వమూ, ఆకర్షణ, విధేయతలూ ఆరు మాసాలు గమనించిన తరువాత "బిహేవియర్ కోడ్ రూల్సు" ప్రకారం ఎడ్వాన్సు ఇంక్రిమెంట్లు ఇవ్వటానికి గాని, కంపెనీలో ఒక భాగస్తురాలిగా తీసుకోటానికిగాని మేనేజ్‌మెంట్ వారికి అధికారము కలదు

4) బస్ట్ సైజు, ఫుల్ లెన్‌క్త్, ప్రొఫైల్ ఈ మూడు రకాల కలర్ ఫోటోలూ ఉద్యోగంలో చేరిన మూడు రోజుల్లోగా ఇవ్వాలి

5) ప్రతి మూడు మాసాలకు ఒక లేడీ డాక్టర్ చేత పరీక్ష చేయించుకొని, కన్యాత్వపు సర్టిఫికెట్‌ని ప్రొప్రైటెస్ శాంతాదేవికి దాఖలు చెయ్యాలి

(సం ) ఎస్ శాంతాదేవి,
మేనేజింగ్ డైరెక్టర్,
శాంతాదేవి కన్సల్టింగ్ కార్పొరేషన్

"చదివావుగా, ఆర్డర్ కాగితం తీసుకో, ఆలోచించుకొని జాయినింగ్ రిపోర్ట్ ఇవ్వు"

"వైట్ పేపర్ ఇవ్వండి"

"కండిషన్లు చూశావుగా"

"చదివాను, ఇక చూడాలి, జాయినింగ్ రిపోర్ట్ రాసిస్తాను"

తెల్ల కాగితం ఇచ్చాడు జాయినింగ్ రిపోర్ట్ రాసింది సావిత్రి

### జాయినింగ్ రిపోర్ట్

రెస్పెక్టెడ్ మేడమ్,

మీ అపాయింట్‌మెంట్ ఆర్డర్‌లోని నిబంధనలను అర్ధం చేసుకొని, ఆమోదించి, మేనేజర్ అభిలాష్‌గారికి పర్సనల్ అసిస్టెంట్‌గా, ఈ రోజు ఉదయం నుంచీ డ్యూటీలో జాయినయినాను అపాయింట్‌మెంట్ ఆర్డర్‌లోని అయిదవ క్లాజును అనుసరించి, నన్ను కించపరచే సంఘటన ఏదయినా జరిగిననూ,, జరపబోతున్నారనే అనుమానం వచ్చినా, ఇండియన్ పీనల్ కోడ్‌లోని తగిన సెక్షన్‌ల ననుసరించి క్రిమినల్ చర్యను తీసుకోగలనని సవినయంగా నేను మనవి చేస్తున్నాను

ఇట్లు
భవద్విధేయురాలు,
బి సావిత్రి

జాయినింగ్ రిపోర్ట్‌ని చదువుకున్నాడు అభిలాష్

"నీ అభిమానాన్ని, గౌరవ మర్యాదల్ని కించపరుస్తారనే అనుమానాన్ని ముందే మనస్సులో నింపుకున్నావా సావిత్రీ"

"నా కన్యాత్వం మీద మీ అమ్మగారికి అనుమానం ఉన్నప్పుడు, మీ పురుషత్వం మీద అనుమానం నాకూ ఉండొచ్చుగా" ఎదురు ప్రశ్న వేసింది

కాసేపు సావిత్రి వైపు చూసి చిరునవ్వుతో మళ్ళీ సావిత్రి అన్న మాటనే రెండు సార్లు అన్నాడు

"సావిత్రీ, ఇండియన్ పీనల్ కోడ్‌లోని సెక్షన్లు స్త్రీకి నేరం జరిగాక న్యాయం చేసే తీరులోనే ఉంటయ్యిగాని, నేర నిరోధక సెక్షన్లు లేవు ఐ పి సీ సెక్షన్లు ఉటంకిస్తున్నావంటే, నాలో ఉన్నదని నువ్వు నిర్ధారించుకున్న నా పురుషత్వం నిన్ను ఇండియన్ పీనల్ కోడ్‌ని చదివేలా చేసింది అవునా"

తల వంచుకొని పెదవి కొరుక్కుని తల ఎత్తి చూసింది

"సత్యభామ అన్నట్లు ఈనాటి ఇంటర్నేషనల్ గేమ్ క్రికెట్ అయితే, ఇంటర్నేషనల్ హాబీ ఈనాటి యువకులకు రేప్ అందుచేత ఈనాటి ప్రతీ యువతీ, ప్రతి స్త్రీ కూడా తమకు సంబంధించినంత వరకూ ఐ పి సీ సెక్షన్లు మననం చేసుకోవటం మంచిదేమో" అన్నది సావిత్రి

"కరెక్ట్, ఈ ఒక్క మాట విన్న తరువాత నీ డ్యూటీ నువ్వు చేద్దువుగాని, భాష ఒకటయినా భావంలో తేడా ఉన్నది, కోపం రాదు కద"

"రాదు చెప్పండి"

"కన్యాత్వం మీద అనుమానం, అంటే?"

"నేను వర్జిన్ గరల్ కాదేమోననే అపనమ్మకం నాకు పురుష సంపర్కం ఉన్నదేమోననే అనుమానం" అభిమానపడుతూ అన్నది

"కరెక్ట్, పురుషత్వం మీద అనుమానం, అంటే?

"మీరు పురుషులు కారేమోననే అనుమానం "

సిగ్గుపడ్డది, బిడియపడ్డది, ఖంగారుపడ్డది, భయపడ్డది

"సారీ సర్ యు ఆర్ ఎ పర్ఫెక్ట్ యంగ్ ఎనర్జిటిక్ జంటిల్‌మన్. మీలో మిస్బివస్ టెండెన్సీ లేదు చాలా మాట్లాడేశాను ఇక డ్యూటీ చేస్తాను నేను చెయ్యవలసిన పన్లు" లెదర్ బ్యాగ్‌లో నుంచీ నోట్ బుక్, పెన్సిల్ తీసుకున్నది

## గడుసులోకం —బాబు








# రచయిత జవాబులు

టి. వి. రమణ, పులివెందుల

ప్ర : నవ మాసాలూ మోసి, కని పెంచి పెద్ద చేసిన తల్లి ప్రేమ గొప్పదా? జీవితంలో సగపాలు భర్తతో పంచుకొనే భార్య ప్రేమ గొప్పదా?

జ : అసలు ప్రేమ అనే అనుభూతి చాలా గొప్పది. స్వార్థరహితమైనది తల్లిప్రేమ. తన మనుగడ కోసం, సంసార సుఖం కోసం, దాంపత్య జీవితం కోసం, కొంచెం స్వార్థాన్ని మేళవించి పంచుకొనేది భార్య ప్రేమ.

జె. రామచంద్రరావు, అయిజ, (మహబూబ్‌నగర్)

ప్ర : కట్నాల కోరలు అనే 'నోరు' తెరిచి ఎప్పుడు దాన్లో నుంచీ ఆడపిల్లలు అనే 'బందీలు' విడుదల అయ్యేది?

జ : ఈ నవలలో ఆ సమస్యకూ పరిష్కారమార్గాన్ని సూచించాను. రాబోయే వారాల్లో చదవండి.

పోలోజు వెంకటాచారి,
హెచ్. సి. ఎల్. టవున్‌షిప్,
హైదరాబాద్

ప్ర: 1) ప్రేమించటానికి పనికివచ్చే ఆడది పెళ్ళి అనేసరికి వెనకాడుతున్నాడు మగవాడు. మీ అభిప్రాయం?

2) నేటి వరకట్న సమస్య పరిష్కారానికి యువతీ యువకుల బాధ్యత ఎంతవరకూ ఉన్నది?

3) తమ ఆత్మ రక్షణ కోసం నేటి ఆడపిల్లలు ఏ విధంగా ఎదుర్కోవాలి?

జ: 1) అలాంటి చీడపురుగులకు సమయానుకూలంగా బుద్ధి చెప్పాలి.

2) ఈ సీరియల్‌లో ఆ ఛాప్టరూ వస్తుంది చదవండి.

3) గుండె నిండా ధైర్యం అలవర్చుకోవటం ప్రథమ కర్తవ్యం. సమయానుకూలంగా బుద్ధి చెప్పగల నేర్పుతో వ్యవహరించటం ద్వితీయ కర్తవ్యం.

ఇ. ఎస్. హరిబాబు, పాకాల

ప్ర: ఉత్తమ నవలకు నిదర్శనం ఎక్కువమంది చదవటమా? ఎక్కువ కాపీలు అమ్ముడు పోవటమా?

జ: రెండూను.

## ఉత్తమ ప్రశ్న

**కాళిదాసు సుబ్బలక్ష్మి, కందుకూరు**

ప్ర: అన్ని రకాల అవమానాలూ భరిస్తూ కూడా ఎన్ని అన్యాయాలు చేసినా సహించి భర్తకు సహకరించే ఇల్లాలూ, ఆదర్శాలను నమ్ముకుని, ఆత్మగౌరవం పెంచుకొని అమాయకంగా ప్రవర్తించే పడతీ, వీరిద్దరిలో ఎవరి ప్రవర్తన బుజువైనదంటారు?

**జ: అవమానాలనూ, అన్యాయాలనూ ధైర్యంగా ఎదుర్కొని స్వశక్తి మీద ఆత్మ గౌరవం పెంచుకొని ధైర్యంగా జీవించే పడతే చాలా గొప్పదంటాను.**

కె. ఎస్. టి. రంగారావు, ఏలూరు

ప్ర: గల్ఫ్ శిక్షాస్మృతిని అమలు జరిపితే తప్ప నేటి 'రుగ్మతల' నుండి 'ప్రక్షాళన' సాధ్యపడదేమోనని భావిస్తున్న ప్రస్తుత పరిస్థితులలో మీ నవలా సీరియల్‌లో వస్తున్న కథా వస్తువు నేటి సమాజంపై ఏ విధమైన ప్రభావం చూపిస్తుందని మీరు భావిస్తున్నారు?

జ: నేటి రుగ్మతల ప్రక్షాళన అనేది ఒక్క రచయితల వల్లనే తీర్చగలిగేది కాదు. నేటి సామాజిక పరిస్థితులు ఈ విధంగా మారటానికి ప్రధానమైన కారణం రాజకీయాలు. ప్రభావం సంగతి ఎట్లా ఉన్నా సరికొత్త ఆలోచనలకు ఈ సీరియల్ దోహదం చేస్తుంది-

న్యాయపతి రమేష్‌బాబు, హైదరాబాద్

ప్ర: ఒక మంచి సీరియల్ అందిస్తున్నారు. మీకు నా ధన్యవాదాలు. మీరు వ్రాస్తున్న ఈ సీరియల్ చదువుతుంటే, మీకు సంతానంలో ఆడపిల్లలే ఎక్కువగా ఉన్నట్లు నాకు అనుమానం కలుగుతోంది.

జ: సీరియల్ నచ్చుతున్నందుకు చాలా థాంక్స్. నాకు ఒకే ఆడపిల్ల.

సి. వి. నరసింహదాసు, విజయనగరం

ప్ర: నేటి రచయిత్రులు కూడా తమ రచనల్లో స్త్రీల అంగాంగ వర్ణనకి ప్రాధాన్యత ఇస్తున్నారు. ఈ హీనస్థితికి కారణం ఏమిటంటారు?

జ: అంటే రచయితలు స్త్రీల అంగాంగ వర్ణన తమ రచనల్లో చేయవచ్చుని మీ ఉద్దేశ్యమా?

పి. శ్రీకాంత్, బళ్ళారి

ప్ర: ఎంతో సాహిత్యాన్ని ఆంగ్లం నుండి ఇంపోర్ట్ చేసుకున్న మనవాళ్ళు; ఈ సస్పెన్స్ తప్ప ఉత్కృష్ట వైచారిక సాహిత్యాన్ని ఎందుకు రచించటం లేదంటారు? ఈ వేవ్ నుండి విముక్తి లేదంటారా?

జ: అందరి అభిరుచులూ ఓ తీరుగా వుండవు. అన్నీ చదివి మంచి సబ్జెక్ట్‌ని గుర్తించుకోవటంలోనే పాఠకుడికి సాహిత్య పరంగా విచక్షణా భావం ఏర్పడుతుంది. సమాజంలో మంచీ చెడూ ఉన్నట్టే సాహిత్యంలోనూ ఉంటుంది.

**ఈ వారం ఉత్తమ ప్రశ్నని పంపిన శ్రీమతి కాళిదాసు సుబ్బలక్ష్మి (కందుకూరు) గారికి బహుమతిగా 'బంగారు చెక్కిళ్ళు' నవల పంపటం జరిగింది.**

---

"నువ్వు చెయ్యవలసిన పన్లు, నోట్ చేసుకో– నంబర్ వన్, అన్నట్లు మార్నింగ్ అవర్సు ఎనిమిదీ టూ పన్నెండు కదా, స్నానం చేయించి బట్టలు వేయించి ట్రిమ్‌గా తయారు చెయ్యటం. రెండు నువ్వు డ్యూటీ ఎక్కేసరికే బెడ్‌కాఫీ అయిపోతుంది. నువ్వు రాగానే అదే బట్టలు తొడిగి గుడ్ బాయ్‌గా నన్ను మేకప్ చేశాక, చైర్ కాఫీ, టేబుల్ టిఫిన్ ఇవ్వటం".

"చైర్ కాఫీ, టేబుల్ టిఫిన్ అంటే?"

"డోంటాక్ లైకే అండర్ మైండెడ్ టీనేజ్ గరల్, మేనేజర్ హోదాలో నేను మాట్లాడుతుంటే, పి. ఎ. గా పాయింట్స్ నోట్ చేసుకొని ఫాలో అవాలి. అండర్‌స్టాండ్". కోపంతో గుడ్లురిమి చూసేడు. మనస్సులో బాధపడి, పి. ఎ. మనస్తత్వంతో అభిమానాన్ని దిగమింగి

"ఎస్ ప్లీజ్" అన్నది.

"బెడ్ కాఫీ అంటే పాచి ముఖంతో తాగే ఆయుక్షీణ కషాయం".

"బెడ్ కాఫీ అంటే ఆయు క్షీణ కషాయమా సార్. పి. ఎ. గా అడగటంలేదు. సావిత్రిగా అడుగుతున్నాను".

స్ప్రింగ్ డోర్ తీసుకుని శాంతాదేవి వచ్చింది. లేచి నిల్చున్నది సావిత్రి.

"ఏం చేస్తున్నార్రా" అన్నదావిడ.

"కావాల్సిన అనుమానాల్ని కడుపులో దాచుకుని అక్కర్లేని ఆర్భాటాన్ని ఇచ్చిపుచ్చుకుంటున్నాం మేడమ్" అన్నది సావిత్రి.

"కాఫీని ఆయుక్షీణ కషాయం అంటున్నారు అభిలాష్, కామెంట్ ప్లీజ్" అని ఆవిడ చెయ్యి పుచ్చుకున్నది సావిత్రి. ఆవిడ నవ్వుతూ కొడుకు వైపు చూసింది.

"కొందరు మగవాళ్ళు నానా డ్రింకులూ డ్రింకి, పెట్టెడు సిగరెట్లు తగలేసి, నిద్రపోతారు. ఆ కంపు తాలూకు సూక్ష్మక్రిములు విజృంభించి, అర్థమయిందా కదూ, ఆ బెడ్ కాఫీతో పాటు కడుపులోకి రామ రామ కృష్ణ, కృష్ణ, అంచేత అమ్మడూ, ప్రాతః కాలపు పరుపు కాఫీ అంటే ఆయుక్షీణ కషాయం అన్నది కరెక్ట్" అన్నదావిడ.

ముగ్గురూ మూడు భావాలతో నవ్వేశారు. సంతోషంగా, జోక్‌గా తీసుకొని



# న్యాయపీఠం



బి. బి. రావు. ఎమ్.ఎ.ఎల్ఎల్.బి.

## ఎమ్.ఎల్.ఏ.ను అవమానించినందుకు ప్రభుత్వం పక్షాన నష్ట పరిహారం ఇవ్వాలి

జమ్మూ కాశ్మీర్ ఎసెంబ్లీ బడ్జెట్ సమావేశం 1985 సంవత్సరం ఆగస్టు 17 తేదీన ప్రారంభం అయినది ఎమ్ ఎల్ ఏ శ్రీ భీమసింగ్‌ను ఎసెంబ్లీ నుంచి సస్పెండ్ చేశారు హైకోర్టు వారు సెప్టెంబర్ 9 వ తేదీన స్టే ఉత్తర్వులు ఇచ్చారు తొమ్మిదో తేదీ రాత్రి శ్రీ భీమసింగ్ జమ్మూ నుంచి శ్రీనగర్ వెళుతున్నారు పదో తేదీ తెల్లవారు జామున 3 గంటలకు శ్రీనగర్‌కు 70 కిలో మీటర్ల దూరంలో పోలీసులు శ్రీ భీమసింగ్‌ను అరెస్టు చేశారు శ్రీ భీమసింగ్‌ను ఎక్కడికి తీసుకు వెళ్ళారో తెలియక ఆయన భార్య సుప్రీం కోర్టులో రిట్ పిటిషన్ పెట్టుకున్నది పోలీసులు శ్రీ భీమసింగ్‌ను జమ్ము సెషన్సు జడ్జి ముందు సెప్టెంబర్ 16 తేదీన హాజరు పర్చారు శ్రీ భీమసింగ్‌ను బెయిలుపై విడిచి పెట్టారు పదో తేదీ నుంచి పధ్నాలుగో తేదీ వరకు పోలీస్ లాకప్‌లో ఉంచినట్లు 14 తేదీన మేజిస్ట్రేట్ ముందు మొదటి సారిగా హాజరు పర్చినట్లు శ్రీ భీమసింగ్ సుప్రీం కోర్టుకు తెలియపర్చారు ఎనిమిదో తేదీ రాత్రి జమ్మూలో శ్రీ భీమసింగ్ ప్రజలను రెచ్చగొట్టిన విధంగా ఉపన్యాసం ఇచ్చినట్లు పోలీసులు కేసు నమోదు చేశారు శ్రీ భీమసింగ్‌ను అరెస్టు చెయ్యవలెనని ఉన్నతాధికారుల నుంచి ఉత్తర్వులు వచ్చాయి ఫలితంగా శ్రీ భీమసింగ్‌ను పదో తేదీన అరెస్టు చేశారు సుప్రీం కోర్టు వారు తమ తీర్పులో శ్రీ భీమసింగ్‌ను 11 వ తేదీన మేజిస్ట్రేట్ ఎదుట గాని, 13 వ తేదీన సబ్‌జడ్జి ఎదుట గాని హాజరు పర్చలేదని ఇది వ్యక్తి స్వేచ్ఛ యొక్క హక్కుకు భంగమని కనుక రాజ్యాంగంలోని 21, 22 ఆర్టికల్స్‌కు విరుద్ధమని అన్నారు శ్రీ భీమసింగ్‌ను సెప్టెంబర్ 11 వ తేదీన ఎసెంబ్లీకి వెళ్ళకుండా చెయ్యడానికి పోలీసులు దౌర్జన్యంగా అరెస్టు చేశారని సుప్రీం కోర్టు వారు పేర్కొన్నారు తనను దుర్బుద్ధితో అరెస్టు చేశారని సుప్రీం కోర్టుకు ఒకరు ఫిర్యాదు చేసినప్పుడు అతనిని విడిచి పెట్టినందు వలన చేసిన తప్పు తొలగిపోదు అతనికి తగు నష్టపరిహారం చెల్లించాలి కనుక శ్రీ బీమ్‌సింగ్‌కు ఏభై వేల రూపాయలు నష్టపరిహారం క్రింద జమ్మూ కాశ్మీర్ ప్రభుత్వం చెల్లించాలని సుప్రీం కోర్టు వారు 1985 లో తీర్పు ఇచ్చారు ◻

## ఆడపిల్లలు – అనుభవాలు

నవ్వింది సావిత్రి

నిన్ను చూస్తుంటే నా కొడుకుని మార్చేటట్టున్నావమ్మా అనుకొని ఆనందంగా తృప్తిగా నవ్విందావిడ నన్ను మారుద్దామని మహదానందపడుతూ నిష్కల్మషమైన హృదయంతో, నిర్మలమైన మనస్సుతో వచ్చింది సావిత్రి పంజరంలో చిలకే అవుతుంతో, పసిడి బావాలతో నా సరసనే చేరుతుందో నాకే అర్థం కావటంలేదు, అనుకుని నవ్వుకున్నాడు అభిలాష్

"ఎంటర్ ది డ్యూటీ" అని సావిత్రి శిరస్సును ముద్దు పెట్టుకుని వెళ్ళిందావిడ

"ఎంటర్ ది డ్రాగన్" అని మనస్సులో అనుకున్నాడు అతను

"డ్యూటీ, డిగ్నిటీ, ప్రెస్టేజ్" అనుకున్నది సావిత్రి

అభిలాష్ బాత్‌రూంవైపు చూసేడు వాటర్ హీటర్ స్విచ్ ఆన్ చేసి వచ్చింది సావిత్రి బాత్ రూంలో అన్నీ ఉన్నయ్యి టర్కీటవల్ స్టాండ్‌కు తగిలించి వచ్చింది మరో పావు గంటలో అతను స్నానం చేసి టవల్ చుట్టుకొని వచ్చాడు

"బట్టలు వేసుకోండి" అన్నది సావిత్రి

"నన్ను ముస్తాబు చెయ్యటం పి ఎ బాధ్యత"

"బట్టలు నేను వెయ్యాలా వయసొచ్చిన వారికి బట్టలు వేసి ముస్తాబు చెయ్యాలంటే ఆ బట్టలు వేయించుకొనే వ్యక్తి పిచ్చివాడో, అమాయకుడో, పెద్ద వయసొచ్చిన వృద్ధుడు కావడంచేత మతి తప్పిన వాడయినా అయి ఉండాలి ఇందులో మీరు ఏ రకంవారో చెప్పితే డాక్టర్ సలహా తీసుకొని బట్టలు వేసి ముస్తాబు చేస్తాను"

"ఓ, ఆ రూట్‌లో వచ్చావా, సరే" బట్టలు వేసుకుని ట్రిమ్‌గా ముస్తాబయాడు ఈలోగా టిఫిన్ తెచ్చి టీపాయ్ మీద ఉంచింది అతను టిఫిన్ చేస్తూ ఉండగానే కాఫీ తెచ్చింది కాఫీ తాగుతూనే చెయ్యి చాచాడు చేతిలో వక్కపొడి ఉంచింది

"నేను ఆఫీస్‌కి వెడుతున్నాను బ్రీఫ్‌కేస్ తీసుకొని ఆఫీసుకు రావాలి" అతను మెట్లు దిగుతున్నాడు వెనకనే బ్రీఫ్‌కేస్ తీసుకొని వెళ్ళింది ఆఫీసు గదిలో సీట్లో కూర్చున్నాడు ఎదురుగా కుర్చీలో కూర్చున్నది సావిత్రి చేతిలో నోట్‌బుక్, పెన్సిల్

"పి ఎ 60070కి కనెక్షన్ ఇవ్వు" డయల్ చేసి కనెక్షన్ ఇచ్చింది

"హల్లో త్యాగరాజ్, గుడ్‌మార్నింగ్, డబ్బుడిగావు ఎంత కావాలి"

"పాతిక వేలు"

"ఇరవై అయిదువేలా, ఎందుకురా అంత డబ్బు"

"నూరుకు తాగటానికి"

"ఏమిటీ నువ్వనేది జోక్ చెయ్యకు ఎవ్వరూ లేరులే చెప్పు, ఏదన్నా కమిట్‌మెంటా"

"కమిటెడ్ సూయిసైడ్, పోలీసు రిపోర్టు ఇచ్చాను గాని ఎవ్వరికీ చెప్పదల్చుకోలేదు ఇరవై రోజుల క్రితం బ్యాంక్ నుంచీ వస్తుంటే ఒక ఇన్‌సిడెంట్ అదే చిన్న సిగ్గుపడాల్సిన సంఘటన ఆ డబ్బు మా కంపెనీది నేనే సర్దేశాననుకో కలిసినప్పుడు చెప్తాను పాతికవేలూ సర్దెయ్యి, నెలరోజుల్లో ఇచ్చేస్తాను"

"సరే, నేను పనిమీద వెడుతున్నాను మా పి ఎ గార్ని అడిగి తీసుకెళ్ళు డాక్యుమెంట్సు పి ఎ గారికి ఇవ్వు ఓ కే" ఫోన్ పెట్టేసాడు

"త్యాగరాజు వస్తాడు మేడ మీద గాడ్రెజ్‌లో డబ్బున్నది పాతిక వేలూ తీసి ఇవ్వు ప్రోనోట్లు ఇస్తాడు తీసుకుని జాగ్రత్త చెయ్యి" తల ఊగించింది

"చూడూ, నాకసలు పి ఎ ఆఫీసు వ్యవహారాల్లో అక్కర్లేదు పర్సనల్ వ్యవహారాల్లో కావాలి నా ప్రైవసీ, సీక్రసీ, క్యారెక్టర్, హాబీ, హ్యాబిట్స్ వీటిని చూట్టానికే పి ఎ కావాలి" అని గాడ్రెజ్ తాళం చెవులు ఇచ్చి వెళ్ళాడు అభిలాష్ సావిత్రి కూర్చున్నది ఆలోచిస్తూ

(ఇంకా ఉంది)



# ఈకాలం పిల్లలు....

కె.నాగేశ్వరి

తప్పు చేయటం మానవ నైజం ఆ తప్పు చెయ్యకూడని రెండింటి పరిధిలో కాకుండా ఇంకో రకంగా ఉండొచ్చు తప్పు చేసినా పెద్దవాళ్ళ మందలింపుతో మానుకోడం బుద్ధిమంతుల లక్షణం బుద్ధి అంటే శ్రీరాముని లక్షణాలు పుణుకు పుచ్చుకొన్నంత ఉత్తమోత్తమంగా ఉంటే ఇంకేం!!!

అలాగే భూమిపుత్రి అయిన సీత అంత ఓర్మి వహించడం మాటలతో కూడినది కాదు అలాగే తాము తప్పు దారిన నడుస్తూ అదెంతో మంచిదని చెప్పేది ఇంకో రకం లక్షణం

ఈ లక్షణం సాదారణంగా మగపిల్లలకుంటుంది ఇది ముందు సిగరెట్లు కాల్చడం అవి అందుబాటులో లేకపోతే బీడీలు కాల్చడానికి సిద్ధమవడం మొదలైనవి ప్రస్తుతం వీరిలో రకరకాల రూపాలున్నాయి కొందరికి కారా కిళ్ళీ అలవాటు చేసుకోవడం, అమ్మాయిల హాస్టల్సు దగ్గర బీటు కాయడం, చదువు మాని పేకాట ఆడడం, చివరగా డ్రగ్ఎడిక్టు అవడం కూడా చేర్చొచ్చు వాటిలో వారికెంత ఆకర్షణ ఉంటుందో వర్ణించలేం! ఒక్కో ఆకర్షణనూ, అది తెచ్చే అనర్థాలనూ విశ్లేషించుకుంటూ పోతే ఒక్కో గ్రంథం తయారవుతుంది

ఆదర్శప్రాయులైన అధ్యాపకులు ప్రయత్నిస్తే వీరు తప్పక మారతారు వీరు నిజంగా ప్రేమలోకి దిగుతారు అది మోహపు తెర కాకుండా, మమకారంతో బంధించే బంధం అయితే మార్పు నిదానంగానయినా వస్తుంది కొత్తలో వీరెంత కొరుకుడుపడని కొయ్యలా ఉంటారో హృదయ పరివర్తనం కలిగాక అంతగా మారతారు

మంచితనమనే నీటి 'ఊట' వీరి జీవిత లక్ష్యపు వేళ్ళలో ప్రసరించి వీరి జీవితం పచ్చగా కళకళలాడేటట్లు చేస్తుంది ఒక వయసు బాధ్యత వచ్చాక వీరు తప్పకుండా తరువాతి తరం టీనేజి పిల్లలకు తమంతటామే మార్గదర్శకులవుతారు వారికి శ్రద్ధగా నడవడి గురించి చెబుతారు కొందరు తప్పు చేసి తెలుసుకున్నా జరిగిన నష్టానికి కుములుతారు వీరిదో తరహా!

అతి ప్రమాదకరమయిన వారెవరంటే తమ తప్పుని ఇతరులపై నెట్టేవారు సాదారణంగా ఆడపిల్లలు అదీ తల్లికి ఓపిక తక్కువ ఉన్న ఇంట పుట్టినవారు ఈ రకంగా తయారవుతారు చిన్నప్పుడు వీళ్ళలో వేళ్ళూనిన ఈ జాడ్యం పెద్దయ్యాక చెదలా పెరిగి చుట్టుప్రక్కల వారిని తినేటట్లు చేస్తుందంటే




అందులో అతిశయోక్తి లేదు

వీరు సాధారణంగా నలుగురున్న ఇళ్ళలో ఉంటారు ఎందుకంటే తల్లికి ఉమ్మడి కుటుంబంలో ఉండాల్సిన అవసరం ఉంటుంది ఆడబిడ్డల రాకపోకలెక్కువగా ఉండొచ్చు లేదా ఈ అమ్మాయితో ముగ్గురూ ఆడపిల్లలే అవొచ్చు లేదా కడసారిగా ఒక్కగానొక్క మగబిడ్డ ఉండొచ్చు తండ్రి కొంచెం పద్ధతుల్ని పాటించేవాడయి ఉండొచ్చు డబ్బును విచ్చలవిడిగా ఖర్చు చేయడానికి వీలుకాని కుటుంబం అయి ఉండొచ్చు

ఇవన్నీ ఆ పిల్లకి చిన్నతనంలో కొంత చికాకు కలిగించవచ్చు తల్లి తీరిక లేకో, ఓపిక లేకో ఈ పిల్ల పేచీలు పెడుతుంటే గట్టిగా కసురుకోవచ్చు లేదా వీపు మీద నాలుగు వడ్డించవచ్చు ఈ అమ్మాయి పేచీలు మాని కిక్కురునకుండా ఏ పుస్తకమో పుచ్చుకోవడమో, స్నేహితురాలింటికి ఆటకు వెళ్ళటమో చెయ్యదు ముందు కొప్పగిరేలా ఏడుస్తుంది ఈమె కన్న పెద్దవారు చిన్నవారు ఈ గొడవ భరించలేక "ఎందుకమ్మా దాన్నలాగ కొట్టావు అది అడిగింది పడేయి మేం సర్దుకుంటాంలే! చిన్నది" అంటారు లేకపోతే రాక్షసి అంశ ఉంది తల పగిలిపోతోంది దాన్నె తిట్టక" అంటారు దాంతో ఆ అమ్మాయికి తను స్థాయి ఎంచి ఏడిచి వాళ్ళని హడలగొట్టాను అనే మనస్తత్వం పెంచుకొంటుంది అలా అలా ప్రతీ దానికి పేచీలు, అలకలు ఏడుపులు పెడబొబ్బలతో ఇంటిని మార్మోగిస్తుంటుంది ఇంట్లో ఉండి బైటనుండి ఏది కావాలంటే అది అమర్చుకోగల ఫైఖరి అలవాటు చేసుకుంటుంది పసితనం నుండి వయసొచ్చాక మొదలవుతుంది అసలు కథ

బడిలో మార్కుల దగ్గర్నుండీ వేసుకునే దుస్తుల వరకూ తనకే హెచ్చు శాతంలో ఉండాలి కష్టపడి మిగతా వారు తెచ్చుకుంటే, అది తన తప్పుకాదనీ, పెద్దవారు తనకి ఫలానా చోట ట్యూషను పెట్టలేదనీ, తనని చిన్న చూపుతో మంచివి కొనలేదనీ గోల మొదలెడుతుంది

ఫలితంగా చదవగలిగీ చదవలేదు నలుగురితో కలవాలని ఉన్నా కలవలేదు కుటుంబ పరిస్థితులు తెలిసుండీ సర్దుకోదు వారు కష్టపడ్డారు అయినా సీటు రాలేదు వీరు శ్రమించారు అయినా ఉద్యోగం



చాక్లెట్‌కి డబ్బులిమ్మంటే ఇవ్వట్లేదు కదూ? నా పెళ్ళయ్యాక మా ఆయన్ని నీ మీదకు ఉసిగొల్పి నిన్నేం చెయ్యిస్తానో చూడు!

కోలపల్లి

రాలేదు ఆమె ఎంతో బుద్ధిమంతురాలు అయినా అపవాదు వచ్చింది నేనైతేనా అని ప్రగల్భాలు పలుకుతుంది అప్పుడు ఇంట్లో ఇంగితం ఎరిగి మందలించాల్సిన బాధ్యత తల్లిది

ఏం నువ్వయితే ఆపాటి కూడా కష్టపడలేవు కష్టపడిన వారికి ఒకసారి ఓటమి ఎదురైనా అదే గెలుపుకు సోపానం అలాగే ఉద్యోగం దొరక్కపోతే ఇంకోటి నీతిగా బస్తాలు మోసినా తప్పులేదు ఫలానా పిల్లకి అపవాదు వస్తేనేం ఆమె నడవడే ఆ

## ఈ కాలం పిల్లలు

నిందలను మాయం చేసుకోగలదు నివురుబాటు నిప్పులాంటిదే నిజం నిజం తెలిసినవాడు ఆమె జీవితంలో ప్రవేశిస్తే నందనవనం లాంటి జీవితం లభిస్తుంది నీకు ఇలా అపోహలు పెంచుకోవటం, అందరి తప్పులూ ఎంచటం మంచిదికాదు అని తిడ్తే కొంత జాగ్రత్తగా మసలుతుంది

నిజమే ఇది గనుక ఇంత తెలివిగా చెప్తోంది అందుకే ఎవరినీ నమ్మదు ఎవరితోనూ కలవదు హాయిగా దీనివలన ఏ మాటా రాదు అనుకుని ఇంకా ఇంకా ప్రోత్సహిస్తే ఆ పిల్ల తల్లితండ్రులకు కూడా అపవాదులు అంటగడితే ఆశ్చర్యపోనక్కర్లేదు చివరికి ఇటువంటి వారు కాలు కదపకుండా నోటితో సతాయిస్తూ అందరినీ ఆడిస్తారు కొందరికి వీరెంతో తెలివైనవారిగా కనిపిస్తారు

ఒక విధంగా చెప్పాలంటే వీరు శుద్ధ అవకాశవాదులు అతి నేర్పుగా ఎదుటి వారిపై తప్పులను నెట్టే చాతకానివారు వీరు వేసిన తప్పుల వల్ల చిరాకు పొంది ఎవరైనా ఎగురు తిరిగితే వీరు ఎంత నిష్ప్రయోజకులో అర్థమవుతుంది ఎంత భయంకరమైన మానసిక స్థితికి లోనవుతున్నారో తెలిస్తే జుగుప్స కలుగుతుంది వీరికంటే నేను చదవలేను నాకింతకంటే రాదు నాపై ఆశలు పెంచుకోకండి అని చెప్పే వారివల్లే కొంత ఉపయోగం "నేనెలా చదువుతాను మీరేం సదుపాయాలు చేస్తారు" అంటారు పై రకం అలాగే నేనెంత ఆకర్షణీయంగా ఉండను నన్నెవరైన నచ్చడం కష్టం" అంటారు సాదా అమ్మాయిలు వీళ్లైతే "అసలా పెళ్ళికొడుకు ఏం బాగులేదు నేనే నచ్చలేదు అయితే మావాళ్ళు అంతకంటే మంచి సంబంధం తేలేరని ఆ పెళ్ళి చూపులకు కూర్చున్నాను అంటారు! ఇలాంటివారు ఈనాటి యువతరంలో ఉంటే చుట్టుపక్కల వారు చాలా జాగ్రత్తగా ఉండాలి □





# పొలాల్లో దిగుబడి పుష్కలం
# జై కిసాన్ సామ్రాట్ శక్తి అపారం



**జైకిసాన్ సామ్రాట్ 18:46:0**
**కళకళలాడే మొక్కలు, చక్కగా కట్టే గింజలు.**

ఎందుకంటే, జైకిసాన్ సామ్రాట్‌లో పోషక పదార్థాలు అత్యధిక పాళ్లలో ఉన్నాయి.

మొక్క తొలి దశలో అవసరమైన ఫాస్ఫేట్ జైకిసాన్ సామ్రాట్‌లో పుష్కలంగా ఉంది. అంచేత దీని శక్తితో బలమైన వేళ్లు, ఏపుగా పెరిగే మొక్కలు.

అంతేకాదు. ఈ ఎరువులోని 18 శాతం నత్రజని అమోనియా రూపంలో ఉండటం వల్ల ఎరువు నీటితోపాటు కొట్టుకుపోదు— అత్యధికంగా మొక్కలకు అందుతుంది. అంటే తొందరగా పెరిగేందుకు శక్తి, కళకళలాడే మొక్కలు, చక్కగా కట్టే గింజలు.

గుర్తుంచుకోండి. జైకిసాన్ సామ్రాట్ దొరికే చోటు జువారి వారి పసుపుపచ్చ దుకాణం.









శోభన్‌బాబు



రాశీమూవీక్రియేషన్



# భార్యాభర్తలు

అందీ అందని ప్రేమలో
ఆరాటపడే
పడుచుగుండెల
కమ్మని కథ

VINAY ADS

దర్శకత్వం: కె.మురళీమోహనరావు నిర్మాత: యం.నరసింహారావు

---

దాసరి నారాయణరావు



సురేష్ ప్రొడక్షన్స్ (ప్రై) లిమిటెడ్

# బ్రహ్మపుత్రుడు

డి.రామానాయుడు



# కాయ కల్ప చికిత్స

## నాలుగు మాసముల పది రోజులు

గత 23 సం. లుగా హోమియో వైద్యము చేసి అనేక మంది రోగుల వ్యాధులను నివారణ చేసినాను. అంతేగాక గత 8 సం.లుగా అయస్కాంత చికిత్స కూడా చేసి అనేక మంది రోగులను ఆరోగ్యవంతులుగా చేసినాను. కాని 23 సం. ల క్రితము నాకు తొడల మధ్య తామర వ్యాధి కలిగినది. దానిని గోకినప్పుడల్లా దుర్వాసనతో కూడిన పొట్టు రాలి చాలా బాధ పడుచుండెడి వాడను. దేహములో ఒక పార్శ్వమునకే చెమట పట్టేది. అది చాలా చెడువాసన కొట్టేది. తరుచు జలుబు చేసి తుమ్ములు ఎక్కువగా వస్తూ యుండేవి. బస్సులో చాలా దూరము ప్రయాణము చేసిన కాళ్లకు వాపులు వచ్చేవి. ఆహారము తిన్న తరువాత కడుపులో భారముగా యుండేది. నోరు చెడువాసన కొట్టేది. కాలి బొటన వేళ్లలో 'గౌటు' అనబడే మొండి రకపు కీళ్లవాతము వచ్చినది. ఈ వ్యాధులన్నిటికి హోమియో అయస్కాంత చికిత్సా విధాన ములతో నేనే స్వయముగా వైద్యము చేసుకొంటిని. కాని ఫలితము లేక పోయింది.

క్రమస్య వ్యాధులు తీవ్రరూపము దాల్చినవి. మంచము దిగి మలమూత్ర విసర్జనలకు సహితము లేచి వెళ్లలేని స్థితి వచ్చింది. 'గౌటు' వ్యాధి కాళ్ల నుండి చేతులకు వ్యాపించి ప్రతి కీలు వాచి చాలా బాధ పడుచుండెడి వాడను. అట్టి స్థితిలో ప్రవీణులను హోమియో వైద్య మిత్రుల సలహా పొంది, వారు ఏంపిక చేసిన మందులన్ని తిన్నప్పటికి ప్రయోజనము లేకపోయినది. గత్యంతరము లేక ఎల్లోపతి మందులను ఇంజక్షనులను తీసుకొని వాడినను తాత్కాలికముగా బాధలు ఉపశమించి మరల కొద్ది కాలమునకే తీవ్ర రూపము దాల్చు చుండెడివి. మిత్రులగు ఒక ఎం. బి. బి. ఎస్ డాక్టరుగారు ఇంగ్లీషు వైద్యము వలన 'గౌటు' వ్యాధి సంపూర్ణముగా నివారణ కాదు, ఇంక ఏదైనా వైద్యము చేసుకొని ఆరోగ్యము పొందమని సలహా ఇచ్చినారు.

అట్టి విషమ పరిస్థితిలో విశాఖపట్నం, పెదవాల్తేరు లోని శ్రీ యోగాశ్రమ స్థాపకులు అగు శ్రీ రాఘవేంద్ర యోగి వారి దగ్గర నూట ముప్పది (130) రోజుల కాయకల్ప చికిత్స పొందినాను. దీనితో నా వ్యాధులు, బాధలు తొలగి పోయి మంచి ఆరోగ్యము కలిగినది. గత పది సంవత్సరముల నుండి వాడుచున్న కండ్లజోడు నిమిత్తము లేకుండా అన్ని పత్రికలు, అన్ని పుస్తకములు చదువు కొనగల్గుచున్నాను. ఇప్పుడు నాకు 51 సం. వయస్సు. కాని 25 సం. ప్రాయములో ఉండదగిన శారీరక, మానసిక బలములు కలిగి నేను ఎంతో ఉత్సాహము గాను ఆనందముగాను ఉన్నాను. నాకు తెలిసినంత వరకు ఇంత సుఖతరమైన శక్తి వంతమైన మంచి వైద్యము మన దేశములో ఎక్కడా లేదు. ఇటువంటి ఉత్తమ చికిత్స చేసి నాకు నూతన జన్మను ప్రసాదించిన శ్రీ రాఘవేంద్ర యోగి వారికి నా జీవిత కాలమంతయు కృతజ్ఞతగా ఉండగలను.

ఇట్లు

**Dr. Bendalam Mrutyunjaya Rao** B. A., D. I. G.DMAG

# నిధికోసం రాజస్థాన్‌లో పసిపిల్లల బలి!

రాజస్థాన్‌లో "సతి"పై రేగిన దుమారం తర్వాత ఇప్పుడు "నరబలి" కాండ కూడా బయట పడింది. దురదృష్టవశాత్తు అమానుషమైన మూఢ విశ్వాసాల వల్ల రాజస్థాన్ తరచు వార్తల్లోకి ఎక్కుతోంది. అమాయకులైన పసి బాలురను ఎందుకు బలి పెట్టారు? ప్రభుత్వం వీటిని ఎందువల్ల ఆపలేక పోతున్నది? అన్నవి ఆలోచించాల్సిన విషయాలు.

రాజస్థాన్ లోని భీల్‌వాడా జిల్లాలో రాత్రికి రాత్రే కోటీశ్వరు లవ్వాలనే పేరాశతో కొందరు 4 సం.ల బాలుని బలి యిచ్చారు. కానీ నిధి సంగతలా ఉంచి చిల్లి గవ్వకూడా దొరకలేదు. ఈ నరబలి బీగోద్ గ్రామంలో జరిగింది. గత నవంబరు 17న 4 సం.ల పవన్ బాంగడ్‌ను కేవలం మూఢ నమ్మకాలకు లోనై నిధిని చేజిక్కించు కోవాలనే దురాశతో బలి యిచ్చారు. బాలుని శిరస్సు నుంచి చిందిన రక్తంతో నిధికి కాపలా కాసే దెయ్యాన్ని సంతృప్తి పరచ వచ్చని వారి మూఢ నమ్మకం. నరబలి తర్వాత హంతకులు శవాన్ని అబ్దుల్ హకీమ్ అనే ఆయన నుయ్యిలో పారేశారు. హిందువులు, ముస్లిములు సమానంగా వున్న ఈ ప్రాంతంలో, ఇందువల్ల మతకలహం రగులుకుంది. సరైన సమయంలో అసలు విషయం బయట పడకుండా వుంటే పరిస్థితి విషమించి ఉండేది. మత కలహాల వల్లే బాలుని చంపి హకీమ్ నుయ్యిలో పడేశారని మొదట పోలీసులు కూడా భ్రమ పడ్డారు. అమాయక మైన ముగ్గురు పిల్లలను అనుమానించారు. పాపం వారు చేసిన తప్పల్లా శవం నూతిలో వుందని ముందుగా చెప్పటమే. భైరూ, ఇక్బాల్, బాబూ అనే ఈ ముగ్గురు పిల్లలతో పాటు పోలీసులు 30 సం.ల భూరా కుమావత్‌ను కూడా అనుమానించి అతనిని చిత్ర హింసలకు గురి చేశారు. 15 రోజుల పాటు అతడు సరిగా కూర్చునే స్థితిలో కూడా లేడు. భూరా, హకీమ్ నూతిలోంచి నీరు వాడుకుంటూ పొలం సాగు చేయటమే అతడు చేసిన పాపం. పోలీసులు యింతటితో ఆగక 7 సం.ల ఇక్బాల్‌ను హత్య చేసినట్టు ఒప్పించారు. తను పవన్‌తో ప్రకృతి విరుద్ధమైన దుశ్చర్య చేయాలని ప్రయత్నించినట్టు, ఆ ప్రయత్నంలో పవన్ మరణించినట్టు, జరిగిన దానికి భయపడి పవన్ శవాన్ని హకీమ్ నుయ్యిలో పారేసినట్టు ఇక్బాల్‌తో ఒప్పించారు కూడా. ఇందుకై ఇక్బాల్‌కు కరెంట్ షాక్ ఇచ్చారు.

కానీ 29 నవంబరున అదే ప్రాంతంలో వికాస్ అనే 4 సం. కుర్రాడు గల్లంతు అవ్వటంతో కథ అడ్డం తిరిగింది. గ్రామంలోని యిరుపక్షాల వారు కత్తులు దుయ్యటానికి సిద్ధపడ్డ తరుణంలో వికాస్ సలక్షణంగా తిరిగి వచ్చాడు. నరబలి కోసమే వికాస్‌ను అపహరించటం జరిగిందని గ్రామస్థుల నమ్మకం. కానీ గ్రామంలో ఉద్రిక్త వాతావరణం



పవన్

ఏర్పడటం వల్ల అపహరించిన వారు తిరిగి వికాస్‌ను వదిలి పెట్టారు.

నేరస్థులను అరెస్టు చేసిన తర్వాత బయటపడ్డ కథ ఇలా ఉంది. ఆ ప్రాంతంలో పాడుబడ్డ ఓ చిన్న కోట ఉంది. ఒకప్పుడు ఓ జమీందారు 13–14 మంది కన్యలను అపహరించి ఆ కోటలో బంధించి వారిని వేశ్యావృత్తిలో బలవంతంగా దింపాడు. కానీ ఒకనాడు ఆ స్త్రీ లందరూ చంప బడ్డారు. అప్పట్నుంచి ఆ కోట పాడుబడింది. ఒక తాంత్రికుడు ఆ కోటలో ఖజానా వుందని కిసనా రేబారీని నమ్మించాడు. ఆ నిధిని రక్షిస్తున్న దెయ్యాన్ని నరబలి యిచ్చి సంతృప్తి పరచాలని తాంత్రికుడు అతనికి సలహా యిచ్చాడు. కిసనా ఒంటరిగా ఈ పని చేయలేక మదన్ సునాల్‌ను భాగస్వామిగా చేర్చుకున్నాడు. మదన్ సునాల్ బాబూలాల్ అనే తన మిత్రుని ఈ పథకంలో చేర్చుకున్నాడు.

మనిషి పుర్రెలోంచి తాజా రక్తం తెచ్చే బాధ్యత మదన్, బాబూ స్వీకరించారు. 17 నవంబరున బాబూలాల్, నిమ్మరసం యిస్తానని ఆశ చూపి పవన్‌ను దగ్గర్లో వున్న పొలంలోకి తీసుకు వెళ్ళాడు. పొలం చేరగానే మదన్, బాబూ బాలుని మెడ గట్టిగా పట్టుకుని, తల మీద కత్తితో గాయం చేసి తల క్రిందులుగా శరీరాన్ని వుంచి ఒక బాటిల్‌లో రక్తాన్ని పట్టారు. శవాన్ని దుప్పట్లో చుట్టి నూతిలో పారేసారు. ఆ తర్వాత అనుష్టానం పూర్తి చేసేందుకు పండితుల వారి దగ్గరకు వెళ్ళారు. అనుకున్న అనుష్టానం పూర్తి అయిన తర్వాత నేల తవ్వగా బయట పడింది ఓ బండరాయి. పండిత్ మోహన్ మహరాజ్ దానినే "మాతా శిల" అని చెప్పి ఇంకా మానవ రక్తం కావాలి. అప్పుడే "మాతా శిల" సంతృప్తి చెందుతుందని నమ్మించాడు. రెండవ బలి పశువుగా వికాస్‌ను చేయబోయి వారు పట్టు బడ్డారు.

అసలు పవన్ హత్యకు 21 రోజులు ముందు జాకీర్ అనే ముస్లిం బాలుని శవం స్మశానంలోని నూతిలో కనబడింది. 5 సం.ల జాకీర్ మతిస్థిమితం సరిగా లేనివాడు కావటంచేత నూతిలో పడ్డాడని భ్రమించి అందరూ ఊరుకున్నారు. 26 నవంబరున మరో బాలుని అపహరించాలని ప్రయత్నించారు. కానీ పిల్లవాడు దుర్మార్గుల బారి నుండి తప్పించుకుని పారిపోయి యింటికి చేరుకున్నాడు.

మత కలహం చెలరేగక ముందే హంతకులు పట్టు బడ్డందుకు గ్రామస్థులు సంతోషించారు. అపార్థం వల్ల జరిగిన అనర్థానికి గ్రామస్థులు పశ్చాత్తాప పడ్డారు. 21వ శతాబ్దం లోకి వెళ్ళే ముందు కూడా "నరబలి" జరుగుతూంటే ఎవరిని తప్పు పట్టాలి. మూఢ నమ్మకాలను విశ్వసించే ప్రజలనా, వాటిని అరికట్టలేని ప్రభుత్వాన్నా?

అపరాజిత

# అమృతాంజన్
# గ్రైప్ వాటర్




పాప ఆరోగ్యానికి,
సంతోషానికి దివ్యామృతం

అజీర్ణం, వాయువు, కలతనిద్ర, వాంతులు, విరేచనాలవంటి బాధలు వెంటనే తగ్గిపోతాయి. ఆకలి, జీర్ణశక్తి బాగా వుంటాయి పాపాయి ఆరోగ్యం బాగుపడుతుంది.

**అమృతాంజన్ లిమిటెడ్**
42-45, లజ్ చర్చ్ రోడ్డు,
మద్రాసు 600 004

**Amrutanjan Limited**





# దూరదర్శనం

లత

## పిల్లలతో చెలగాటం - పెద్దలకే ఇరకాటం

అనే పరమ పనికిమాలిన నాటిక ప్రసారం అవుతున్నది.

చిత్రం ఆత్రేయగారే వ్రాసింది- విపరీతమైన యాసభాష "ఏదంటన్నావ్రా చెప్పేహే" లాటి యాస మా క్రిష్ణా జిల్లాలో అడుగు వర్గాలూ, బడుగు వర్గాలూ కూడా ఈ భాష మాట్లాడరు. ఇహ రామదండు అనే పిల్లమూక అబద్ధాలు చెప్పి ప్రెసిడెంటు దగ్గరా కనకయ్య అనే మరో ప్రత్యర్థి దగ్గరా డబ్బు తీసుకుంటారు. ఇంత దిక్కుమాలిన నాటిక ఆత్రేయ వ్రాయటం కన్నా మానివేస్తే బాగుండేది.

## స్వరరాగసుధ

రెండో భాగం సప్తస్వర- ఖరహర ప్రియజన్యమైన భైరవి రాగంతో గాయత్రి అనే అమ్మాయి వీణావాదనం - అలమేలు మంగని సకలగుణాభిరామ అన్నట్లుగా గాయత్రి ముద్దుగా వాయిస్తుందన్నారు మురళీగారు. కనక మా బోటి సంగీతం రానివాళ్ళం ఒప్పుకు తీరాలి.

తరువాత మంజూభార్గవి నృత్యం నాకు నచ్చింది. నృత్యం అంటే వెలపరం పుట్టిస్తున్న టి. వి. వారు ఒక మంచి నృత్యం చూపించారు. గాయత్రి వీణ శాస్త్ర కట్టుగానే ఉన్నట్లుంది గాని.... జీవ రహితంగా ఉంది ఎందుకనో?

## కష్మాకస్

రచని అప్‌జీ ఇందులో ఒక అవిటి పిల్ల చదివి పెద్ద లాయరయి తన స్నేహితురాలి భర్త మొదటి భార్య బ్రతికుండగానే తన స్నేహితురాల్ని వివాహం చేసుకున్నాడన్న కేసుని వాదించి అతనికి పదేళ్ళ శిక్ష పడేట్లు చేసింది. అంటే అవిటి వాళ్ళయినా జీవితంలో నష్టపోరు అనే ఆత్మ సంతృప్తి ఇచ్చారు. ఇందులో మయూరి ఫేమ్ సుధా చంద్రన్ లాయరుగా, నీనా గుప్తా స్నేహితురాలిగా వేశారు. సుధా చంద్రన్ మయూరికీ ఇప్పటికీ లావయింది. ఇది నిజ జీవితంలో కథ అంటారు. సుధా చంద్రన్ జీవితం వేరేమో? ఏమయినా ఫరవా లేదు.

## అమీర్ ఖుస్రూ

నాటిక. సమర్పణ రాజబన్సు ఖన్నా.

ఉత్తరప్రదేశ్‌లో పటాళియా గ్రామంలో జన్మించాడు అమీర్ ఖుస్రూ- మౌలానా తాజుద్దీన్ అతని గురువు – కవి.

కొందరు పిల్లలు పిక్నిక్‌కి వెడుతూ మత కలహాల మధ్య ఇరుక్కుని తప్పించుకుని ఒక పాత కోటలో ఆశ్రయం పొందుతారు. అందులో ఒక ఫకీర్. రెండు కవితా ఖండికలు వినిపించి ఇవి మీరు వినలేదా? ఇవి అమీర్ ఖుస్రూవి అంటాడు పిల్లలు ఆ కథ చెప్పమంటారు- అప్పుడు కథ ప్రారంభమవుతుంది. చిన్నతనంలోనే గొప్ప కవి 'అనిపించుకుంటాడు ఖుస్రూ- అంతవరకయింది. నాకు గుర్తున్నంత వరకూ భాషా భేదాలూ మత భేదాలూ లేవని చెప్పిన మహానుభావుడు అమీర్ ఖుస్రూ.

## రామాయణ్

ఇంద్రజిత్ రెండో సారి యుద్ధంలో లక్ష్మణుడి మీద శక్తి ప్రయోగిస్తాడు. లక్ష్మణుడు మూర్ఛపోతాడు. రాముని దుఃఖం హృదయాన్ని హత్తుకొనేట్లున్నది.

ఇంద్రజిత్ లక్ష్మణుల యుద్ధం కొంచం సాగతీస్తున్నారు. బ్రహ్మాస్త్ర ప్రయోగానికి రాముడు లక్ష్మణుడికి పర్మిషన్ ఇవ్వకపోవటం. భూమిని మోస్తున్న శేషుడు లక్ష్మణుడిని నొక్కి పెట్టి ఇంద్రజిత్‌ని ఎత్తలేక పోవడం. ఇవి బాగానే ఉన్నాయి. అందరూ అన్నట్లు కొందరు వ్రాసినట్లు విసుగ్గా లేవు. కాని సీత అరక్షణం కనిపించినా ఘోరంగా ఏడవటం బాగా లేదు.

## సినిమా తీసి చూడు

చివరి భాగం అనుకుంటాను. తులసిని అత్తగారూ మొగుడూ కిరసనాయిలు పోసి చంపారు.

వెంటనే ఒ కోర్టు సీను అందులో 'పబ్లిక్ ప్రాసిక్యూటరు కూతురు విషం పుచ్చుకుంది. తులసి చెల్లెలు బోనులో నుంచుని వాళ్ళక్కయ్య పెళ్ళి చేసుకోమంది కనక వ్యభిచారం చేసి కట్నం డబ్బు సంపాదిస్తున్నది కాబోలు. సినిమా తీసి చూడు. టైటిలుకి, ఈ దిక్కుమాలిన చావుకీ సంబంధం లేదు. కట్నం చావుల గురించి వేరే సీరియల్ తీసి పేపర్లతో బాటు టి. వి. కూడా మనుషుల్లో కాఠిణ్యం పెంచవచ్చును. అత్తగారు గయ్యాళిగా బాగుంది.

## ఇంతెజార్

చిన్న మాస్టర్ రమేష్ పెద్ద మాస్టరు కూతుర్ని ప్రేమిస్తాడు- మొత్తం రైల్వే జనం క్యూలో నిలబడి రమేష్ బాబు మంచివాడని చెప్తారు- చిన్న మాస్టరుని అతగమని చేస్తే ఇంటికి పోయి - తనేటికలుపుతానని కప్పులన్నీ ఖంగారు చేస్తాడు. ఇక ఆఫీసులో అదనపు పనులు చేయబోయి పెద్ద మాస్టరు చేత చీవాట్లు తింటాడు. చివరకి ఆ అమ్మాయిని ఎస్కార్ట్ చేసి తల్లిదండ్రులకు గుడ్ నైట్ చెప్పి వస్తాడు అప్పుడే కదే గొప్ప ప్రోగ్రెస్ అనుకోవాలి. మొత్తానికి ఈ నాటిక జీవన్ పాత్రలతో సహజ సుందరంగా ఉంది. ఇన్నాళ్ళయినా పాడయిపోలేదంటే ఇది మంచి నాటికే అనాలి.

ప్రముఖ సంగీత విద్వాంసులు, హైదరాబాద్ జిల్లె కమ్యూనికేషన్స్ డైరెక్టర్ శ్రీ కె. మురళీకృష్ణ గానం చేసిన తూము నరసింహదాసు కర్తనల కాసెట్‌ను ఇటీవల హైదరాబాద్‌లో విడుదల చేస్తున్న ప్రముఖ సంగీత విద్వాంసులు డాక్టర్ మంగళంపల్లి బాలమురళీకృష్ణ



# నిత్య నూతన సీరియల్




## ఇఱువదియవ అధ్యాయము

(గత సంచిక తరువాయి)

ఒక్క సంవత్సరము గడచెను. ఊరిలో ఉన్న యిండ్లెచ్చటి వచ్చుటనే ఉండును. అనంతా కాశమున ఉన్న సర్వ గోళములకును నిరంతర పరిభ్రాంతి పెట్టి ఆయా గోళములందున్న ద్రవ్యముల కేల పెట్టలేదో? వీనికి పుట్టుట, చచ్చుట మాత్రమే కల్పించెను పెద్ద పెద్ద భవంతులన్నియు స్థిరములైనట్లు కొండరాతితో కట్టిరి. పురపాలక సంఘ సౌధ నిర్మాణమునకు రెండు లక్షలా! దానికి చలనము లేదు కాబోలు! సూర్యచంద్రుల వలె అది స్థిరమైనది కాబోలు! దాని కానుకొని మార్కెట్టు కట్టించిరి. వేణుగోపాలస్వామి వెనుకకు తిరిగి చూచుకొనెనా! తన పూర్వ కథ స్మృతికి వచ్చుచున్నది. ప్రథమావతారమేమని ఎత్తెనో?– "బహుస్యా" మితి కామన చేత– నా బహు రూపములు చచ్చి ప్రేలాడుచుండెను. ఆ వాసన బ్రాహ్మణ వీధికి తగులుచుండెను. రామచంద్రరాజు కాదని పోరాడెను. అతడును, కబీరును నిద్దరే వాదించిరి. వారోడిపోయిరి. కబీరన్నాడు– "వేణుగోపాలస్వామికే లేని వాసన బ్రాహ్మణుల కెచ్చట నుండి వచ్చు?"నని. రంగారావుగారు మార్కెట్టు కట్టుటకు స్థల మచ్చుటనిచ్చిరి. ఈయవలదన్న బ్రాహ్మణులనింకొక చోట నిమ్మనుము. రాధాకృష్ణయ్య ఒకటి అన్నాడు. "జాతి తగిన ఆహారము లేక శక్తి హీనమైపోవుచున్నది. మత్స్య మాంసములు తిననిగాని జాతికి శక్తి చేరదు. దొరలను చూడుడు. వారు పదునాఱేడులు వచ్చు వఱకే మంచి దృఢ కాయులై ఉందురు. కలెక్టరులుగా మన దేశమునకు వత్తురు. మన బ్రాహ్మణులు "ఒంభూః" అని ముక్కు పట్టుకొనుటతో నశించిపోవుచున్నారు." మఱల సంవత్సరము తిరిగినది.

గణాచారి ఒకనాడు ప్రాత స్నానము చేసి శిరోజములు ముడి వైచుకొని, తెల్లని చీర కట్టుకొని, మొగమున పెద్ద కుంకుమ బొట్టు దాల్చి ఊరి వెంట బయలుదేరెను. ఆమె వేప మండలు పది ఎండిపోయినవి చేత పుచ్చుకొని బయలుదేరెను. ఆమె మొగములో ముడుతలు పుట్టి జరాచిహ్నములు కనబడుచుండెను. ఆమె వయస్సు నలుబది; పూర్వపు గణాచారులెవరును చనిపోవు వరకు ముసలివాండ్రైనది లేదు. వారికి శరీరముచేత నజరత్వము, పరంపరచేత నమరత్వము నుండెను. ఇపుడు జరాంకురము కలిగెను. ధర్మారావామెను దూరము నుండి చూచెను. శ్రవస్సన్నిధాన గత కేశములు ఫలితములై దూరము నుండి కర్ణాభరణములవలె తోచెను. పాపటలో కొన్ని వెండ్రుకలు నరసి శిరస్సున చంద్రరేఖ దాల్చినట్లుండెను. ధర్మారావు దగ్గరకు వచ్చెను. చూచెను. నిత్య బ్రహ్మచారిణి, యీమె శిరోజములు ఫలితములగుటయే చమత్కారముగా ఉన్నది. ఆమె ధర్మారావును చూచి "కష్టములెట్టి వారికైనను శరీరములోని శక్తిని సడలించును" అనెను. "స్వామి యింక నీ వాసన యోర్వలేడు" అనెను. అని, దీర్ఘ దీర్ఘముగా అడుగులు వేయుచు పురపాలక సంఘ సౌధాభిముఖయై చనెను. ఆమె ఎన్నడును శీఘ్రముగా నడువదు. మఱి యెవ్వరితోడను మాటాడదు! వేపమండ లూరెల్లబడెను మార్కెట్టు ముందు, సంఘ సౌధము ముందు ఊరికి దక్షిణమున ఉన్న పేటలలో ఆమె చేతికి వచ్చినట్లెల్ల వదలెను. అది వఱకు గణాచారి బయలుదేరినదనగా ఊరిలో సందడి అయ్యెడిది. బాలురామెచుట్టును ప్రోగు పడెడివారు. ఇప్పుడామె యొక్కతియే నడుచుచుండెను. ఆమెకొక చోట పసిరిక కనిపించెను. మునుపామెను చూచి పారిపోవు వాడామె వంక చూడకుండ నెమ్మదిగా మలుపు తిరిగిపోయెను. మరియొకచోట దేవదాసి కనిపించెను. దేవదాసికి ఒడలు తెలియుచున్నట్లు లేదు. మోహినీ దేవతవలె తనువెల్ల సింగారించుకొని, భ్రూగత దృష్టియై నడచుచున్న పాదములు రాజహంసలకుంగుల స్వాములన్నట్లు ప్రకాశించగా గోచిపోసి కట్టిన చీర వలన జంఘలు వరి వెన్నుల వలె, లేత మొక్కజొన్న పొట్టలవలె, గొలవిడువని యరటి మొవ్వు వలె, విరుగని క్షీరసాగరపు కెరటముల వలె, తన్మయత్వ రేఖలవలె నుండెను. ఆమె వక్షోభాగము పరిపూర్ణతవలె, ననంతత్వమువలె, సర్వ దేవతా నివాస భూములైన మేరుశృంగద్వయము వలె, పరిభూత కువలయాపీడనామక గజకుంభముల వలె, నిర్గుణుడు సగుణుడైన భగవంతుని కిష్ట దైవతము వలె భాసించెను. ఆమె కంటి యందపాంగములు లేవు. దృష్టి నాసామూలమున కొత్తుకొని, భ్రూ మధ్యమున ముడివడుచుండెను. నడచినంత మేర తూలిపోవుచున్నదో అన్నట్లుండెను.

గణాచారి ఆమె కనబడినంతనే చేతనున్న నాలుగైదు వేప మండలు వెనుకకు దాచుకొనెను. గణాచారి ఒక తన్మయత్వము భజించెను. దేవదాసి కదలిపోయెను. గణాచారి ఊహించెను. "వేపమండలు కాసాపేటలో పడలేదు." గణాచారి తక్కిన వేపమండలు బ్రాహ్మణ వీధిలో వదలెను. ఆమె దారినామె పోయెను. అనాడెల్ల ఆమె భోజనము చేయలేదు.

చంద్రారెడ్డి ఆ మధ్యాహ్నము గణాచారి యింటికి పోయెను; ఆమె ఆయన వంక చూడలేదు. రెడ్డి "ఒక వేప మండ నా యింటి యొద్ద విసరరాదా" అనెను. గణాచారి మొగమున నర్థ నిమీలిత నేత్రముల నందు నుండి ఒక వికృత మందహాసము అఱ మూసిన తెల్ల కలువలోని కింజల్కపు త్రాడువలె వెలికి వచ్చెను. రెడ్డి తనదారిన తాను పోయెను. అవి

జరిగిన కథ – 51 :– రంగారావుగారు దొరసానిని వివాహం చేసుకుంటాడు. దేవదాసి ప్రతిరోజూ దేవాలయానికి పోయి స్వామిని సేవిస్తూ ఉంటుంది. ధర్మారావుకు కొడుకు పుడతాడు. గణాచారికి, పసిరికకు ఊరి పరిస్థితులు క్రమను కలిగిస్తాయి. ధర్మారావు పంకజమ్మ గారింటిలో భారతీయతత్వం గురించి ఉపన్యాసాలు అప్పుడప్పుడూ ఇస్తూ ఉంటాడు. రాధాపతి, చక్రవర్తి వంటి వారిని ఆ ఉపన్యాసాలు బాధిస్తూ ఉంటాయి. పశుపతి కూతురు అరుంధతి ధర్మారావు భార్యకు చాలా దగ్గిర అవుతుంది. అరుంధతి ఆరోగ్యం చెడిపోతుంది. మంగమ్మ ధర్మారావుకు నాటకం టిక్కెట్టు పంపుతుంది. నాటకం గురించి ధర్మారావు తీవ్రంగా అధిక్షేపిస్తాడు. నాటక లక్షణాలను గురించి ధర్మారావు పంకజమ్మగారి ఇంటి వద్ద వివరిస్తాడు.

### వేసగి చివరి దినములు

పగలెల్ల ఎండలు మండి, యెండ బోసిన వడ్లు పేలాలు వేయించెను ప్రొద్దు క్రుంకు వఱకు ఉత్తరపు గాలి విసరెను! అది విసరినంత సేపు మత్స్య మాంస దుర్వాసనామిళితమైన వెచ్చని వాగ గాలి పేట పేట అంతయు దుర్వాసనాభరితము చేసెను. కాఫీ హొటళ్ళు "మేమున్నా"మనెను మరల దక్షిణపుగాలి తిరిగి ఫ్యాక్టరీలో ఎండబోసిన




ఉప్పుడు బియ్యపు దుర్వాయువు తన ప్రభుత్వము సాగించెను. పురపాలక సంఘము వారి డబ్బాలలో ఉన్న పులి విస్తరాకులు గ్రామ సూకరముల చేత కదలింపబడి "మేము లేదున్నా"మనెను ఎడమెడము లేక కట్టబడిన యిండ్లలోనే గాలియు దూఱలేదు. అవి వాయు స్తంభన విద్య మూర్తీభవించిన చోట్లు.

రాతిరిజాము ప్రొద్దు పోయెను ప్రొద్దు క్రుంకు వేళ వీచిన గాలి స్తంభించెను రాధాపతి మంగమ్మతో మాటాడుచు "నచ్చుటనేదియో తగులబడుచుండె"ననెను అది బ్రాహ్మణ వీధి జనమందరును బ్రాహ్మణ వీధికి పరుగెత్తిరి సోమన్నగారి యిల్లంటుకొన్నదని నలువురునరి అంటుకొన్న యిల్లు మతాబా వలె నిలచి కాలుచుండెను. పెంకుటిల్లు, ఆర్పరానంత వైశ్వానరుడు విజృంభించెను జనము మంటలు లేనిచోట నింటిమీద కెక్కి కడవలతో నీరు క్రుమ్మరించుచుండిరి సుబ్బన్నపేట నూతులు గ్రామములో రెండు గజముల లోతు. తోడినవారు తోడుచుండగా, జేరబోసినవారు చేరబోయు చుండగా, నరదిచ్చిన వారందించుచుండగా, తడిపినవారు తడుపుచుండిరి! ఏమి తడుపుట? కృపీటయోని చిమ చిమలాడి, బుసబుసలాడి, భగ భగలాడి, ధగధగలాడుచుండెను పెడెకట్టునకు, వాసమునకు దిగగొట్టిన మేకులు పెటేలుమని వాసము పగిలి యశనిపాతము వలె మఱొకచోటికి దూకుచుండెను ఈ మేకులు పోయి యెచటపడునో, మఱే కొంప అంటుకొనునో అని జనము- ప్రక్కనున్న యిండ్ల వారు- తమ సామానులన్నియు బయటికి పట్టుకొనుచుండిరి. అంటుకొన్న యిండ్ల ప్రక్కనున్న యిండ్లవారింటి కప్పుల మీదికెక్కి చూరులు తడుపుకొనుచుండిరి చుట్టు ప్రక్కలోనున్న పందిళ్ళు పాకలు కూలద్రోసిరి. అవియు అంటుకొని మండుచుండెను. కాని యది లేచి యింకొక యింటి మీద పడదు- చంద్రారెడ్డి తండ్రి భాగయ్యరెడ్డి ఆయన చనిపోయి పది యేండ్లయ్యెను అంత ధనవంతుడయ్యు నతడు గ్రామములో నగ్నిహోత్రమంటుకొని అనగా















తాను పోయి అంటుకొన్న యింటి నది కప్పున నిలుచుండి నిప్పార్పెడి వాడు అంత వాడెక్కగా మనకేమని చీదవారెల్లరును సహాయులై అంటుకొన్న నిప్పుఱ నిముసములో నార్పుచుండిరి ఇల్లు తగులబడిన వానికి మరునాడు కృష్ణమనాయుడు మఱల నిల్లు వేయించు చుండెను ఇప్పుడు భాగయ్య లేదు ప్రభువు లేదు– సోమన్న యిల్లు వీతిహోత్రుడు నాలుగు మూలల సుడివోలి తిరిగి, త్రవ్వుకొని పోవుచున్నట్లు సార పెట్టెను. హుత భుజునకు సోమన్న యిల్లు పురోడాశమన్నట్లుండెను ఎఱ్ఱని గుడ్డలు కోణాకృతిగా కత్తిరించి జెండాలు కట్టినట్లు విభావసుడు తన ప్రభుత్వము చెల్లించెను పెంకులు, వాసపు బద్దలు ఖణ ఖణమని మ్రోగుచు, లేచిపోవుచు తూలిపోవుచు, భయంకరములయ్యెను సోమన్న యొక మూల వీధిలో కూర్చుండి "నా ధనమంతయు నింటిలో నన్నే ఉన్నది వెండి, బంగారమైన గాదు, కరగి ముద్దయగుననుటకు అంతయు కాగితములు, నోట్లు, దేవుడు నా పొట్ట మీద కొట్టినాడు!" అని యేడ్చుచుండెను లయ హేతువైన తాము సగుణమధికముగా గల వారు కొందఱచట నిలుచుండి "వీడెంత మంది పొట్టల మీద కొట్టెను? కసాయి వానివలె తిరుగు వడ్డీలు, జంట వడ్డీలు, రూపాయి తొమ్మిదణాల చొప్పున గడించి, లోకుల సొమ్మంతయు పొట్టన పెట్టుకొన్నాడు దేవుడు చూచియే మిట్టించినా డనిరి మరి ఒకడు "కట్నము తీయవలయునని కూతుండ్ర నందరను రెండవ పెండ్లిండ్ల వాండ్రకే యిచ్చెను" అనెను అంతలో అగ్ని పర్వతము నుండి భగ భగలాడుచున్న యొక సగము ద్రవించిన లోహపు ముద్ద మహా వేగ నిర్యాతమై యాకసమున దూకినట్లు, మేరు పర్వత శిఖర మొకడు లేచి ఆకాశ యానమారంభించినట్లు, వారి యింటి నుండి ఒక పెద పెద లేచి దేవాలయముల మీద నుండి దూకి ఎచటనో పడెను "ఎచట పడె నెచట పడె"నని జనము గగ్గోలు పడిరి, ఆ వైపున ఇండ్లు లేవు కదా అని ఊరకుండిరి సోమన్న యింటిలో నాశుశుక్షణి మహా ప్రభువై పెండ్లి చేసికొని బంధువుల యిండ్లకు బోనాము పెట్టెలలో పెట్టి భోజనములు పంపించినట్లు మరియొక పెళ్ళ దక్షిణమునకు విసరెను అచ్చట రెండిండ్లు ముట్టుకొని వాయువ్య దిశకు భాగము పంచి పెట్టెను జనమటునిటు త్రొక్కిళ్ళు పడి పరుగెత్తి చూచిరి మార్కెట్టు తగులబడిపోవుచుండెను దూది బుంగలంటు కొన్నట్లు, మహా వన మధ్యమున శుష్క తరువులు తగులబడిపోవుచున్నట్లు, సూర్యోదయమైనట్లు, గ్లాస్కో మల్లుల మీద పండు చెంగావియద్దినట్లు, దశకంఠ హిరణ్యకశిపు నరకాసురాది రాక్షసులు తమ పతాకలెత్తినట్లు రక్తచ్ఛాయా తిరస్కృత సుబ్రహ్మణ్యేశ్వర ద్విసహస్ర కుపిత నేత్ర కోణమై యగ్ని జ్వాలలు చెలరేగెను హిరణ్యరేతసుడు ద్రవ్యమంతయు తినజొచ్చెను ఎవరి యిండ్లు వారు చూచుకొను వఱకే సరిపోయినది మార్కెట్ దిక్కు విచారించిన దిక్కు లేదు బ్రాహ్మణ వీదిలో సోమన్న యిల్లు పూర్తిగా నాశనమైనది మరి రెండు మూడిండ్లు ముట్టుకొన్నను వెంటనే యార్పివేయ బడెను ఆగ్నేయ వాయువ్య దిశల యందు పూరి కొంపలెక్కువ కడవలతో నీరు క్రుమ్మరించిరి అగ్ని యెచ్చటిదచ్చట జల్లారెను రెండు గంటలగు వఱకు నంతయు చల్లబడెను పేద వారి పాకలు పది పదునొకండు నష్టమైనను ప్రాణ నష్టము జరుగలేదు మంగమ్మ యిల్లంటుకొనెను సినిమా జనమంతయు వచ్చి ఆర్పెను ధర్మారావు, భార్యయు తాను, పిల్లవాడును, దల్లియు, బయటకు వచ్చి నిలుచుండిరి అతని యింటి మీదనెక్కి ఎవరును నీరు పోయలేదు సావిత్రమ్మగారు సామాను బయటికి తెత్తుననియెను ధర్మారావు తక్కిన యే వస్తువును తేనీయలేదు అతడన్నాడు "ధర్మము, అగ్ని, తస్కరుడు, రాజు– వీరు నలువురన్న దమ్ములు ధర్ముడందరిలో పెద్దవాడు అతని కవమానము జేసినచో తక్కిన మువ్వురకును కోపము వచ్చును అగ్ని తగులబెట్టును తస్కరుడు దొంగలించును రాజు రాబడి పన్నని, యదనపు పన్నని లక్ష విధములుగా ధనము హరించును మనము ధర్మావమానము చేసినచో కానిమ్ము పాతికవేల యిల్లే పోయినప్పుడు వంద రెండు వందల రూకల సామాను రక్షించునా?" అని

ధర్మారావు నిల్లు సోమన్న యింటికి దగ్గఱ గణాచారి యిల్లు ముట్టుకొనెను ఆర్పిరి ఉషర్బుధుడు తెల్లవారు వరకు మార్కెట్టులోను, సోమన్న యింటిలోను మండుచునేయుండెను కాఫీ హొటళ్ళు నాలుగును తగులబడినవి దుష్టాన్నము తిని, యొడళ్ళలో శక్తి లేని అచ్చటి వారు నీరు తేలేకపోయిరి ఇండ్లార్పుకొనలేకపోయిరి తెల్లవారు వఱకు పట్టణమంతయు పొగ వాసనయే కాని కడచిన నాటి దుర్వాసన పోయినది ఫ్యాక్టరీల వారు చూచుకొనలేదు, ఉప్పుడు వడ్లెండబోసిన డాబాల మీద నిప్పు పడి వడ్లన్నియు కొన్ని చోట్ల తగులబడి, కొన్ని చోట్ల చిట్టము కట్టి పోయెను మరునాడు సాయంకాలమున మలయ మారుతము చందనాగురుతరు శాఖా సమానీత ... మనోహరమూర్తియై పూల రంగనివలె ...ములలో షికారు కొట్టెను

వేసవి కాలము పోయి వర్షా కాలము వచ్చెను పట్టణము చుట్టును మాగాని అగుట చేత ప్రతి సంవత్సరము వలెనే యీ ఏడును దోమలు హెచ్చెను కురిసిన వానలు కురిసినట్లే, గ్రామ వీధుల వెంట ఇంకినంత నీరింకి తక్కిన చోట్ల

బురదయై పోయెను. పట్నపు మూర్ఖు వారు ధనవంతులు, అధికారులు కల యిండ్ల ముందు శుభ్రము చేసి, తక్కిన గ్రామమంతయు వారి యిష్టము వచ్చినట్లొదుల్తురు. రోడ్లన్నియు గుంటలై పై యిసుక కొట్టుకొనిపోయి, గుళ్ళములకు లాడము, మనుజులకు పాదరక్షలు ప్రబంధ విధానమై పోయెను. పట్నములలో ఆవు బఱ్ఱె, ఎద్దు కరవయ్యెను. ఎవనికో ఒకనికి గేదె కాని, ఆవు కాని పాలిచ్చును. నూటికి తొంబది తొమ్మండుగురు పాలు పెరుగులు కొనుటయే. నందీశ్వరుల వంటి మహా వృషభములు కల సుబ్బన్నపేటలో ఏడు వృషభములున్నవి, చూచి తీరవలయును. అక్కు మీద పుండు లేని ఎద్దు లేదు. కడుపులోని ఎముకలు లెక్క పెట్టరాని పశువులేదు. దూడ బ్రతికియున్న ఆవు లేదు. చెన్నపట్నపు తీవి యెక్కి గడ్డి దూడలు బలిసినవి. బ్రతికియున్న దూడను చూచి కూడ గడ్డి దూడ అనుకొనవలసినదే!

దేవి చీరదాకబోయినంతనే హనుమంతుని తోక సరిపోయినట్లు నెత్తురు బొట్టు తగిలినదన్నంత వఱకు గోక్షీరములు పెంచబడుచుండెను. గ్రామమంతయు వానకాలమున నుసుళ్ళు బలిసి బురద వాసనలిత్తికి చాళ్లిపోయెను. పేట ప్రజలకు వానా కాలములో చేతి కందుచున్న నీరు ముంచుకొను కష్టమైపోయెను. తోడుకొనుట లేకుండ పై నుండి పడు వర్షము బిందెలలో పట్టుకొన్న నెంత బాగుగా ఉండును! గంగానది పై నుండి ధారగా కురిసిన నెంత బాగుగా నుండును! భూమిలో నుండి నీరు చేదుకొనుట ఏమిటి! అందరకును గంగానదిని క్రిందికి దించుకొనలేక పోయినను నీటి కొళాయిలైన పెట్టుకొన్నచో జలము వేసగిలో చేదుకొను బాధ, వర్షావేళ ముంచుకొను బాధ తప్పిపోవును. కొళాయి క్రింద బిందె పెట్టుము. అది నిండును. కొళాయి క్రింద గూర్చుండుము. దాని అంతట అదే స్నానమగును. మనుజాలకు గల నీరటులుంచి పట్నాధి దేవత కొళాయిలు లేకపోవుట నలుగురిలో తన గౌరవము తక్కువను కొన్నది. సాటి పట్నములంతర్నల వాహినులవలె నీటికొట్నములతో తళ తళలాడిపోవుచున్నది, తానేమో పేదరాలి వలె అతిథులకు నీరైన నొసగ లేకున్నది. పట్నమింకొకటి అనుకొన్నది. "అతిథులు వచ్చి యిండ్ల మీద పడెదరు. వారికి బజారులలోననే కాళ్ళుగడుగుకొనుటకు, మంచి తీర్థమునకు సమకూర్చెదను." తరువాత శరత్కాలము వచ్చినది. ఆ రెండు నెలలో చీకటులేర్పనట్లు అటువది దినములొకటియే వెన్నెల అయ్యెను. శరత్పూర్ణిమలు వచ్చెను, వచ్చిన శరత్పూర్ణిమలు విద్యుద్దీపము వలె వెలుగ వచ్చునా? గ్రుడ్డి వెన్నెలలు కాసినవి. సూది పడినచో గనుపడవలయును. వెలుగనగా అట్లుండ వలయును. విద్యుద్దీపములున్నచో అట్లుండును. వాని కాంతులు వెన్నెలలను పరిహసించును. చంద్రుడే విద్యుద్దీపము. అతనికి "పవరు హౌసు" సూర్యుడు. ఆ పవరు హౌసు పవళ్ళు పేటలో నుండును సరే, రాత్రులందు కూడ నుండవల యును. చంద్రారెడ్డి కార్తికపూర్ణిమనాడు దారి వెంట పోవుచుండెను. ఆయన చేతి ఉంగరము జాఱి దారిలో పడెను. ఆయిన వెదకెను. కనిపించలేదు. ఎవరినో దీపము తెమ్మనెను. వారు తెచ్చిరి. కనిపించలేదు. ఒకరు పెట్రోమాక్సు లైటు దారి వెంట తీసికొని పోవుచుండిరి. దాని వెలుగున వెదకిరి. ఉంగరము కనిపించెను. మూగినవారిలో ఒకత డన్నాడు: "ఎట్లయినను విద్యుద్దీపము విద్యుద్దీపమే!" అని. చంద్రారెడ్డి మనసున కామాట వచ్చెను.

## ష్నైడర్ ట్రోఫీ



నీటిపై తేలే విమానానికి ఏర్పాటు చేసిన ఈ అంతర్జాతీయ పోటీలని 1913లో ఫ్రెంచి జాతీయుడైన జాక్వెస్ ష్నీడర్ ప్రారంభించారు. 150 నాటికల్ మైళ్ళు సాగే ఈ పందెంలో గంటకి 340 మైళ్ళ వేగంతో బ్రిటన్ 1931లో ట్రోఫీని గెలుచుకున్నది



## సాకర్ విషాదాంతం

ప్రపంచ సాకర్ (కాలిబంతి) చరిత్రలో అత్యంత విషాదకరమైన దుర్ఘటన 1964లో పెరూ- అర్జంటినాల మధ్య జరిగిన పోటీలో సంభవించింది ఆట ముగిసేందుకు మరో 6 నిమిషాలు ఉండనగా పెరూ చేసిన గోల్‌ని అనుమతించక పోవటంతో భయంకరమైన అల్లర్లు చెలరేగాయి వాటిని అదుపు చేయటానికి పోలీసులు బాష్పవాయు ప్రయోగం చేసారు కానీ ఆ అల్లర్లలో 300 మంది మరణించటం, 500 మంది గాయపడటం జరిగింది



దేవదాసి సర్వాలంకార శోభితయై దేవాలయమునకు పోయెను ఆమె వెన్నెలలో నచంద్ర చంద్రమః కాంతిపరి దీప్తములైన త్రిలోకముల యందు సంచరించుచున్న లక్ష్మీదేవివలె నుండును ఆమె సౌందర్యము పంచ భూతముల యందు నిండి పరిభోగించుచున్న విష్ణుదేవునకు విద్యుద్దీపములు లేవనిపించలేదు చంద్రమః కాంతి పూరములో తెల్లని చీరతో నడుచుచున్న ఆమె పాల కడలి కెరటముల మీద నూగుచున్న క్షీరసాగర కన్యవలె విష్ణువునకు తోచెను ఆముదపు దీపముల వెలుగు మాత్రమే ఎరిగిన వేణుగోపాలస్వామికి వెన్నెలయు లేదు- చీకటియు లేదు ఆయన ప్రత్యఙ్ముఖుడై తనలో తానే చూచుకొనును గుడియే ఆయన ఆయనయే గుడి ఆ జాతి బొమ్మయు, ఆ జాతి బొమ్మను వలచిన యీ నాతి బొమ్మయు వెన్నెలలకు సంతోషింతురు, సంతోషించ రు, తృప్తి పడెదరు, తృప్తి పడరు, సుబ్బన్నపేట ప్రజ మాత్రము వెన్నెలలకు సంతోషించలేదు, తృప్తి పడలేదు

శిశిరర్తువు వచ్చినది. పురపాలక సంప సమావేశము జరిగినది కొళాయిలు, విద్యుద్దీపములు కావలయునని ఒక మిషనరీ తీర్మానము పెట్టెను రామచంద్రరాజు ప్రతిఘటించెను "మన ఊరిలో నీరు చేతితో అందుకొనవచ్చును, కొళాయిలైనచో రెండు చెఱువులు త్రవ్వించవలయును, ఇంజనులు తెప్పించవలయును అది బోలెడంత కామాటము రెండు లక్షలు మఱల నూరి మీద వసూలు కావలయును ఇంత వఱకు సంప సౌద నిర్మాణమునకైన అప్పు తీరలేదు దీనికి, విద్యుద్దీపములకు కలసి నాలుగు లక్షలగును ఇంక ఏబది యేండ్ల వరకు మనమీ అప్పు తీర్పలేము ఇది

## వేయిపడగలు

న్యాయము కా"దనెను ఆ మిషనరీ లేచి "సుబ్బన్న పేట మీద మునుపటి కన్న నిప్పుడెక్కువ పన్ను వచ్చుచున్నది గృహములెక్కువైనవి ఉద్యోగులెక్కువైనారు పురపాలక సంపము రాబడి పది యేండ్ల పూర్వముకన్న ఇప్పుడు నాలుగు రెట్లయినది అందుచేత నీ అప్పు పది ఏండ్లలోనే తీరిపోవును" అనెను అంతట కబీరు లేచి "ఇది వరకు పురపాలక సంప సౌదము మీదగాని మార్కెట్టు మీదగాని మూడు లక్షలు పెట్టితిమి దాని వడ్డీ యనవసరముగా రాచరికము వారికిచ్చుచుంటిమి మూడు లక్షలు తెచ్చి పాతిక యేండ్లలో పది లక్షలనిచ్చుచుంటిమి అట్లే అప్పు తెచ్చి యీ పనులు చేసినచో మనకు వడ్డీ కూడ నష్టమగుచున్నది ఈ నాలుగు లక్షలు పన్నుల ద్వారా వసూలు చేయుచుందుము ఎన్ని ఏండ్లలో వసూలగునో చూతము అప్పుడే నీటికొట్టములు, విద్యుద్దీపములు పెట్టుకొనవచ్చును' ఇప్పుడే డబ్బు తెచ్చి యీ పని చేసితిమా, అప్పు తెచ్చినది నాలుగు లక్షలు, అప్పు తీర్చు నాటికి పది లక్షలగును నేను చెప్పినట్లు చేసి ప్రజలకు లాభమో, నష్టమో? వారు నాల్గు లక్షలే యీయవలయును అప్పు తెచ్చి చేసినచో వారు పది లక్షలీయవలసి వచ్చును" అనెను అతని వాదన అరణ్యరోదన మయ్యెను మఱొక సభ్యుడు లేచి "ఇంక పది ఏండ్లకు వచ్చునో చచ్చునో' ఇప్పుడు పట్టణమునందు ప్రజలు నూతులలోని నీరు త్రాగుట వలన చలి జ్వరములు వచ్చుచున్నవి, నూతులలో నీరు మురిగిపోవుచున్నది ఈ నీటి వలననే కలరాలు, మశూచికములు ప్రబలుచున్నవి నీటి గొట్టముల ద్వారా అయినచో

ఎప్పుడే వ్యాధి యున్న ఆ వ్యాధికి ప్రతిక్రియలైన కొన్ని యౌషధములు నీటిలో కలిపి పంపించవచ్చును అప్పుడు ప్రజలారోగ్యవంతులుగ ఉందురు అనెను కబీరు "అప్పుడు నీరు మన పెదవుల దాక వచ్చు వఱకు సూర్యరశ్మి స్పర్శ కలిగియుండును అప్పుడింజనుల వేడి గొట్టములలో చాలసేపుండును- యీ దోషముల వలన నీటిలో నిప్పుడున్న మంచి అప్పుడుండదు మర బియ్యము వచ్చినవా? దీనికి తోడు గొట్టముల నీరైనచో అగ్నిహోత్రము తిన్నట్లే, అగ్నిహోత్రము త్రాగినట్లే ఈ మర బియ్యము మొదలు పెట్టిన తరువాత ఇనుము వంటి మనిషిని నేనే తగరము వంటి మనిషినైనాను" అనెను అందరును చప్పట్లు కొట్టిరి నవ్విరి ఒక హూణ విద్యాధికుడు "కబీరు మాటాడుట తార్కికముగా లేదు సభలో మాటాడవలసినట్లుగా కూడ లే"దనెను వాదోపవాదములు యదేచ్ఛముగా జరిగెను రామచంద్రరాజు లేచి "రెండు నొక్కసారి కాక, ముందు కొళాయిలు పెట్టి, తరువాత ఒక పదేండ్లు పోనిచ్చి విద్యుద్దీపములు పెట్టవచ్చు"ననెను మఱి ఒకడు లేచి "కొళాయిల కేమి? నీటికిబ్బంది లేదు కదా' చీకటి రాత్రులు గడచుట కష్టముగా ఉన్నది అందులో దొంగలెక్కువైరి విద్యుద్దీపములే ముందు కాలయు"ననెను కబీరు "ఈ నీరు త్రాగుట వలన జనులకు వ్యాధులు వచ్చుననిరి కదా' వెలుతురు, మరికొన్ని యేండ్లు పోయిన తరువాత చూచుకొనవచ్చును మొదట వ్యాధులకు ప్రతిక్రియ చేసికొనవలయును అందుచే కొళాయిలే ముందు పెట్టుకొనవలయును" అనెను ఒక మిషనరీ లేచి "త్రాగుచున్న నీరు కాచి పుచ్చుకొనవచ్చును వలసినచో నూతులలో మందులు కలుపవచ్చును




ప్రపంచ హెవీ వెయిట్ బాక్సింగ్ ఛాంపియన్‌లలో ఎక్కువ కాలం బతికిన వ్యక్తి జెస్ విల్లార్ (అమెరికా సం. రా). 1968లో చనిపోయే నాటికి ఆయన వయసు 86 సంవత్సరాల 311 రోజులు.

విద్యుద్దీపములే ప్రధానముగా కావలయు"ననెను. కబీరు "అట్లయినచో కొళాయిల అవసరమే లేదు; విద్యుద్దీపముల మాట తరువాత చూడవచ్చు" ననెను. చివరకు వోటింగు పెట్టిరి. రెండును కావలయుననియు, నాల్గు లక్షలప్పు తచ్చి, పని సాగించవలయుననియు, తీర్మానములు గెలిచెను. అందరును ఎవరి యిండ్లకు వారు పోయిరి. కబీరు, రామచంద్రరాజు లిద్దరును కలిసి వచ్చుచుండిరి.

రామ: కబీరూ! మనమీ సభలో ఎందుకు?

కబీరు: మామగారూ! మనమిద్దరము కూడ లేకపోయినచో సంఘ సభ కేకగ్రీవత కలుగును. ఊరంతయు పట్టణమైన తరువాత దేవుడొక మూలబడి ఉన్నట్లే, మనమున్నామనిపించుకొనుటకు. బ్రతికియున్నచో క్షయ వ్యాధియు కుదురునేమో! కనుక ప్రాణములుండుట వాంఛించదగినది.

రామ: నీ తత్త్వము బాగుగా ఉన్నది.

కబీరు: చంద్రారెడ్డిగారు మన పక్షమా? వారి పక్షమా?

రామ: ఆయన అధ్యక్షపదవి పక్షము.

కబీరు: ఒకసారి మీరు సంఘాధ్యక్షులు గండు, ఒక ఆట ఆడించెదను.

రామ: ఏమి లాభము? కాలము వారిది.

కబీరు: అవునుగాని, అది ఎట్లుండునో ఒకసారి చూపింతము. ఇంక రెండేండ్లకుకాని ఎన్నికలు మరల రావు- ఇప్పటి నుండి మనము ప్రయత్నము చేసి ప్రతి వార్డులో మనకనుకూలురైన వారిని నిలుచుండబెట్టించి ప్రయత్నము చేయుదము. ఇది రహస్యము. మనకిద్దరికే తెలియును. మనము పని చేయుచున్నప్పుడు గూడ మన ఊహలెవరికిని తెలియరాదు- రామచంద్రరావు జోమ ముడి నాసామూలముగా కుదించి తెప్పల క్రింద నుండి చీకట్లలోనికి చూచెను. చీకట్లువిశ్వలముల్లై ఉండెను.

పని ఎచ్చటి దచ్చట ప్రారంభమయ్యెను. అప్పు తేబడెను. రాచరికమువారివంతు వారిచ్చిరి. వలసిన యింజనులు, గొట్టములు, తీగెలు, పనిముట్లు- సర్వమును దెప్పించుటకు చంద్రారెడ్డి నానా దేశముల కంపెనీల నుండి "కొటేషన్సు" తెప్పించెను. ఇంగ్లీషు కంపెనీ ధరలకన్న అమెరికా ధరలు తక్కువ. వాటికన్న జర్మనీ ధరలు చవుక. మొత్తము మీద భేదము లక్ష రూపాయలు కనిపించినది. చంద్రారెడ్డి "ఇంజనులు జర్మనీ నుంచి తెప్పింతమనుకొనెను. ఆర్డరులన్నియు వ్రాసి తయారుగా ఉంచెను. విద్యుచ్ఛాక యింజనీరు వద్దకు స్కీమంతయు పంపించెను. ఇంజనీయరు స్కీమంతయు తాను తయారు చేసి చంద్రారెడ్డికి పంపించెను. రెడ్డి పంపించిన దానికి, ఇంజనీయరు పంపించిన దానికి సంబంధము లేదు. ఇంజనీయరు పంపించిన స్కీములో వస్తువులన్నియు ఇంగ్లాండు నుండియే తెప్పించుకొనవలయునని ఉన్నది. రెడ్డి "అవి ప్రియము కదా, పురపాలక సంఘమునకు నష్ట"మని వ్రాసెను. ఇంజనీయరు "వస్తువుల గట్టి చూచుకొనవలయును. అదియుగాక, మీరింగ్లాండు నుండి వస్తువులు తెప్పించినచో మన రాచరికము వారింగ్లాండు దేశస్తులాయెను. వారు మనకు కొంత ధనమిచ్చు చుండిరాయెను. వారి కభిమానమప్పుడు మనమీద ఎట్లుండు"నని వ్రాసెను. చంద్రారెడ్డి ఆలోచించెను. "అవును! రాచరికము వారు మనకు కొంత ధనమిచ్చుచున్నప్పుడు వారి దేశము నుండి తెప్పించుటయే న్యాయ"మని తోచెను. ఆ రాచరికము వారిచ్చు ధనమెచ్చటిదో!

చెఱువులు త్రవ్వుటకు స్థలము కావలసి వచ్చెను. చంద్రారెడ్డి పట్టణ ప్రాగ్భాగమున్న తన మెట్ట నమ్మ జూపెను. ఆ మెట్ట వలన రెడ్డికి లాభమేమియు కన్పించలేదు. అందులో పైగా పాములెక్కువగా తిరుగుచుండెను. మాగాని పంట కనిపించినట్లు మెట్ట పంట కనిపించదు. మన నలువురు పిల్లలలో వారములు చేసికొను పిల్లవాడు నలిగిపోయినట్లు, మాగానికి చూపించుచున్న శ్రద్ధలో మెట్ట మీది శ్రద్ధ తగ్గిపోవును. ఆయన కది ఎట్లయినను వదలిననే చాలుననిపించినది. ఇంకొకప్పుడు ధర వచ్చునో, రాదో! అమ్మజూపినచో అంత కదుగుదురింత కదుగుదురు. ఏబది ఎకరము లేబది వేలకు పురపాలక సంఘమునకమ్మి వేసెను. అచ్చట చెఱువులు త్రవ్వనారంభించిరి. (ఇంకా ఉంది)



## హైదరాబాద్ నోట్‌బుక్ — తిరుమల రామచంద్ర

# తెలుగు విశ్వవిద్యాలయం ఉగాది ఉత్సవం

మన ధ్యేయం దేశం ముందు, తర్వాత రాష్ట్రం, సర్వులకు శ్రేయస్సుంతోషాలు కలుగాలని మన హృదయపూర్వక వాంఛ. ప్రభవ వైభవోపేతంగా వుంటుందనుకున్నాం. కాని అనుకున్నట్టు జరుగలేదు. విభవ విభవవంతంగా ఉంటుందని పంచాంగ శ్రవణం చేసిన శ్రీ మల్లాది చంద్రశేఖరశాస్త్రిగారు సెలవిస్తున్నారు. నిరుడూ వారు అలాగే అన్నారు. మానవుడు ఆశాజీవి. ఆశతో నే బతుకుతాడు. కనుక విభవ విభవవంతంగా వుండగలదనే మనం ఆశిద్దాం. పెద్దలు ధర్మార్థ కామమోక్షాలన్నారు. ఆ నాల్గింటినీ మించింది ఐదవది విధి. అది చల్లగా చూడాలి. తమ రక్తంతో భారతమాత పాదాలకు పారాణి పూసిన మహనీయులను స్మరిస్తూ, సర్వసమ వికాసం కోరుతూ, సర్వులు జాతిని విభవవంతం చేయాలని ఆకాంక్షిస్తున్నా- అన్నారు ముఖ్యమంత్రి శ్రీ నందమూరి తారకరామారావు మార్చి 18వ తేదీన రవీంద్ర భారతిలో తెలుగు విశ్వవిద్యాలయం యాజమాన్యాన జరిగిన ఉగాది ఉత్సవం ప్రారంభిస్తూ. ఈ ఉత్సవం ఉదయం 8-30కు నాదస్వరంతో వేదపఠనంతో స్వస్తివాచనంతో ప్రారంభమయింది. పిదప శ్రీ మల్లాది చంద్రశేఖరశాస్త్రి పంచాంగ శ్రవణం జరుపుతూ ప్రభవకన్నా విభవ గొప్పది. సూర్యగ్రహణంతో ప్రారంభమయిందని సందేహించ నక్కరలేదు. గ్రహణం విడిచింది. చక్కని వెలుగులతో, నూతన శోభతో ఉగాది ప్రారంభమైంది. ఈ సంవత్సరం శుక్రుడు రాజుకావడంవల్ల లలిత కళలకు అద్భుతమైన ప్రోత్సాహం వుంటుంది. ప్రజలు పరస్పర ప్రేమతో మెలగుతారు. బుధుడు మంత్రి కావడంవల్ల రాజ్యం పొరపులు లేకుండా, అవిచ్ఛిన్నంగా సాగుతుంది. సేనాధిపతి కుజుడు. పంటలు బాగా పండుతాయి. కాని ధరలు హెచ్చుగానే వుంటాయి. పరిశ్రమలు జోరుగా నడుస్తాయి. వరదల సూచనలున్నాయి, అట్టడుగు వారికి చాల మేలు కలుగుతుంది. ప్రస్తుత ప్రభుత్వానికి ఢోకాలేదు- అని అంటూ దాశరథీ శతకంలోని దం డ డ డాండ అనే పద్యం చెప్పారు. తెలుగు విశ్వవిద్యాలయం వైస్ చాన్సలర్ ప్రొఫెసర్ డాక్టర్ తూమాటి దోణప్ప స్వాగతం చెబుతూ తెలుగు విశ్వవిద్యాలయం స్వల్పకాలంలోనే చాల ప్రగతి సాధించిందని, 40 వేల పుస్తకాలున్న లైబ్రరీని నెలకొల్పిందని, ఫోర్డ్ ఫౌండేషన్ నుంచి 20 లక్షలు సంపాదించిందని అన్నారు. అయినా సాధించింది బింధువు, సాధించవలసింది సింధువు అని తమకు తెలుసునని అన్నారు. పిదప సభకు అధ్యక్షత వహించిన విద్యాశాఖామంత్రి శ్రీ పి. ఇంద్రారెడ్డి ప్రసంగించారు. తర్వాత ముఖ్యమంత్రి విశ్వవిద్యాలయ పరిశోధన పత్రిక జర్నల్ ఆఫ్ తెలుగు స్టడీస్‌ను, టాంక్‌బండ్ విగ్రహాల చరిత్రలను, శ్రీ నార్ల, శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరి మున్నగువారి జీవిత చరిత్రలను, తదితర గ్రంధాలను ఆవిష్కరించారు. తెలుగు విశ్వవిద్యాలయంలో వివిధ విషయాలపై పరిశోధనలు పలువురు దాతలు నిధులను అప్పగిస్తూ అందజేసిన ధర్మ నిధి పత్రాలను ముఖ్యమంత్రి స్వీకరించి దాతలను శాలువాలతో మెమెంటోలతో సత్కరించారు. సత్కారం పొందిన దాతలు- శ్రీయుతులు కె. వి. భూపాలరావు, ధర్మకర్త మహామంత్రి మాదన్న ట్రస్ట్, కుమారి వాసిరెడ్డి సీతాదేవి, శ్రీమతి ఎ. లక్ష్మీరమణ, నర్రా కోటయ్య, సి. మాధవరావు- తదితరులు, తోటకూర వేంకటేశ్వరరావు, కోటపాటి మురహరిరావు, పైడి సంజీవరెడ్డి. అనంతరం ముఖ్యమంత్రి వివిధ శాఖలలో పురస్కారం పొందిన వారిని, కళా కారులను, కవులను సత్కరించారు. కవి సమ్మేళనం తర్వాత తెలుగు విశ్వవిద్యాలయం రిజిస్ట్రార్ శ్రీ టి. డి. ప్రసాదరావు కృతజ్ఞతలతో ఉత్సవ కార్యక్రమం సమాప్తమైంది. వివిధ రంగాలలో పురస్కారం పొందిన వారు వీరు:- 1. శ్రీయుతులు రాణీ నరసింహశాస్త్రి- ఉత్తమ సంస్కృత విద్వాంసులు. 2. కుమారి వాసిరెడ్డి సీతాదేవి- ఉత్తమ రచయిత్రి. 3. ఆరుద్ర- ఉత్తమ గేయ కావ్యం. 4. కరుటూరి సత్యనారాయణ- ఉత్తమ పద్య కావ్యం. 5. డా. కేశవ రెడ్డి- ఉత్తమ నవల. 6. డాక్టర్ చల్లా రాధాకృష్ణ శర్మ- ఉత్తమ సాహిత్య విమర్శ. 7. డాక్టర్ కొలకలూరి ఇనాక్- ఉత్తమ నాటకం. 8. డాక్టర్ భీంసేన్ నిర్మల్- ఉత్తమ అనువాదం. 9. ఆకెళ్ల మల్లికార్జున శర్మ- ఉత్తమ లలిత కళాగ్రంధం. 10. శ్రీమతి మల్లాది సుబ్బమ్మ- ఉత్తమ ఇతర గ్రంథం. 11. కీ. శే. పైడి లక్ష్మయ్య- సృజనాత్మక సాహిత్యం. 12. డాక్టర్ ముకురాల రామిరెడ్డి- పరిశోధన. 13. శ్రీ ఎన్. వి. గోపాలశాస్త్రి- హాస్య రచన. 14. త్రిపురనేని సుబ్బారావు- జీవిత చరిత్ర. 15. రావిపూడి వేంకటాద్రి- హేతువాదం. 16. శ్రీమతి రామలక్ష్మి ఆరుద్ర- ఉత్తమ రచయిత్రి. సత్కారం పొందిన



కళాకారులు వీరు – 1 శ్రీయుతులు వీరణాల ఆదిదేవుడు– పగటి వేషం 2 భూసురపల్లి ఆది శేషయ్య– డోలు 3 బి ఇంద్రసేనా రెడ్డి– కళారాధకులు 4 ఎ ఎం రమ్మో సాహెబ్– బుర్రకథ 5 కోగంటి గోపాల కృష్ణయ్య– జానపద కళలు 6 జి దోలానంద్– విలు విద్య 7 బౌలా నరసింహదాసు– కోలాట 8 కె ఎల్ నరసింహరావు– నాటకం 9 పిఠాపురం నాగేశ్వరరావు– సంగీతం 10 ఎ హెచ్ నెట్టిప్ప– నాటకం 11 బొమ్మరాజు పాండు రంగారావు– తరంగ భజన 12 గూడూరు పాపరాజు– వీధి నాటకం 13 బుగ్గా పాపయ్య శాస్త్రి– సంగీతం 14 ఎస్ పుల్లయ్య– చక్క బజన 15 కోరాడ పోతప్పుడు– తొప్పటగుళ్ళు 16 మడిపడగ బలరామాచార్యులు– చిత్రకళ 17 సోమంచి యజ్ఞన్న శాస్త్రి– నాటకం 18 శ్రీమతి రజనీ నాగరాజు– నాటకం 19 వేదాంతం రత్తయ్య శర్మ– నాటకం 20 రేబాల రమణ– నాటకం 21 పెమ్మరాజు రాజ గోపాలరావు– సంగీతం 22 వనారస రామకృష్ణ– తోలుబొమ్మలాట 23 మాటేటి రామప్ప– జ్యోతిషం 24 నెమలి రామలింగా రెడ్డి– కోలాటం 25 గొరవ లక్ష్మయ్య– గొరవయ్యలు 26 అమ్ముల విశ్వనాథ భాగవతార్– హరికథ 27 శ్రీమతి వెంకటరత్నం బాగవతారిణి– హరికథ 28 కొల్లి వెంకట్రామయ్య– శిల్పం 29 దివాకరుని వెంకట సుబ్బారావు– జ్యోతిషం 30 ఎ వెంకటయ్య– కళ. 31 తిరుమల శేషాచార్యులు– నాటకం 32 మునుగంటి శ్రీరామమూర్తి– గానకళ సంపాదకులు 33 రాచమాని శ్రీరాములు– నాటకం. 34 శ్రీమతి విష్ణుభొట్ల సరస్వతి– సంగీతం 35 శ్రీమతి గూడూరు సావిత్రి– నాటకం 36 బోడావుల సీతారామయ్య– ఈలపాట 37 ఎస్ సుబ్బారావు– కళ 38 కె హెచ్ ఎం సూగయ్య శాస్త్రులు– జ్యోతిషం 39 పెద్దింటి సూర్యనారాయణ దీక్షిత దాసు– హరికథ 40 వెలిదె హరిశంకర శర్మ– హరికథ

కావ్యగానం చేసి సత్కారం పొందిన కవులు వీరు – 1 శ్రీయుతులు కల్లూరు అహోబలరావు– సిందూపురం (రాలేదు) 2 తాళ్ళూరు ఆంజనేయులు– తిప్పసముద్రం 3 శ్రీమతి రెడ్డి కుసుమా రామారావు– హైదరాబాద్ 4 ,చేబ్రోలు చిన్మయ బ్రహ్మకవి– రాజమండ్రి 5 వానమామలై జగన్నాథాచార్యులు– కరీంనగర్ 6 జోళదరాశి దొడ్డన గౌడ– బళ్ళారి 7 వేముగంటి నరసింహాచార్యులు– సిద్దిపేట 8 డాక్టర్ ఎ ఎ ఎల్ నరసింహారావు– హైదరాబాద్ 9 శ్రీమతి కె పద్మజ– జీడిమెట్ల 10 జె బాపురెడ్డి– హైదరాబాద్ 11 సముద్రపు శ్రీ మహావిష్ణు– కర్నూలు 12 మధురవాణి మార్కండేయ– మార్కాపురం 13 ఉండేల మాలె కొండారెడ్డి– హైదరాబాద్ 14 ఎస్ మునిసుందరం– పుత్తూరు. 15. బృందావనం రంగచార్యులు– పరుచూరు. 16. మాదిరాజు రంగారావు– వరంగల్లు. 17. నందూరి రామకృష్ణమాచార్యులు– హైదరాభాద్ 18. నరాల రామారెడ్డి– ప్రొద్దుటూరు. 19 బి రాములు– నల్గొండ 20 బి ఎన్ రెడ్డి– హైదరాబాద్. 21. కపిలవాయి లింగమూర్తి– నాగర్ కర్నూలు. 22. శ్రీమతి కోకా విమలకుమారి– పెనుమాల్. 23. కనుమలూరి శివ కామయ్య– అప్పలాయగుంట. 24. డాక్టర్ తిరుమల శ్రీనివాసా చార్యులు– హైదరాబాద్. 25 షేక్ అలీ– దొనకొండ. 26. పోతుకూచి సాంబశివరావు– సికింద్రాబాద్

ఉత్సవ వ్యాఖ్యాత అయిన శ్రీ నాగభైరవ కోటేశ్వరరావును కూడ ముఖ్యమంత్రి సన్మానించారు ప్రారంభంలో వేదాశీర్వచనం చేసిన వేద పండితులను ముఖ్యమంత్రి సత్కరించారు. కుమారి విజయశ్రీ మా తెలుగు తల్లికీ మల్లె పూదండ మధురంగా గానం చేశారు

**ఉపశ్రుతి:–**

ఉగాది ఉత్సవ వేదికపై ఉత్తములకు సత్కారం జరుగు తున్నది. ప్రెస్ గ్యాలరీ నుంచి ఒకరన్నారు ఉత్తమ పత్రికా రచయితను కూడా సత్కరిస్తే బాగుండును– అని పత్రికల వాళ్ళంటే ఎవరికి పడుతుంది గనుక! నాలుగు గంటలూ అంతా ఓపికగా విన్న ఉత్తమ ప్రేక్షకుడ్ని సత్కరిస్తే బాగుండును– అన్నారు శ్రీ హుస్సేన్. □

## సీరియల్స్

ఇటీవల కాలంలో ఆంధ్రసచిత్ర వారపత్రిక ఎన్నో కొత్త అందాలను సంతరించు కొంది ఆంధ్రుల అహ్లాద రచయిత 'మల్లాది" గారి సీరియల్ వినాయకరావు పెళ్ళి" ఓ కలికితురాయి

– శివరామ్, మచిలీపట్నం

★ ★ ★

వినాయకరావు పెళ్ళి ప్రతీవారం కడుపుబ్బ నవ్విస్తుంది మల్లాదికి నా అభినందనలు!!!

– లంక వాసుదేవరావు, బొబ్బిలి

★ ★ ★

'పవిత్రపాపి చదువుతుంటే చాలా ఆసక్తికరంగా ఉంది "మరో మలుపు సీరియల్ దేవినేని ఉషగారు మేము ఊహించనంత బాగా వ్రాసారు

– ఎన్. శ్రీనివాసులు, కె నాగరాజు, హిందూపురం

## కథలు

అందాల తార 'అమల ముఖచిత్రంతో వెలువడిన సంచికలో "దొంగ కథ పసందుగా వుంది ఇంటిని ఎంత కట్టుదిట్టంగా కట్టినా అది బయటి దొంగల నుంచే తప్ప ఇంటి దొంగల నుంచి

## ఉత్తరాలు

( 7 వ పేజీ తరువాయి)

ఇసుమంతైనా రక్షణ కల్పించలేదు అనే సత్యాన్ని ఎంతో చక్కగా చెప్పారు ఈ కథలో!

"బొమ్మల పెట్టె' కథ టి ఎ ఓనర్స్ బాధలను కళ్ళకు కట్టినట్లు చూపించింది

– వక్కలంక రామారావు, అమలాపురం

★ ★ ★

ముద్దులొలికే అమల ముఖచిత్రంతో వెలువడిన 22,29–4–88 సంచికలో కథలలో 'ఓ వేకువ వెలుగులో కథ చాల ఆలోచించేదిగా వుంది

– ఎల్ ఎ సుబ్బయ్య, పద్మావతి, కళ, గూడూరు

## వ్యాసాలు

జయుదుబాషీ గారి న్యూఢిల్లీ లేఖ ఎంతో నిజాయితీగా వుంది తమస్ పై వాస్తవ విషయాల్ని ఎంతో నిర్భయంగా వెల్లడించిన వారి తెగువకి, సత్యదృక్పథానికి నా ధన్యవాదాలు అదే సంచికలో ప్రచురించిన 'మధురాలపై వ్యాసం ఎంతో ఆసక్తిదాయకంగా వుంది

– కె ఎ ఎ యస్ మూర్తి, భద్రాచలం

## శీర్షికలు

విజ్ఞానం– వినోదం" శీర్షిక వలన పెద్దవాళ్ళకు కూడా తెలియని ఎన్నో విషయాలు తెలియ జేస్తున్నారు – అకొండి వెంకటలక్ష్మి కుమారి, నవర

## హైదరాబాద్ నోట్‌బుక్

హైదరాబాద్ నోట్‌బుక్‌లో నాంపల్లి స్టేషన్ ఎదురుగా ఉన్న పరిస్థితిని గురించి విచారించారు. నాయకులు వీటిని ఎందుకు చూడరు అని ప్రశ్నించారు. అసలు నాయకులు వేటిని చూస్తున్నారు? చూసినా పరిస్థితిని అదుపులోకి తీసుకు వచ్చే దమ్ము ఏ నాయకుడికి ఉంది? దేశంలో "లా అండ్ ఆర్డర్" ఉంటేగదా!

– కొండిపర్తి, హైదరాబాద్

## ధర్మపథం

పుణ్య తీర్థ క్షేత్రాలు దర్శించే వారు పాపాలకు భయపడతారు. పుణ్యానికి ప్రయత్నిస్తారు. యీ సందేశాన్ని తమ "ధర్మపథం" శీర్షికలో శ్రీ బులుసు వేంకటరమణయ్య చక్కగా వివరించారు.

– జిట్టా రమణిమోహన్, కడప □

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada . 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667

